# శ్రీమాత, శ్రీవిద్య, శ్రీచక్రం







ప్రచురణ

A. G. ప్రసూన

# శ్రీమాత, శ్రీవిద్య, శ్రీచక్రం





ప్రచురణ

A. G. ప్రసూన

కాపీలు : 1000

వెల : రూ.



ప్రతులకు :

**A.G. ప్రసూన**

స్థితప్రజ్ఞ

4-6-28, రిజర్వాయర్ కాలనీ,

తిరుపతి.




"ఆధ్యాత్మిక గ్రంథప్రచురణకు సహాయముఅనే పథకము క్రింద, తిరుమల-తిరుపతి దేవస్థానం వారు ఇచ్చిన ద్రవ్య సహాయముతో ఈ గ్రంథం ప్రకటింపబడినది."

ముద్రణ:

శ్రీసత్యసాయి ప్రింటర్స్,

తిరుపతి.

డిసెంబరు - 1994

# స్వకాప్రశము

శ్రీమాత, శ్రీవిద్య, శ్రీచక్రములు పేరుకావయు, ఈమూడున్నూ ఒకే పరబ్రహ్మమని ఎవరు తెలుసుకొనుచున్నారో వారికి ధర్మార్థ కామములైన త్రివర్గము అక్షయముగా లభించుటయే గాక, వారికి కైవల్యపదము, నిర్వాణ సుఖము తప్పక లభించునని శ్రీ లలితా సహస్రనామస్తోత్రము ప్రమాణము చేసి చెప్పుచున్నది. వాగ్దేవతలు శ్రీమాతయొక్క నిర్గుణ సగుణ రూపములను, ఆ దివ్యమంగళమూర్తి యొక్క కేశాది పాదపర్యంతము ఆ అవయవశోభనూ, ఆమె ధరించిన వస్త్రాభరణకాంతులను, ఆమెయొక్క అవతారములను, వాటి ప్రయోజనములనూ, ఆమెయొక్క సర్వకళ్యాణగుణములనూ కీర్తించిరి. వారు శ్రీషోడశాక్షరీవిద్య, ఆత్మవిద్య, బ్రహ్మవిద్య, చంద్రవిద్య, మనువిద్యలను శ్లాఘించిరి. కౌళాచారము, సమయాచారము, వామాచారము దక్షిణాచారములను, కుండలినీవిద్య, గ్రంథివిభేదము, జీవాత్మపరమాత్మలో వికృతమగుట - వీటన్నింటిని శాస్త్రోక్తముగ సహస్రనామములుగా వివరించిరి. అందులోనే భక్తి, ధ్యాన, కర్మ, రాజయోగాదులను కూడ వివరించి మోక్షోపాయములను బోధించిరి. శ్రీ దేవికి, శ్రీచక్రానికి ప్రతీక శ్రీచక్రమనియూ సిద్ధాంతీకరించిరి.

అయితే ఈ వివరములు ఒక క్రమములో లేవు. నిశితముగా పరిశీలించినగానీ ఆక్రమము బోధపడదు.-

అందుచేత శ్రీలలితా సహస్రనామములను కొన్ని శీర్షికలుగా విభజించుకొని, ఏ నామములు ఏ శీర్షికకు చెందినవో వాటిని వివరించుటయే ఈ గ్రంథోద్దేశ్యము.

ఈ పద్ధతిలో ఈ రహస్యనామములను విభజించి ప్రచురించ వలసినదిగా పురికొల్పి, ముద్రణ పూర్తియగువరకు బాధ్యత వహించిన పితృసమానులు శ్రీ పవని - వేణుగోపాల్ గారికి,

వేదవిదులు, వేదాంతకోవిదులు, అర్ష విజ్ఞాన ఘనస్వరూపులు, రాష్ట్రీయ సంస్కృత విశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీమాన్ S. B. రఘునాథాచార్యులవారికి, బౌద్ధ, జైన, వైష్ణవ, శైవ, శాక్త అగమశాస్త్ర నిష్ణాతులైన డాక్టర్ M. సంగమేశం గారికి, శ్రీ విద్యా దీక్షాపరులైన డాక్టర్ K. భాస్కరరావుగారికి ఈ గ్రంథమును ప్రచురించుట యుక్తమని దీవించినవారికి, కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఈ గ్రంథమును సకాలములో అందముగా ముద్రించి యిచ్చిన శ్రీ సత్యసాయి ప్రింటర్స్ అధినేత శ్రీ డి. యస్. పి. రామకృష్ణకు నా హృదయపూర్వక అభినందనలు -

దేవీపాదసేవార్చకురాలు

"గాయత్రి"

# అంకితము



## శ్రీకాళహస్తీశ్వర సమేత శ్రీజ్ఞానప్రసూనాంబ

## పాదపద్మములకు

# విషయసూచిక

# శ్రీమాతా

శ్రీ విద్యాం జగతాం ధాత్రీం సర్గస్థితిలయేశ్వరీమ్
నమామి లలితా నిత్యాం మహాత్రిపుర సున్దరీమ్.

శ్రీ విద్యా స్వరూపిణియు, పదునాల్గు భువనములను ధరించియుండు నదియు సృష్టిస్థితిలయములను చేయునదియును మహాత్రిపుర సుందర రూపిణియగు లలితాంబకు నమస్కారములు:-

శ్రీమాతను గూర్చి మనము కొంచెమైనను తెలుసుకొనవలయునన్నచో మనము లలితా సహస్రనామములనే ఆశ్రయించవలయును. అవి రహస్యనామములు. ప్రతి నామమునందును అనేక రహస్యములు నిక్షిప్తమై యున్నవి. ఆ రహస్యములు నిగూఢమైనందున ఆ శ్రీదేవికే ఎఱుక.

శ్రీ మాతయొక్క స్వరూపమును, సగుణ నిర్గుణ రూపములను ఆమె అవతార అవసరమును, దాని ఆంతర్యమును, ప్రయోజనమును ఆమె యొక్క దివ్య మంగళ విగ్రహమును, అనంత కళ్యాణగుణములను, ఆమెను తెలుసుకొనుటకు సాధకుడు అవలంభించవలసిన సాధనా యోగములను, శ్రీవిద్యను, శ్రీచక్రమును, వీనిని తెలుసుకొనుటచే మానవునకు కలుగులాభములను వీటన్నింటినీ తెలుసుకొన కోరినవాడై

సర్వదేవతా పూజ్యుడు, సర్వశక్తిసంపన్నుడు, శ్రీదేవిని నిరంతరము పూజించే లోపాముద్ర భర్త అయిన అగస్త్యుల వారు, శ్రీహయగ్రీవుల వారిని ఆశ్రయించి భక్తి శ్రద్ధలతో వినయ సంపన్నుడై, శ్రీ లలితా సహస్రనామములను ఉపదేశింపుమని ప్రార్థించెను.

హయగ్రీవులవారు అగస్త్యుని అన్ని విధముల పరీక్షించి, వారికి ఈ సహస్రనామములను ప్రసాదించిరి. ఎన్నియో సహస్రనామములున్నవి. వాటన్నిటి కన్నను ఇది మహామహిమాన్వితమైనది. ప్రతినామము ఒక మహామంత్రము వంటిది. వీనిలో సర్వ వేదసారము, ఉపనిషద్రహస్యములు, సర్వతంత్ర ఆగమ నిర్దేశ్యములు, పురాణ లక్ష్యములు, సాధనా విధానములు, ఆ సాధనల వలన కలుగు లాభములు అన్నియు ఉపదేశింపబడి యున్నవి.
హయగ్రీవుడు చెప్పుచున్నాడు.

ఆనందోల్లాసముముతో పొంగుతూన్న సుధాసాగరమధ్యమందు విరాజిల్లెడు మణిద్వీపమందు, కల్పతరువులతోకూడిన వనరాజములో, కదంబవృక్షములతో శోభిల్లు ఉద్యానవనములో, రత్నములు తాపిన సహస్రస్తంభమంటప మధ్యమందు, చింతామణి గృహమందు రత్న సింహాసనాసీనయై శ్రీ లలితా పరాభట్టారిక కొలువుతీరి యుండెను. ఆమెను సేవించుటకై అనేక కోట్లు సరస్వతులతో కూడిన చతుర్ముఖులు, కోట్లకొలది లక్ష్మీనారాయణులు కోట్ల సంఖ్యలుగల గౌరీ రుద్రులు వచ్చియుండిరి ఈ విశ్వములో అనేక కోట్ల బ్రహ్మండము లున్నవి. వాటిని సృష్టించి, రక్షించి, లయింపజేయు త్రిమూర్తులు వారి వారి దేవేరులతో కూడ కోట్ల సంఖ్యలలోనే యున్నారు. వారందరూ దేవి అజ్ఞానువర్తులే. అందుచే దేవిని సేవించుటకై ఆ సభకు విచ్చేసిరి.

వాక్కులకే దేవతలయిన, వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, సర్వేశ్వరి, కౌళినీ అను నామములుగల వాగ్దేవతలు లేచి, ఆ సభలో సహస్రనామములచేత శ్రీదేవిని స్తుతించిరి. ఆస్తోత్రములను విని శ్రీ లలితాదేవి సంతోషించినది. ఆ సభలోని వారందరూ ఆశ్చర్యచకితులైరి. అప్పుడు శ్రీదేవి ఆ సభలోని వారిని ఉద్దేశించి ఈ విధముగా ఆదేశించినది. "ఈ స్తోత్రమును మా ఆజ్ఞచే, మా ఆమోదముతో, ఈ దివ్య సహస్రనామములను వాగ్దేవతలు చేసిరి. మీరు

నిని ఎల్లప్పుడూ పారాయణము చేయుటయే గాక, దీనిని ప్రపంచ
ంతటా బహుళ ప్రచారము గావింప వలయును. దీని నెవరైననూ
క్కమారు పారాయణము చేసినను, వానికి మా అనుగ్రహము కలు
ను. శ్రీ చక్రమందు నన్ను పూజించి, పంచదశీ మంత్రమును
పించి, ఈ సహస్రనామ పారాయణము చేయవలయును. ఒకవేళ
కు శ్రీచక్రమును పూజింపలేక పోయినను, పంచదశీ మంత్రమును
పించలేకపోయినను, సహస్రనామ పారాయణము చేయుచుండినచో
తనికి ఇహపరసౌఖ్యములు కలుగును." ఆమె ఆజ్ఞానుసారముగ
్రిమూర్తులును, శ్యామల మున్నగు శక్తులును, మంత్రిణీ మొదలగు
రును, మహర్షులును, భక్తులెల్లరూ సహస్రనామ పారాయణము
యుచున్నారు. ఆ సహస్రనామములను నీకు వినిపించుచున్నాను.
మునీశ్వరా! శ్రద్ధాళువై వినుము".

ఇది బ్రహ్మాండ పురాణమందలి హయగ్రీవాగస్త్య సంవాదరూప
ున శ్రీ లలితా సహస్రనామముల ప్రవచనమునకు (సంక్షిప్త)
ూర్వభాగము.

అరుణాం కరుణా తరంగి తాక్షీం
ధృతపాశాంకుశ పుష్పబాణచాపామ్
అణిమాదిభిరావృతాం మయూఖై
రహమిత్యేవ విభావయే భవానీమ్

అనాదియు, అపౌరుషేయము అయిన వేదత్రయ రూపిణి:
్రయీ (872) సర్వోపనిషదుద్ఘుష్టా (852) సర్వోపనిషత్తులు ఆమె
లుగెత్తి చాటుచున్నవి. ద్వైతభావమును నశింపజేసి పరబ్రహ్మము
కు సమీపమునకు చేర్చునవి ఉపనిషత్తులు. అట్టి ఉపనిషత్తు
చే కీర్తింపబడు చున్నది. శ్రుతి సంస్తుత వైభవా (929) ఆమె

ఆజ్ఞ వల్లనే వేదమునసుసరించు నిగమములైన ఇరువది ఎన్మిది కామికాది వైదికతంత్రములు పుట్టినవి. అవి శివుని పంచముఖములనుండి పుట్టినవి. శివుని సద్యోజాత ముఖమునుండి ఐదు తంత్రములు, వామదేవ ముఖము నుండి దీపాది ఐదు తంత్రములు, అఘోర ముఖము నుండి విజయాదులు ఐదు. తత్పురుష ముఖమునుండి వైరోచనాదులు ఐదు. ఈశాన ముఖమునుండి ప్రోద్గీథులు ఎనిమిది, మొత్తము ఇరవై ఎనిమిది. ఆమె ఆజ్ఞ వల్లనే పుట్టినవి. నిజాజ్ఞారూపనిగమా :- (287) వేదభాగములైన కర్మ, ఉపాసనాకాండములు దేవిని గూర్చి చెప్పబడినవే. వేదాంతభాగములైన ఉపనిషత్తులు బ్రహ్మమును తెలుపును. అవి కూడ ఆమెను పరిపూర్ణముగ వర్ణించలేక పోయినవి. వేదాంత రహస్యములనబడు ఆమె పాదధూళిని ఉపనిషత్తులు తమ శిరోజములలోని పాపటయందు ధరించినవి. శ్రుతి సీమంత సింధూరీకృత పాదాబ్జ ధూళికా (289) వేదములు నిగమములు, ఉపనిషత్తులు ఆమెను కీర్తించుచున్నవి. ఇవి అగ్రివర్ణముల వారి కొరకే ఏర్పడినవి. ఇవి బ్రహ్మముఖమునుండి వెలువడినవి. సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా (290) ఇవి దేనియొక్క నాసాభరణమందలి ముత్యములుగా నున్నవి. అనగా అన్ని ఆగమశాస్త్రములు ఆమెను కొనియాడుచున్నవి. శైవ వైష్ణవాగమములు ద్వైత విశిష్టాద్వైత మతములను బోధించును. కానీ శాక్త తంత్రములన్నియును అద్వైతమునే బోధించుచున్నవి. దేవిని ఉపనిషత్తుల వలననే తెలుసుకొనుటకు సాధ్యము. సర్వ వేదాంత సంవేద్యా (645), వేదవేద్యా (335) వేదములచే తెలుసుకొనవచ్చును.

ఉపనిషత్తులు, నిగమములు, శాక్తాగమములు, వేదములన్నియు ఆమెయే పరబ్రహ్మమనియు, బ్రహ్మాణి (821,822) అనియు, సర్వం ఖల్విదం బ్రహ్మ, ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, అనియు, ఒకే పరమసత్యమును తెలుపుచున్నవి. ఆ బ్రహ్మమును,

తెలుసుకొన్నవాడు బ్రహ్మమే అగును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి"; అహం బ్రహ్మస్మి; బ్రహ్మైవాహమస్మి అను అద్వైత సిద్ధిని పొందు నని చాటిచెప్పుచున్నవి:-

మనోవాచామగోచరా (415) ఆ పరబ్రహ్మము మనస్సుకు వాక్కులకు గోచరము కాదు. యతోవాచో నివర్తంతే అప్రాప్యమన సాసహ" అని తైత్తిరీయ ఉపనిషత్తు వర్ణిస్తుంది.

విష్ణు పురాణంలో ప్రహ్లాదుడు "యాతీతగోచరావాచాంమనసాం చావిశేషణా జ్ఞానిజ్ఞాన పరిచ్ఛేద్యాత్యామీశ్వరీ పరాం" మనోవాక్కుల కతీతమై జ్ఞానుల జ్ఞానములకు మాత్రమే గోచరమై యుండు పరమే శ్వరికి మ్రొక్కెదను. ఆమె నామరూప వివర్జితా (300) నామ రూపములుండునది జగత్తు. బ్రహ్మము కాబట్టి నామరూపములులేవు. ఏదో ఒక రూపముండిన ఎడల నామరూపము లుండును. ఆమె నిరాకారా (137) బ్రహ్మమునకు ఏ గుణములును లేవు. నిర్గుణా (139) దేవ, దానవ, స్త్రీ, పుం, నపుంసక, గుణము లేవియు లేవు. "సాక్షీ చేతా, కేవలో, నిర్గుణశ్చ" అని శ్రుతి ప్రమాణము పైగా- అపరిచ్ఛేద్యా (642) ఇంతది, ఇట్టిది అని చెప్పుటకు వీలుకాదు. దేశకాలా పరిచ్ఛిన్నా (701): బ్రహ్మము సకల ప్రపంచముల కన్ననూ. సకల కాలముల కన్ననూ ముందుండి, ఇప్పుడు వుండి ఇక ముందుకూడా వుంటుంది. సకల వస్తు భేదము లేనిది. ఇతర వస్తువులన్నియు, ఒక కాలమందు ఒకచోట మాత్రమే యుండగలవు.- అన్ని కాలములందు, అన్నిచోటు లందును యుండలేవు., భావాభావ వివర్జితా (680) భావములు = ద్రవ్య గుణ, సామాన్య, విశేష, సమవాయములు. అభావములు ప్రాగ భావ ప్రధ్వంసాభావ, అత్యంతాభావ, అన్యోన్యాభావములు. ప్రతి పదార్థ

మునకును, ప్రతిభావమునకును ఈరెండు లక్షణము లుండును. అట్టివి లేవు. అందుచే అది — అచింత్య రూపా (554) నిస్త్రైగుణ్యా (789) చింతించుటకు ఊహించుటకు వీలులేనిరూపము గలది. త్రిగుణములు లేనిది. సత్త్వరజస్తమో గుణములు లేవు. నిస్తులా (184) ఉపమానము లేనిది. మరొక వస్తువు దానికి సమానము గానీ, అధికమైనది గానీ యున్న ఎడల పోల్చిచెప్పవచ్చును. సమానాధిక వర్జితా (198) నిరాధారా (132) వేరొక అధారము లేనిది. అవసరము కూడా లేదు. ఎందుకంటే బ్రహ్మమే — సర్వధారా (659) అన్నింటికీ అదే అధారము. నిరంజనా (133) అంజన మనగా అజ్ఞానము. అది లేదు. "నిరవద్యం - నిరంజనం" అని శ్రుతి. - నిర్భవా (174) పుట్టుకయే లేదు. జన్మ యుండినచో అజ్ఞానాదులుండును. అన్నిటికి మూలశక్తి కారణ బ్రహ్మము — "అనాది మత్పరం బ్రహ్మ" శ్రుతి, బ్రహ్మమునకు అది లేదు. అజా (866). పుట్టుకయే లేదు. ఉండేది "ఒక్కటే" శ్రుతి "అజమేకాం" మహాభారతమందు "నహిజాతో, నజాయేఽహం నజనిష్యే కదాచన" = నేను పుట్టుట లేదు. పుట్టబోను.- క్షయవినిర్ముక్తా (867) పుట్టుకలేక పోయినను మరణముండవచ్చునేమో. అను సందేహమునకు తావులేకుండా క్షయము అనగా మరణము లేనిది. (అని చెప్పుచున్నది నామము) నిర్లేపా (134) = మాయగానీ, కర్మలుగానీ లేనిది. నిర్మలా (135) అణవ, కార్మిక, మాయిక మలములచే అనగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను ఆవరించుమలములు లేనిది. బ్రహ్మమీ మూటినీ దాటినది.....

నిత్యా (136) సృష్టి, స్థితి లయములచే, భూత భవిష్యద్వర్తమానములచే బాధింపబడక సర్వకాల సర్వావస్థలయందుండునది. "అవినాశీ వారేఽయమాత్మా" ఈ ఆత్మ నశింపనిది. బ్రహ్మము నిరాకులా

(138) అవిద్యాసంబంధముచే కలత చెందనిది. ఆకులత్వము ఏమియు లేకుండుట – శూన్యము కాదు. పరిపూర్ణము. నిష్కలా (140) కళలు అనగా అంశములు. అంశములులేనిది. అవయవములులేనిది. బ్రహ్మ సూత్రము:– "అంశోనానా వ్యపదేశాత్" అంశమనగా జీవుడు. అతడు పరబ్రహ్మాంశమే. "మమైవాంశోజీవలోకే" = నా అంశమే జీవలోకము. ఈ అంశము లన్నియు గుణ సంబంధములే. నిర్గుణ చింతయే నిష్కల. "ధ్యానం యా నిష్కలా చింతా, నిరాధారా, నిరాశ్రయా, నతుధ్యానం శరీరస్య ముఖ హస్తాది కల్పనే" ధ్యానమనునది నిష్కల చింత. అది నిరాధారము. నిరాశ్రయమై యున్నది. ముఖ హస్తాదులచే చేయునది ధ్యానము కాదు. నిష్కల యనగా కళాతీత, నిర్గుణ పరబ్రహము. నిర్వికారా (145) ఏ వికారములు లేనిది. ముప్పది ఆరు తత్త్వము లన్నియూ పర బ్రహ్మము యొక్క వికారములు. మూలప్రకృతికెటువంటి వికారములు లేవు. ప్రకృతి వికారములు చెందును. కాని ఆత్మ వికారము చెందదు. "మూలప్రకృతిరవికృతి, మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త షోడ శకస్తు వికారోన ప్రకృతిః నవికృతి పురుష":– నిష్ప్రపంచా (146):– నిర్గతమైన ప్రపంచము కలది. బ్రహ్మాండము లకు మించిపైన యుండునది. "ప్రపంచోపశమం, శాంతం, శివ మద్వైతం చతుర్థం మన్యంత" అని మాండూక్య ఉపనిషత్"– నిరాశ్రయా (147) ఇతర యే ఆశ్రయములు లేదు. బ్రహ్మయే సర్వమున కాశ్రయము– అది స్వయం ప్రకాశము. "విశ్వం ప్రతిష్ఠితం యస్యాం తస్యాః కుత్ర ప్రతిష్ఠితి" ఎవతె యందు విశ్వమున్నదో ఆమెకు మరే ఆధారముండును.? నిరవద్యా (150) ఆమె అనింద్య, దోషరహిత, అవిద్యాజన్యములైన వికారములు ఏవియు లేవు. నిరంతరా (151) అంతరము. ఎడము, రంధ్రము, మధ్య ప్రదేశము.

వ్యవధానము. పరమాత్మకు అన్యమైన అంతరము. ఇటువంటివేవీ లేనిది. "య ఏతస్మిన్ ఉదరమంతరం కురుతే అథతస్య భయం భవతి" (తై ఉప: 2-7-1) ఎవడాత్మ యందు ఏపాటి భేదమునైనను పాటించుచున్నాడో వానికి భయములు కలుగును. భేదములు ఛిద్రములు లేనిది. నిష్కారణా (152) అన్నింటికీ కారణమైనది. "మహాపద్మ వనాంతస్థాంకారణానంద విగ్రహాం" అమృత కారణముచే కలుగు ఆనంద స్వరూపిణి:- నిష్కళంకా (153) కళంకము = పాపము. ఏ పాపములు లేనిది. "శుద్ధం - అపాప విద్ధం" శ్రుతి:- నిరుపాధిః (154) అవిద్యారహితమైన చిత్స్వరూపిణి:- ఉపాధి యనగా: తన సమీపమందున్న దానికి తన ధర్మములను కలుగజేయునది. దాసాని పువ్వును స్ఫటికము దగ్గర నుంచినచో దానికి తన ఎరుపురంగు నిచ్చును. అదియే ఉపాధి. అవిద్యయే జీవునకుపాధి. అది "చిత్" నందు భేద బుద్ధిని కలిగించును. అట్టి భేద బుద్ధి లేనిది. నిరీశ్వరా (155) దానిని శాసించు వారెవ్వరూ లేరు. ఆమెయే సర్వేశ్వరి. నిర్వికల్పా (176) ఎట్టి వికల్పములు లేనిది. శూన్య విషయకమైన శబ్దమునుండి పుట్టిన జ్ఞానమునకు వికల్పమని పేరు. "శబ్దమాత్రానుపాతీవస్తుశూన్యో వికల్పః" (పతంజలి, యో.సూ.) శూన్యమనగా వస్తు జ్ఞానము కలుగునపుడు, లేనపుడు శబ్దమాత్రముచే తెలుపు అభిప్రాయము వికల్పము "బుద్ధిసిద్ధం తత్ అసత్" గౌతమ సూత్రము: బుద్ధిచే తెలుసుకొనబడిన దంతయు అసత్. అట్టిది లేదు కాబట్టి నిర్వికల్పా: 2) ధ్యానము యొక్క చరమావస్థ నిర్వికల్పస్థితి. 3) కల్పము : పక్షము. వికల్పము : విరుద్ధమైన పక్షము. ఆమె స్థితిని ఎదిరించువాదము లేదు. అంతయు ఆమె యందే గలదు. ఆమెకు భిన్నమైన దేదియు లేదు. నిరాబాధా (177) జగదాది భ్రాంతిబాధా రహితురాలు. శుక్తి యందు

రజత భ్రాంతి, త్రాడు నందు సర్ప భ్రాంతి కలిగినను, జ్ఞానముచే ఆ భ్రాంతి తొలగగ, భ్రాంతి బాధారహితురాలగుచున్నది. నిర్భేధా (178) సత్ అసత్ అను భేదములు లేనిది. "త్వంహిసా పరమాశక్తిః అనంతా పరమేష్ఠినీ సర్వభేద వినిర్ముక్తా సర్వభేద వినాశినీ" (కూర్మ పురాణం): నీవే ఆ పరాశక్తివి. అంతము లేనిదానవు. పరమేష్ఠివి. అన్ని భేదముల నుండి విడివడిన దానవు. సర్వభేదములను తొల గించు దానవు. అదే పురాణంలో "శక్తి శక్తి మతోర్భేదం వదంత్య పరమార్థతః, అభేదం నానుపశ్యంతి యోగినస్తత్వ చింతకా" శివశక్తు లకు భేదము కలదని అజ్ఞానులు చెప్పుచున్నారు. కాని యోగులు,తత్వ చింతగలవారు అభేదమునే గాంచుచున్నారు. నిర్నాశా (180) నాశ నముకానీ అంతముగానీ లేనిది. ఆది మధ్యాంతములు లేనిది. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని శ్రుతి; నిష్క్రియా(182) ఆ పరబ్రహ్మ మునకు చేయవలసిన పనులు కానీ, చేయకూడని పనులు కానీ లేవు. "అశరీరం వావసంతం నప్రియా ప్రియే స్పృశత" (ఛాందో, ఉప: 8-12-1) శరీరము లేనివాడై ఏకముగ నుండు వానికి ప్రియాప్రియ ములంటవు. ఆమెకు విధి నిషేధములు లేవు. ఆమెయే కర్త, కార ణము అయి జగదాదుల సృష్టించును. నిరపాయా (186) అపాయ మనగా నాశము. నాశము లేనిది. అదృశ్యా (649) కనిపించనిది. ఇంద్రియాదులచే తెలుసుకొనుటకు సాధ్యము కానిది. "నదృష్టేః ద్రష్టారం పశ్యేత్" నీవు నీకంటితో బైట యుండు వాటిని చూడ గలవు గానీ, అట్లు చూచు నిన్ను, నీ కంటితో నీవుచూడలేవు. ఏ గుణ ములు గానీ ఆకారములు లేనందువల్ల దృగ్గోచరము కాదు. దేవీ భాగవతం తృతీయ స్కంధము కూడా ఈ విషయమును చక్కగా బోధించుచున్నది. దృశ్య రహితా (650) దృశ్యమంతయు ప్రావం

చికమే విషయ రహితమైనది. సంజ్ఞాన స్వరూపిణి.- విజ్ఞాత్రీ (651) సకలము దానికి తెలుసును. "విజ్ఞాన తార మనేకేన విజానీయాత్" (శ్రుతి) అనేకములుగనున్న వానిచే తెలుసుకొనదగిన వానిని ఎరుగ దగును. వేద్య వర్జితా (652) ఆమె ఎరుగదగినవి మరేవియునులేవు. సర్వజ్ఞురాలు. ఏకాకినీ (665) రెండవది లేనిది. "ఏకైవ లోకాన్ గ్రసతి, ఏకైవ స్థాపయత్యపి, ఏకైవసృజతే విశ్వం తస్మాదేకాకినీ మాతా" = ఆమె ఒకతెయే లోకములను లయింపజేసి, పుట్టించి, పోషించును. అందుచేత ఏకాకినీ: భూమరూపా (666) ఏకాకిని యయ్యు అనేక రూపములతో భాసించుచున్నది - "యత్రనాన్యత్పశ్యతినాన్య చ్ఛృణోతి.... యోవై భూమా తత్సుఖం" ఏది సుఖమో అది భూమ అదియే బ్రహ్మము. భూమ అనగా అనేకము. శ్రుతి. "ఏకా కామేశ్వరీ శక్తిః అనేకోపాధియోగతః పరావరణ రూపేణ క్రీడతేతస్య సన్నిధౌ" కామేశ్వరి ఒక్కటి యయ్యు అనేకోపాధులను పొందుటచే అనేక రూపములతో నాతని ఎదుట పరాశక్తిగను, వేఱుగను క్రీడించుచున్నది. అమేయా (616) ఇంత అని కొలుచుటకు, తూచుటకు సాధ్యము కానిది. ఆత్మా (617) యచ్చాప్నోతియదాదత్తేయచ్చాత్తి విషయాన్విహ యచ్చాస్యతతోభావః తస్మాదాత్మేతి కీర్త్యతే"- ఏది పొందునో, ఏది గ్రహించునో, ఏది విషయముల ననుభవించునో, ఏది సర్వకాలములందుండునో- అది ఆత్మ- పరమా (618) బ్రహ్మమే:- దానికి నాలుగు రూపములు గలవు. 1) పురుషుడు 2) వ్యక్తము 3) అవ్యక్తము 4) కాలము ఈ నాల్గింటినిమించి యున్నది. ఈ నాలుగున్ను విశ్వస్థితికి హేతువులు.- కేవలా (623) ఎటువంటి ధర్మములు లేకుండా ఒంటరిగా యుండునది. కేవల మనగా పూర్ణము. "తద్విముకస్తు కేవలీ" దాని నుండి విడివడినది కావున కేవలా: పూర్ణా (292)

పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే (శ్రుతి) అది పూర్ణము. ఇది పూర్ణము. ఆ పూర్ణము నుండి ఈ పూర్ణము వచ్చుచున్నది. ఈ పూర్ణమును తెలిసికొనినచో ఆ పూర్ణమొక్కటియే మిగులును. త్రిపురా (626) త్రిమూర్తుల కంటె పూర్వముండునది. తత్వత్రియమున కంటె పూర్వ ముండునది. మూడు అను అంకెలచే చెప్పబడు, నాడీత్రయము, గుణత్రియము, శక్తిత్రియము, దేవత్రయము, అగ్నిత్రియము, అవస్థాత్రియము లన్నింటికీ పూర్వమే యుండునది. ద్వైత వర్జితా (667) ఇంతకు పూర్వము భూమరూపా యని చెప్పియుంటిమి. అనేక రూపములతో ప్రకాశించుచున్నదని వివరించితిమి. అవన్నియు పరబ్రహ్మమునకు భిన్న రూపములు కావు. ద్వైత రహితురాలు. ద్వైత ధర్మములు అనిత్యములు. ద్వైత వర్జితా (668). ఒకప్పుడు ద్వైత ముండి పిదప లేకపోవుట కాదు. ద్వైతము వాస్తవము కాదు. సార్వకాలికము కూడా కాదు. ఎట్టి భేదములు లేనిది. సర్వోపాధి వినిర్ముక్తా (708) ఎట్టి సంబంధములులేనిది. త్రాడునందు సర్పతాదాత్మ్యము పొందుట అనుసంబంధమెట్లు అబద్ధమో అట్లే దేవికి కూడా ధర్మసంబంధము లబద్ధములు. ఆమె కెట్టి ఉపాధులు లేవు. అద్వైతమూర్తి, మిథ్యాజగదధిష్ఠానా (735) శుక్తి యందు రజత భ్రాంతికి ఆధారమైనట్లు అసత్యరూపమైన జగత్తుకు ఈమె ఆధారము. "మాయామాత్రమిదం ద్వైతం అద్వైతం పరమార్థతః" ద్వైతబుద్ధి మాయచే కల్పింపబడునది. అద్వైతమే పరమార్థము. "నేహనానాస్తి కించన". ఇందు కొంచమైనను నానాత్వము లేదు. "సర్వం ఖల్విద మేవాహం నాన్యదస్తి సనాతనం" [దేవీ భాగవతం] ఇదంతయు నేనే. మిథ్యాజగత్తు ఆమె యందు ప్రతిష్ఠింప బడినది. సర్వమోహినీ (703) నిత్యత్వము, అనిత్యత్వము, జడము చేతనము మొదలగు విరుద్ధ ధర్మముల సమావేశము కలది - అనగా భేద బుద్ధిని, ద్వైతబుద్ధిని

నిజమనుకొను పామర జనులను మోహింపజేయును. జగత్తు సత్య మను భావము మోహము వలననే కలుగుట వలన అది కేవలము భ్రమ మాత్రమే. బ్రహ్మముతో చేరిన మాయాశక్తి సృష్టికి హేతువు. కూర్మపురాణంలో "ఇయంసా పరమాశక్తిః మన్మయీ బ్రహ్మరూపిణీ, మాయా, మమప్రియానంతా, యయేదం మోహితం జగత్" ఈ పరాశక్తి నామరూపములు గలది. నాతో నిండినది. బ్రహ్మ రూపిణి. మాయ. నాకు ప్రియురాలు. అంతము లేనిది. ఆమెచే జగమంతయు మోహింపబడుచున్నది. క్షరాక్షరాత్మికా (757) సర్వభూతములు క్షర ములు. అందుండు కూటసుడు అక్షరుడు - ఈ రెండున్నూ తన స్వరూ పముగా గలది. క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే (భగీ); సర్వగా: (702) ఇంతకు పూర్వము 70వ నామము దేశకాలా పరి చ్ఛిన్నా అని చెప్పుచున్నది. దానికి వివరణయే యీ నామము. సర్వవస్తువులను అభేదముచే పొందుచున్నది. "దేవి ఒకప్పుడు శ్వేత పర్వతమందు తపస్సుచేయుచుండగ, బ్రహ్మ ప్రత్యక్షమై వరమును కోరుకొనుమనెను. దేవి అప్పుడు తాను ఒకచోట యుండుటకు సమ్మతిం చననియు, అందుకు తనకు సర్వగతము అను వరము నిమ్మని కోరు కొనెను." అని వరాహపురాణంలో కథారూపమున చెప్పబడి యున్నది. ఆనాటినుంచి దేవి సర్వాంతర్యామినియై, అన్ని క్షేత్రములందు (దేహ ములందు) యుంటున్నది. అనగా అన్నిటికి వేరుకానిది బ్రహ్మము. కల్పనారహితా (858) వాసనామయములైన దృశ్యమానమను జగ ద్వ్యచికలు లేనిది. అవన్నియును మన మనోకల్పితములే. అష్టావక్ర గీతలో "మయ్యనంతే చిదంభోధౌ ఆశ్చర్యం జీవ వీచయః ఉద్యంతి, ఘ్నంతి, ప్రవిశంతి స్వభావతః" - చిత్సాగరమైన అనంతమైన నా యందు జీవుడనెడి అలలు స్వాభావికముగనే పుట్టును, నశించును- దుఃఖించును. ప్రవేశించును." ఇటువంటి కల్పనలు లేవు. కార్య

కారణ నిర్ముక్తా (862) కార్యములు = మహత్, అహంకారములు, పంచ భూతాదులు- వీటన్నింటికి కారణము మూల ప్రకృతి. ఈ రెండున్నూ లేనిది. "నతస్య కార్యం కరణంచ విద్యతే"- బ్రహ్మమునకు కార్య కారణములు లేవు. అందుచేత అది అయోనిః (894) యోని అనగా స్థానము. ఎటువంటి స్థానము లేనిది. అనగా కారణము లేనిది. అయితే యోని నిలయా (895) ప్రకృతియే పరబ్రహ్మమునకు నిలయము. దానియందు లోకములన్నియు లయమగు చున్నది. జగత్కారణ భూతులైన బ్రహ్మాదులకు కూడ లయస్థానమైనది. శ్రీచక్రమందు బిందువే పరబ్రహ్మము. త్రికోణ చక్రమే యోని - అందుండు బిందు స్వరూపిణి., ప్రతిష్ఠా (829) సకల జగత్తులకు అధిష్ఠానము. "విశ్వస్య జగతః ప్రతిష్ఠా" (శ్రుతి) సమస్త జగత్తులకు ఆధారము. "ప్రతిష్ఠా సర్వభూతానాం ప్రజ్ఞేషా పరమేశ్వరి"- సర్వవస్తువులకు (ప్రాణు లకు) కారణమైన ఈ ప్రజ్ఞయే పరమేశ్వరి. పరంజ్యోతిః (806) అన్నింటికి గొప్పదైన బ్రహ్మాత్మకమైన జ్యోతిస్సు: "తద్దేవా జ్యోతి షాం జ్యోతిః ఆయుర్హోపాసతేఽమృతం" (బృ.హ: ఉప) =జ్యోతిస్సు లన్నింటికి గొప్పదైన జ్యోతి, దానిని మరణరహితమైన ఆయుస్సు కొరకు దేవతలుపాసించుచున్నారు. "నతత్ర సూర్యో భాతి, నచంద్ర తారకం, నేమా విద్యుతో భాంతికుతోఽ యమగ్నిః" (కఠ. ఉప) అచట సూర్యుడుగానీ, చంద్రుడు, నక్షత్రములు, విద్యుత్తుగానీ, ప్రకాశింపవు. వీటన్నింటికి వెలుగు నిచ్చునది. ఆ జ్యోతియే:- పరంధామ: (807) అదియే శ్రేష్ఠమైన ధామము. "నతద్భాసయతే సూర్యో నశశాంకోనపావకః యద్గత్వానవివర్తంతే తద్ధామ పరమం మమ" (భ.గీ): ఆ జ్యోతిని సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపజేయ జాలరు. అది స్వయం ప్రకాశము. దానిని పొందినవారు మరల

తిరిగి రారు. ఆ పరంజ్యోతి నాది. అదే నా స్వరూపము. నా ఉనికి. ధామ మనగా స్థానము. తద్విష్ణోః పరమం పదం ఆది విష్ణువు యొక్క పరమ పదము. "సైషా మహేశ్వరీ, గౌరీ, మమశక్తిర్నిరంజనా శాంతా, సత్యా, సదానందా, పరమంపదమితి శ్రుతిః", నాశక్తి అయిన మాహేశ్వరి, గౌరి, నిరంజన, శాంత, సదానంద. ఆమెయే పరమపదము: పరమాణుః (808) పరమైన అణురూపము గలది. "అణోరణీయాన్" అణువుకంటె సూక్ష్మమైనది. తెలుసుకొనుటకు సాధ్యముకాదు. పరాత్పరా (809) బ్రహ్మవిష్ణు, రుద్రాదులకంటె శ్రేష్ఠమైనది. అప్రమేయా (413):- ఇంత అని చెప్పుటకు వీలుకానిది:- స్వప్రకాశా (414) ఆత్మ స్వరూపముగా ప్రకాశించునది. "అత్రాయం పురుషః స్వయం జ్యోతిః" ఇచట ఈ పురుషుడు స్వయంజ్యోతి; కాష్ఠా (859) ఇంత వరకు మనము చూచిన వేదాంత వాక్యములచే నిరూపింపబడిన పరతత్త్వమే కాష్ఠ. "సాకాష్ఠాసాపరాగతిః" (కఠ, ఉప) అదియే పరాకాష్ఠ - పరమ గతిః "ప్రతీతంవా అప్రతీతంవా సదసచ్చ పరశ్శివః ఇతి వేదాంత వాక్యానాం నిష్ఠా కాష్ఠేతి కథ్యతే" = ప్రత్యక్షముగానీ, అప్రత్యక్షముగానీ అదియే పరమశివుడు. వేదాంత వాక్యములచే నిశ్చితార్థముగ చెప్పబడునదే కాష్ఠ. పరాకాశా (782) ఉత్కృష్టమైన ఆకాశము పరబ్రహ్మము "ఆకాశము అన్నింటికంటె గొప్పది. ఆకాశము పరబ్రహ్మ - ఆకాశమే పరాగతిః" (ఛాం. ఉప). బ్రహ్మసూత్రము లందు "ఆకాశస్తల్లింగాత్" ఇది పంచభూతములలో చేరిన ఆకాశము కాదు. పరమాత్మ లక్షణములు గలదగుటచే పరబ్రహ్మమే ఆకాశము. కూర్మపురాణంలో 'యస్యసా పరమాదేవీ శక్తిరాకాశ సంస్థితా." ఆ పరబ్రహ్మ శక్తి ఆకాశమందు గలదు. శ్రుతి కూడా పరమేవ్యోమన్ ప్రతిష్ఠితా" = అతడు పరాకాశమందు ప్రతిష్ఠితుడై యున్నాడు. పరాపరా: (790) పర, అపర అను శబ్ద ప్రతి

పాద్యస్వరూపము గలది. పరాపరస్వరూపములు గలది. పర అనగా ఇతరములు., పరము కంటె భిన్నమైన ఆత్మ స్వీయము. పరము ఉత్కృష్ఠమైనది. అపరము నికృష్టమైనది. బ్రహ్మము కేవల బ్రహ్మమనియు, శబలబ్రహ్మమనియు రెండువిధములు. నిష్క్రియా (182) ఆమెకు విధి నిషేధములు లేవు. జగదాదుల సృష్టికి కర్తయు కారణము ఆమెయే. సృష్టి చేయుటకు ఆమెకు యే సహాయము అవసరము లేదు. నిష్పరిగ్రహా (183) వేటినీ స్వీకరించవలసిన అవసరము లేదు. అన్నియూ ఆమెయే అయినప్పుడు తీసుకొనుట అనునదే ఉండదు. నిస్తులా (184) ఆమెను ఇతరులతో పోల్చి చెప్పుటకు వీలు లేనిది. ఉపమానము లేనిది. శ్రుతి: "హేతుదృష్టాంతవర్జితా":—

హేయోపాదేయ వర్జితా = (384) ఆమెకు ఇష్టానిష్టములు కానీ నింద్యములు అనింద్యములంటూ యేవియు లేవు ప్రవృతి నివృత్తులు లేవు:- కేవలా (623) ఏధర్మములు లేనందున ఒంటరిగా యుండును. ధర్మాధర్మ వివర్జితా:- (255) విహిత అవిహిత ధర్మముల నుండి వదలబడినది. ఇష్టమును పొందించునది ధర్మము – అనిష్టమును కలిగించునది అధర్మము. విహిత ధర్మము నిషిద్ధ ధర్మములు రెండునూ చోదనా లక్షణములే. ఇవి రెండునూ బంధ మోక్షములు: ఒకటి విషము మరొకటి అమృతము. ఇవి రెండునూ లేనిది. "ననిరోధో, నచోత్పత్తిః, నబంధోనచ సాధకః నముముక్షుః న వైముక్తిః ఇత్యేషా పరమార్థత" = లయము లేదు. పుట్టుక లేదు. బంధముగాని, సాధకము గాని లేదు. మోక్షాశాలేదు. మోక్షము లేదు. ఇదియే పరమార్థము: — గుహ్య (624) మిక్కిలి రహస్యముగా యుండునది., సత్యజ్ఞానానంద రూపా (791) సత్యజ్ఞానానంద రూపములు గలది. అవి లక్షణములుగా గలది. శ్రుతి: "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ"—"విజ్ఞానమానందం

బ్రహ్మ" :— శాంతా (141) శ్రుతి: నిష్కలం, నిశ్చలం-శాంతం: అంతటా వ్యాపించి యుండునది. నిష్కామా (142) ఏ కోరికలు లేనిది "అవాప్తాఖిలకామాయా స్తస్యాః కిం విషయో భవేత్" (దేవీభాగవతం) అన్ని కోరికలు పొందబడిన దేవికి ఏ కోరిక లుండును? నిరుపప్లవా (143) ఎటువంటి నాశములు లేనిది. నిత్యముక్తా (144) నిత్యముక్తురాలు., లోకాతీతా (960) లోకముల కతీతమైనది:- సర్వాతీతా (962) అన్నింటినీ మించినది. "శబ్దాతీతం పరంబ్రహ్మ గణనారహితం సదా ఆత్మస్వరూపం జానీహి పరబ్రహ్మము శబ్దాతీతము. లెక్కకుమించినది. దానిని ఆత్మస్వరూపమని ఎరుగుము:- ప్రజ్ఞాన ఘనరూపిణి: (574) శ్రుతి: "ప్రజ్ఞానఘనఏవ" = లోపల, బైట, అంతటా ప్రజ్ఞాన ఘనమై యున్నది:- విజ్ఞానఘనరూపిణి (253) విజ్ఞాన ఘనము = చిదేకరస రూపము విజ్ఞానము = జీవుడు: బృహ: ఉప: III - 4-2: యోవిజ్ఞానేతిష్ఠ= విజ్ఞాన మంతరో యమ యతి" ఎవడు విజ్ఞాన మందుండుచూ విజ్ఞాన రూపుడగు చున్నాడో: జీవుడు బ్రహ్మమునందంతర్యామి రూపముగ నున్నాడు. దేవి చైతన్యస్వరూపిణి., (2) జీవ సమష్ట్యాత్మకమైన హిరణ్యగర్భ రూపిణి (3) జీవసమష్టి రూపిణి:- శాస్త్రసారా [845] "శాస్త్రయోనిత్వాత్" అని బ్రహ్మసూత్రము. ఆమె వేదముల సారము., ఏ యితర ప్రమాణముల చేతను బ్రహ్మమును తెలుసుకొనలేము. శాస్త్ర ప్రమాణములే దేవి యొక్క ఉనికి తెలియజేయుచున్నవి:- చిన్మయీ: (251) చిత్స్వరూపిణి పరమానందా: (252) ఉత్కృష్టమైన ఆనంద స్వరూపము గలది.:-

నీరాగా: 156 ఇచ్ఛారహితురాలు:- అరిషడ్వర్గములైన కామ, క్రోధ, లోభ, మోహ మద మాత్సర్యాదులు లేవు.

రాగమథనా (157): ఆమె తనభక్తులకు వైరాగ్యమొసగి రాగమును మథించునది రాగద్వేషాభి నివేశములైన రాగములు లేనిది:- నిర్మదా : (158) మదములేనిది: మదనాశినీ : (159) మదమును నాశనము చేయునని నిశ్చింతా (160) : దుఃఖములేనిది :- "చింతా చితా సమాజ్ఞేయా, చింతావై బిందునాధికా, చితాదహతి నిర్జీవం-చింతా దహతి జీవితం" చిందాశబ్దమునకు చితాశబ్దమునకు భేదములేదు. చింతాశబ్దమునందు బిందువు అధికము (ం) చిత చచ్చినవారిని మాత్రము కాల్చును చింత బ్రతికినవారినే కాల్చును. నిరహంకారా (161) : అహంకారములు త్రివిధములు : (1) వైకారికము, (2) తైజసము (3) భూతాది అహంకారములు. స్థూలశరీరమునేననుటతామసికాహంకారము, సూక్ష్మశరీరాభిమానము రాజసము. కారణశరీరాభిమానము సాత్త్వికము:- ఈమూడు విధ అహంకారములు లేనిది. నిర్మోహా: (163) మోహము : స్వస్వరూప విస్మృతి. దేహమే నేననుట అది చిత్తభ్రాంతి. - అట్టి మోహములేనిది:- మోహనాశినీ :- (163) ద్వైత బుద్ధిని నశింపజేసి ఆత్మ యొక్కటే యున్నదను జ్ఞానమును భక్తుల కొసగును. (ఈ.శో.ఉప) "తత్రకో మోహః కశ్శోకః ఏకత్వము నుపశ్యతి" : ఏకత్వ జ్ఞానము కలవానికి మోహమెందుకుండును, దుఃఖమెందుకుండును?":- నిర్లోభా (170) లోభములు లేనిది. నిర్మమా:- (164) : ఇది నాది అను బుద్ధిభావము. భేద బుద్ధి. ఇది వేరు అను ద్వైత భావము. దేహేంద్రియ భ్రాంతి మమకారము. ఇది నాది అను స్వార్ధబుద్ధి లేనిది. అఖండాకార వృత్తి జ్ఞానము కలదగుటచే నిర్మమా అని పిలువబడుచున్నది:- నిష్పాపా: (168) ఏపాపము లేనిది. సచ్చిదానంద రూపిణి : (700) సచ్చిదానంద రూపముగలది॥- నిరాబాధా : (177) శుక్తి యందు రజత భ్రాంతివలె దేవియందు జగదాది భ్రాంతి కలిగినను, నిజముగా అటువంటిభ్రాంతి

బాధారహితురాలు. ఇంతవరకు, దీనియొక్క పరబ్రహ్మ స్వరూపమును నిర్గుణ, నిరాకార లక్షణములను, వాగ్దేవతలు కీర్తించిరి.

పరబ్రహ్మమునకు మూర్త, అమూర్తరూపములు, రెండును కలవు. ద్వేరూపే బ్రహ్మణస్తస్య మూర్తంచ మూర్తమేవచ":- మూర్తా (813) అమూర్తా (814) : పంచీకృతమైన మహాభూతములు, మూర్తములు అపంచీకృత భూతములు, అమూర్తములు ప్రపంచము మూర్తములు కలిగిననూ, అటువంటి బ్రహ్మము అమూర్తము. అన్ని భూతములందుండు కూటస్థ బ్రహ్మము అక్షరము. సకల ప్రపంచ ముక్షరము. ఈ రెండు రూపములు దేవికి గలవు. ఇపుడు దేవియొక్క సాకారగుణములను వాగ్దేవతలు వర్ణించుచున్నారు.

—: సాకారము :—

నిర్గుణా సగుణా చేతి ద్విధా ప్రోక్తా మనీషిభిః
సగుణారాగిభిః సేవ్యా నిర్గుణాతు విరాగిభిః :

సగుణ యగు దేవిని కోర్కెలు గలవారును, నిర్గుణయగు దేవిని మోక్షము గోరువారుపాసించెదరు.

పరబ్రహ్మమును వాగ్దేవతలు "లలితా" అను నామము చే నిర్దేశించిరి : "లలితాంబికా" 1000 :- మన మహర్షులు ఏ భావముతో ఎవరిని ధ్యానించి, ఏ పరమ సత్యాన్ని కనుగొన్నారో దానికి ఒక ప్రత్యేకనామమును కల్పించి, అందుబీజాక్షరములను పొందుపరచి సార్థకనామముగా తీర్చిరి. వాగ్దేవతలు లలితాంబికా అను నామమును చిట్టచివరగా పేర్కొనినారు. మొదటి ఐదు నామములు, శ్రీమాతా. శ్రీ మహారాజ్ఞి, శ్రీమత్సింహాసనేశ్వరీ, చిదగ్నికుండ సంభూతా దేవ కార్య

ద్యేతా దేవియొక్క పంచకృత్యములను, సృష్టి, స్థితి, లయ, ఆవిర్భావ తిరోధానములను సూచించుచు, ఆ తర్వాతి నామములన్నియు, వాటిని వివరించుటకే ఏర్పడినవి. ఇప్పుడు అమెకుగల ఎవరికీలేని, ప్రత్యేక నామమును, చెప్పుచున్నారు. అమె లలిత అయిన అంబికే., "లోకా నతీత్య లలితే - లలితాతేన ఉచ్చతే" - లోకములకు మించిన లలిత కావున లలితా అని పేర్కొనబడినది. లోకాః కిరణములు లేక ఆవరణ దేవతలు - వాటిని దాటి వానిపైన ఉన్న బిందుస్థానమందున్న మిక్కిలిగా "లలితే" ప్రకాశించునది. (2) లలిత, శోభ, విలాసము, గాంభీర్యము, మాధుర్యము, తేజస్సు, లాలిత్యము, ఔదార్యము, అను ఎనిమిది అర్థములు కలవు. ఇవన్నియు పురుష వాచకములు యివన్నియు ఆమెకు కలవు సౌకుమార్యము, సుందరమనికూడా అమెకు కలవు. ఆమె యొక్కసగుణ రూపములను వివరించుచున్నారు.

జగత్తునకు మూలకారణమేది? అదిఎట్లు ఏర్పడినది? అను ప్రశ్నలకు సహస్రనామములంటి సమాధానములు కలవో చూచెదము శ్రీ లలితాదేవియే - జగతీ కందా (325) లోకములన్నింటికి మూలము. సృష్టికర్త : (264) జగత్తులన్నింటినీ సృష్టించునది - బ్రహ్మరూపా (265) అపుడు చతుర్ముఖ బ్రహ్మరూపమున యుండును. గోప్త్రీ (26) జగత్తులను రక్షించునది. గోవిందరూపిణి (267) విష్ణు రూపముతో యుండును. సంహారిణి (268) విశ్వసంహారమొనర్చును. రుద్ర రూపా (269) సంహరించునపుడు రుద్రరూపిణి, తిరోధానకరి (370): సంపూర్ణముగా నాశముచేయునది. అణువులను కూడా ప్రకృతిలో నశింపజేయును!- ఈశ్వరీ (27!) : వరాహంతా భావం కలిగి చిత్స్వరూపముతో యుండునది: అనుగ్రహదా (273): పునస్సృష్టికారకమైన అనుగ్రహము కలది, సదాశివా (272) అపుడు శుద్ధ సత్త్వ ప్రధానుడైన

సదాశివ రూపముతో యుండును. పంచకృత్య పరాయణా : (274) ఆమెయే యీ సృష్టికి సంబంధించిన సృష్టి స్థితి లయ, అనుగ్రహతిరోధానములనబడు పంచకృత్యలం దాసక్తిగలదు. ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః (281) ఈపంచ కృత్యములను కూడా యెంతో అవలీలగా చేయగలదు. కన్నులు తెరిస్తే లోకములు సృజించబడును కన్నులుమూస్తే అవి నశించబడును. లీలాక్లృప్త బ్రహ్మాండ మండలా (648) అనాయాసముగ ఈ బ్రహ్మాండములను సృష్టించును. అంత వరకు ఈ పంచకృత్యముల గావించం బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివులు ఐదుమందియు పంచ ప్రేతలుగ, అనగా నిర్వీర్యులుగ యుండెదరు. పంచప్రేత సనాసీనా, (249) వారికి శక్తి నొసగి వారి ద్వారా యీ పంచ కృత్యములను చేయించును. పంచప్రేత మంచాధీశాయినీ (947) బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వరులు నలుగురు నాలుగుకాళ్లు సదాశివుడను ప్రేతము పలక. ఇట్టి మంచము పడకపై పరుండినది. (సౌందర్యలహరిల్లో 92) గతాస్తే మంచత్వం ద్రుహిణహరి రుద్రేశ్వర భృతః శివః స్వచ్ఛచాయా ఘటిత కపటప్రచ్ఛదుపట" బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు నీమంచమువకు కాళ్ళయి నీ సమీపమున నుండి నిన్ను సేవించుచున్నారు. శివుడు తెల్లనికాంతియను వ్యాజముతో నీకుకప్పుడు బట్టయై నీ ఎర్రని శరీర కాంతులచే తాను ఎర్రనై మూర్తీభవించిన శృంగారముపలెయున్నారు:- పంచమీ(948) పంచబ్రహ్మలలో ఐదవ నాడైన సదాశివునిభార్య:- బ్రహ్మాదిత్రయమందు రుద్రుడు శ్రేష్ఠుడు. పరమశివుడు మాయాసహితుడు అంబా సహితుడయిన సదాశివుడు మాయతోకూడినవాడు గాన సర్వజ్ఞుడు. అందుచేత అతడు వశిష్ఠుడు. ఆయనభార్య పంచబ్రహ్మస్వరూపిణీ: (250) పైచెప్పినపంచబ్రహ్మలు



కూడా అమెయే. స్వేచ్ఛయాస్వభిత్తౌ నిశం ఉన్మీలయతి? దేవి స్వేచ్ఛగా విశ్వమును తనయందే సృజించును. అని శక్తి సూత్రము: అందు చేతనే అమె - సర్వలోకేశీ (758) సర్వలోకములకు ఈశ్వరి:-గుణాతీతా (961) గుణములకు మించియుండును. అయినను, భగమాలినీ (277) షడ్గుణములను ధరించును. భగవతీ (279) భగమనగా ఐశ్వర్యము, అనుగ్రహము, ధర్మము, కీర్తి, లక్ష్మి, జ్ఞానము విజ్ఞానమనబడు ఆరు గుణములచే సృష్టిచేయును. ఈవిధముగ శ్రీదేవి అనేకకోటిబ్రహ్మాండ జననీ (620) అగుచున్నది. విశ్వరూపా (256) స్థూలసూక్ష్మ, సమష్టి వ్యష్టి జీవస్వరూపిణిగా యగును. జీవపరమాత్మల స్వరూపిణీ, కాలతిథి అహోరాత్ర, సచ్చిదానంద, సమస్త స్వరూపములు తానే:- జాగరిణీ (257) ప్రబోధాత్మకమైన సర్వేంద్రియ జ్ఞానముగల విశ్వుడనే జీవుని అవస్థ జాగరము. అట్టి జాగరణావస్థ గలది: స్వపన్తీ (258) బాహ్యేంద్రియ ఉపరతి నిద్ర: ఆ నిద్రలో మానసిక ప్రపంచానుభవమే స్వప్నము. బాహ్యార్థము లుపశమింపగ వాటి సంబంధము లేకనే, పురములు, గిరులు, మున్నగు క్రొత్తగా పుట్టుచుండు వాటిలో మనస్సు సంచరించు అవస్థ స్వప్నము. అట్టి స్వప్నావస్థను పొందిన తైజసుడు సూక్ష్మశరీరముయొక్క (వ్యష్టి) అభిమానమైనవాడు వానితో వేరుగాక నిద్రించునది, తైజసాత్మికా (259) వ్యష్టి రూపము జీవుడు సమష్టి జీవరూపుడు హిరణ్యగర్భుడు. అట్టి తైజసాత్మకుడైన హిరణ్య రూపమువంటి రూపముగలది. సుప్తా (260) సుప్తఅనగా ఇంద్రియ వ్యాపారములు నశించిన అవస్థ. అవిద్యావృత్తులైన అజ్ఞానము, అహం భావము, సుఖము అను మూడవస్థలు, సుషుప్త్యవస్థ యందుండును. అట్టిసుషుప్త్యుడు కారణశరీరముయొక్కవ్యష్టి అభిమాని. జీవుడు ప్రాజ్ఞుడు అతని కంటె వేరుగానిది దేది., ప్రాజ్ఞాత్మికా (261) పూర్వము చెప్ప

బడిన లక్షణములు గల సమష్టి భూతమైన ఈశ్వరుని ఆత్మగలది. వ్యష్టి జీవుడు ప్రాజ్ఞుడు. సమష్టిభూతమైన ఈశ్వరాత్మయే ప్రాజ్ఞాత్మయే రూపముగాగిలది. తుర్యా (262) జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలకు మించినది తురీయావస్థ. ఇది పరమానంద సుఖానుభవమునకుస్థానము మనస్సును వికల్ప రహితమొనర్చి ఆత్మజ్ఞానముతో పొంద దగినది మహాకారణుడయిన శివునితో ఐక్యమగునది తుర్యా:- సర్వావస్థా వివర్జితా: (263) సర్వావస్థలను మీరిన పంచమావస్థా స్వరూపిణి. అహం బ్రహ్మాస్మిస్థితి. సాధకుడు తురీయావస్థను దృఢమొనర్చుకొనిన పంచమావస్థ ఇది. సహస్ర శీర్షవదనా (282) అనంతమయిన ముఖములు కలది. "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్" సర్వతః పాణీ పాదం తత్సర్వతోఽక్షి శిరోముఖం సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి" (భ,గీ.) అది ప్రాణి సముదాయమందంతటను చేతులు, పాదములు, కన్నులు,శిరస్సులు, ముఖములును,చెవులును కలిగియుండును సహస్రాక్షీ (283), అనేక కనులు కలది. సహస్రపాత్ (284) అనేక పాదములుకలది."సహస్రనయనారామ,సహస్రకరసంయుతా,సహస్రచరణాభాతి దూరాదసంశయం" - దేవీభాగవతము: విరాడ్రూపా (778) పై నామములందు వివరించబడిన విరాడ్రూపము గలది. ఆమె మహత్ అహంకార, విశ్వ, తైజస, ప్రాజ్ఞాత్మిక, హిరణ్యగర్భ,ఈశ్వరి,రూపిణీ, విశ్వతోముఖీ - (780) అంతటా అన్ని దిక్కులందూ ముఖములుకలది. ఆమెకు విశ్వవ్యాప్తమైన దేహముకలదు. నిర్గుణముగ నిరాకారముగ యుండినను, తనను సేవించు భక్తులకు ఎచట, ఏ ఏదిక్కున ఏ రూపమున ధ్యానించిన వారికి ఆ దిక్కున ఆరూపముతో ప్రత్యక్షమగును. యిచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణి (628) ఇచ్ఛాజ్ఞాన క్రియారూపమైన గుణత్రయరూపమైన గుణత్రయ రూపము గలది.

బ్రహ్మము సృష్టి జేయదలచినపుడు పరాశక్తియే దానియందు ఇచ్ఛా శక్తి రూపమున యుండును. దానిచే స్పందనశక్తి ఏర్పడును. పిదప ఆ ఇచ్ఛాశక్తియే పరాశక్తి యను జ్ఞానశక్తిగా పుట్టును. అపుడు దాని నుండి క్రియాశక్తిపుట్టి విశ్వోత్పత్తి కలుగును. ఇచ్ఛ ఆమెశిరః ప్రదేశం జ్ఞానము దాని క్రింది భాగము. క్రియ ఆమె పాదములు. ఈశక్తిత్రయమే ఆమె దేహము. విమర్శరూపిణీ (548) ప్రకాశాత్మకుడైన పరబ్రహ్మముయొక్క స్వాభావిక ప్రకాశమే విమర్శ. పరబ్రహ్మము యొక్క విమర్శ శక్తియే సకల చరాచరముల సృష్టించుచు గిట్టించు చున్నది " పంచభూతేశీ (549) పృథివ్యాది పంచభూతములకు ఈశ్వరి వియదాది జగత్ప్రసూః (550): ఆకాశమే ఆదిగాగల జగత్తులను ప్రసవించినది. శ్రుతి "ఆత్మవలన ఆకాశము సంభవించినది" వియత్ప్రసూః (837) ఆకాశమును ప్రసవించినది: ఈ నామమున్ను 550 వ నామము ఒకే అర్థము కలవి) వ్యోమకేశీ (842) ఆకాశమే కేశములు గలది. లేక వ్యోమక-అల్పము, అణువు, ఈశ - వ్యాపించినది. అణువుకంటే సూక్ష్మ మయినది.

వియదాది జగత్ప్రసూః అను నామము సృష్టి క్రమమును సూచించుచున్నది.

మొదట బ్రహ్మమొక్కటే యుండెను. సృష్ట్యావిర్భావకాలము సమీపించినపుడు - "సర్వశక్తి పరబ్రహ్మ" అను శ్రుతి ప్రమాణము ననుసరించి సకల శక్తులు పరబ్రహ్మమునందిమిడియున్నది. "సోకామయత,బహూస్యాం ప్రజాయేయేతిః సఈక్షత" అబ్రహ్మమునకు ప్రపంచ స్మరణ కలిగినది. అపుడు ఇచ్ఛాశక్తి జనించినది. అది యేమూల ప్రకృతి యనియు అవ్యక్తమని చెప్పబడుచున్నది. ఇది త్రిగుణాత్మ కము. శివశక్తి సామరస్యము వలన మహాతత్వ ముత్పన్నమైనది.

"అస్మాన ఆకాశస్సంభూతః ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః అగ్నేరాప అద్భ్యః పృథివీ, పృథివ్యాం ఓషధయః ఓషధయః, ఓషధిభ్యో అన్నం అన్నాత్పురుషః" - (తై ఉప): మహత్తత్వము నుండి అహంకారము, దానివలన మన స్తత్వము, దానిచే ఆకాశము, అందుండి వాయువు, దాని నుండి అగ్ని, అందుండి నీరు - తర్వాత భూమి, కలిగినవి. ఈ ఆకాశాది పంచభూత ధర్మములు శబ్ద స్పర్శరూప రసగంధములు, త్వక్, చక్షు శ్రోత్ర, జిహ్వా ఘ్రాణములనే జ్ఞానేంద్రియ పంచకము, వాక్పాణి పాద పాయూపస్థలను కర్మేంద్రియ పంచకము కలిగినవి. ఒకటి కారణము దానినుండి కార్యము పుట్టినది. ఆకార్యమే మరొకదానికి కారణమగుచు "రూప" సృష్టి జరిగినది:—

—: నామ సృష్టి :—

నాదరూపిణీ (931) నాదరూపా (299) మాతృకావర్ణరూపిణి (577) భాషారూపా (678) :—

ఇచ్ఛాశక్తివలన క్రమముగా వర్ణోత్పత్తి జరిగినది:- మొట్టమొదట బ్రహ్మమునందు సృష్టి సంకల్పము కలిగినప్పుడు నాదము కలిగినది. అది పరా పశ్యంతీ మధ్యమా వైఖరీలుగా మార్పుచెంది నిర్దుష్టమైన ఏబది ఒక్క అక్షరములుగా అభివ్యక్తమైనది. వానిలో అనుంకి అఃవరకల గల స్వరములు దేవీ స్వరూపములు, కనుండిక్షవరకుగల హల్లులు శివ స్వరూపములు వర్ణముల నుండి పదములు, పదముల నుండి మంత్రములుగా వర్ణ, పద, మంత్రాధ్వలుగా నామ సృష్టి జరిగినది. ఇవి విమర్శాంశలు. కళా, తత్వ, భువనాధ్వలు రూపసృష్టి, ఇవి ప్రకాశాంశలు:- ఈవిధముగా జగత్తంతయు నామరూపాత్మకము:- ప్రపంచములోని అన్ని భాషలును ఈఅక్షర సముదాయము వల్లనే జరిగినది.

ఈనామ రూపజగత్తు కంతటికీ మూలకారణము శ్రీదేవియే:-

సదసద్రూపధారిణీ: (661) : ఈ జగత్తంతయు సత్, అసత్తుల సమ్మిశ్రితము. సత్ అనగా బ్రహ్మము. జగత్తు అసత్ ఇక్కడ సత్ అనగా వ్యావహారిక పారమార్థిక సత్యము. అసత్ - తుచ్ఛము-లేక సత్ అనగా భావము, శాశ్వతము — ఏ వికల్పములు లేనిది అసత్ అనగా అభావము అశాశ్వతము:-అష్టమూర్తిః (662) ఎనిమిది మూర్తులుకలది మత్స్యపురాణంలో "లక్ష్మి, మేధ, ధర, పుష్టి, గౌరి, తుష్టి, ప్రభ,ధృతి" అని ఎనిమిది మూర్తులను పేర్కొనినది. యోగశాస్త్రము "జీవాత్మ,అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, జ్ఞానరూపాత్మ, మహాత్మ, భూతాత్మ"అని లెక్కించినది. పంచభూతములతో సూర్యచంద్రజీవులను కలిపి ఎనిమిది అని కూడా చెప్పవచ్చును. మూలవిగ్రహరూపిణీ (840) సర్వశక్తులకు మూల విగ్రహము. సర్వాంతర్యామినీ (619) సమస్త ప్రాణిజాతముల అంతః కరణములను శాసించునది "ఏషతే ఆత్మాఅంతర్యా మమృతః". (బృహ: ఉప): "ఈ నాఆత్మ అంతర్యామి అమృతం" ఏషోంతర్యా మ్యేషయోనిః సర్వస్య" - (మాండూక్య-ఉప) : ఈ ఆత్మ అన్నింటి యందున్నది. అన్నింటికీ కారణము, "తత్సృష్ట్వాత దేవాను ప్రావిశత్, తదను ప్రవిశ్య, సచ్చత్యచ్చాభవత్" దానిని సృజించి, దానిలోనే ప్రవేశించెను. అందు ప్రవేశించి చరాచరుడాయెను. ఈ విధముగా దేవి సర్వాంతర్యామిని అని పిలువబడు చున్నది. లోకయాత్రా విధాయినీ (664) పదునాల్గు లోకముల సృష్టి స్థితి లయము లను గావించుచుండును. అమెత్రిమూర్తిః (628) ఇచ్ఛా జ్ఞానశక్తులుగా అనగా సత్త్వగుణ ప్రధానురాలైన బ్రాహ్మిగను, రజోగుణ ప్రధానురాలైన వైష్ణవిగను, తమోగుణ ప్రధానురాలైన రౌద్రిగను త్రిమూర్తులుగా గలది ఆయెను:- వ్యక్తావ్యక్త స్వరూపిణీ (399): ఇంతకుపూర్వం

వివరింపబడిన మహత్తత్వమే వ్యక్తము. దాని నుండి జనించిన అహంకారాది రూపముగలది. "భూతభావ వికారణద్వితీయేనసదుచ్యతేవ్యక్తం తేనవిహీనత్వాత్ అవ్యక్త మసదత్యపి". సత్ (స్థితి) భావ వికారముచే రెండవదిగాయున్నదే వ్యక్తము. ఆ స్థితి వికారము లేనిదే అవ్యక్తము అక్షరము - నశింపనిది., వ్యక్తము-క్షరము నశించునది దేవికి వ్యక్త) అవ్యక్తా, వ్యక్త అను త్రివిధ రూపములుగలవు. వ్యాపినీ (400) ద్రవ్య, జ్ఞాన, క్రియలను మూడువిధములైన అహంకారము కార్యరూపమును పొంది మూడువిధములయిన ప్రాకృత సర్గములుగా పరిణమించుటచే "వ్యాపిని" అనబడుచున్నది. ఈవిధముగా సమస్తజగత్తులందు సాత్విక రాజసిక, తామసిక అహంకార సృష్టులుగా వ్యాపించి యున్నవి. వివిధాకారా (401) - పై నామములో చెప్పిన సృష్టులను వివరించుచున్నదీనామము. ప్రాకృత సర్గము, వైకృత సర్గము, కౌమారసర్గము అను మూడువిధములయిన ఆకారములు గలది. మొదటిసృష్టిమహత్తు; దాని నుండియే సాధారణతలేని త్రిగుణములు కలిగినవి. రెండవది భూత సృష్టి. పంచతన్మాత్రల ద్రవ్యశక్తి కలది. నాల్గవది జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల సృష్టి-ఐదవది - వైకారిక సృష్టి-మనస్సు. ఆరవది దేవసృష్టి. ఈ అరున్నూ ప్రాకృత సృష్టులు. ఇవి వివిధాకారములు గలవి గనుక దేవి నామము "వివిధాకారా" యనిరి. చిచ్ఛక్తిః (416) చేతనారూపా (417); జడశక్తిః (418), జడాత్మికా (419), ఈ సృష్టి యందంతయు ఈ శక్తి కలదు. చైతన్యమే చిచ్ఛక్తి - అవిద్యను తొలగించు సామర్థ్యము గలది విద్య. దానినే చైతన్యమనెదము. అన్ని భూతములందుండు అచ్చైతన్యము ఆమెరూపమే. ఆమెచైతన్యరూపిణి. చైతన్యరూపాశక్తిః అది జడశక్తి, జడాత్మికాకూడ. బ్రహ్మముయొక్క మాయాశక్తితోకూడిన శక్తితోకూడిన శక్తియే ఈ సృష్టికి కారణము.

కంటికి కనబడు నామరూపాత్మకమైన జగత్తే ఆత్మగాకలది. తత్త్వాసనా (424)-శివుడు మొదలు పృథివివరకుగల ముప్పదిఆరు తత్వములను ఆస ముగా గలిగినది. చరాచరా జగన్నాథా (244) స్థావర జంగ మాత్మక మగు జగత్తుకు ఈశ్వరి. విశ్వమాతా (934) జగద్ధాత్రీ (935) జగ త్తుకు తల్లి - జగత్తులను ధరించునది జననీ (823) సకల ప్రపంచముల పుట్టించునది ఆమెను అంబా (985) జగజ్జననీ యని సంబోధించెదము. ఎందుకనగా ఆమె విశ్వధారిణీ (759) ఆమె విశ్వమును ధరించునది. ఆమె త్రిగుణాత్మికా (763) సత్త్వ రజస్తమోగుణములతో జగత్తును ఆవరించియున్నది. త్రిగుణా (984) సర్వభూతములందు అన్ని ప్రాణ ముల యందుండు నీశక్తి త్రిగుణముల కాధారమై యున్నది. సృష్టి స్థితిలయములచేతను, సత్వాది త్రిగుణములచేతను, దేవి త్రిగుణాయని పిలువబడుచున్నది. ఆమె లీలలన్నియు త్రివిధములుగా యుండును.

మనస్వస్వరూపమును విస్మరించి మనము అజ్ఞానాంధకారము లోను, భవసాగరములోను, మునుగుచుండుటకు కారణములను వాగ్దేవ తలు ఈనామముతో వివరించుచున్నారు. మహామాయా (215) మోహినీ (562), మాయా (716), విశ్వభ్రమణకారిణీ (889) లీలావినోదినీ 966 శంభుమోహినీ 954 సుఖములచు కలిగించే శంభునే మోహింపజేయు శక్తికలది దేవి. ఆమె బ్రహ్మాదులను కూడ మోహమున పడద్రోయు గలదు. పరబ్రహ్మముయొక్క శక్తియే మాయ. "తచ్ఛక్తిర్మాయాజడ సామాన్యాత్" ఆ శక్తి మాయ.

"విచిత్ర కార్యకరణా, అచింతిత ఫలప్రదా; స్వప్నేంద్రజాల వల్లోకే-మాయాతేన ప్రకీర్తితే" (దేవీపురాణం) - విచిత్రకార్యములను చేయునది. చింతింపని అనగా కోరని ఫలముల నిచ్చునది - స్వప్న ఇంద్రజాలములవలె యుండనిది-మాయ."

సమస్త బ్రహ్మాండములయొక్క సృష్టిస్థితిలయములను చేయునది. "భ్రామయన్ సర్వభూతాని యంత్రరూఢాని మాయయా" (భ. గీ) - మాయా వశములైన భూతములను మాయచే త్రిప్పుచున్నాడు" - ప్రాపంచిక క్రీడయే ఆమె లీల. భవచక్రప్రవర్తినీ (843) ఈ సంసార చక్రమును త్రిప్పునది. అందుచే మనము మాయా మోహితులమగుచున్నాము. కూటస్థా (896) - కూటయుతి - మోసగించునది. ఆత్మను ఆనందాడులావరించి సంసారమున త్రోయునది అజ్ఞానము. "కూటస్థ మచలం ధ్రువం"(భ.గీ). అజ్ఞానమునకు అధిష్ఠానము దేవియే. నియంత్రీ(568) నిఖిలేశ్వరీ (569), లోకములను నియమించునది. అంతేకాదు సకల ప్రపంచమునకు ఈశ్వరి.

శాంత్యతీత కళాత్మికా (853), గంభీరా (854), గగనాంతస్థా(55) బృహతీ (673) - అయినటువంటి పరబ్రహ్మము, ఆకాశమందుండు కళ, శాంత్యతీత కల - ద్వైతభావమును తొలగించి ఆనందమును బోధించునది. అద్వైతానందము నొసగునది. గంభీరాయనగా అంతము లేనిది. దేవియే తన ఇచ్ఛాశక్తితో సృజించి, కాపాడి, గంభీరురాలై వెలుగొందుచుండును. గగనాంతస్థ యనగా దహరాకాశ, భూతాకాశ, పరాకాశముల మధ్యయుండునది. "వృక్ష ఇవ స్తబ్ధోదివి తిష్ఠత్యేకః" (శ్వేతా. ఉప) - వృక్షమువలె చలనములేక ఆకాశమునందు ఒకటిగా యున్నది. బృహతీయనగా గొప్పదానికంటే గొప్పది. అటువంటి పరాశక్తి విష్ణుమాయా (339), విలాసినీ (340) గా మనలను సమ్మోహపరవశులను చేయుచున్నది. సర్వవ్యాపి, దేశకాలములచే బాధింపబడని విష్ణువును మాయ కప్పిపుచ్చుచున్నది. "దైవీహ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా" (భ. గీ) - త్రిగుణాత్మకమైనదియు, దైవసంబంధము కలిగినదియునగు నామాయ అతిక్రమింప జాలనిది"

విలాసినీ అనగా ఆ మాయయొక్క విక్షేపశక్తి. అనగా త్రాడును చూచి పాముగా భ్రమించుట. మాయ వలననే సృష్టి కలుగుచున్నది. క్షేత్రస్వరూపా (341) క్షేత్రేశీ (312) క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ (343) ప్రాణ రూపిణీ (784) పంచకోశాంతర స్థితా (428) ప్రత్యగ్రూపా (781) మనోమయీ (841) ఈ నామములు జీవ స్వరూపమునకు సంబంధించినవి. నుప్పది ఆరు తత్వములతో కూడిన శరీర స్వరూపము గలది. సర్వ స్థూల శరీరములు, తదాత్మకమైన ప్రకృతిరూపమున్ను, ఆశరీరములను, ప్రకృతిని పాలించునదియు, క్షేత్రమైనశరీరమును, క్షేత్రజ్ఞడయిన జీవినికూడా పాలించుచున్నది. శరీరములోని సుఖ దుఃఖముల నెరుగువాడు జీవుడు - "ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే, ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః" - భ. గీ.

క్షయవృద్ధి వినిర్ముక్తా 344, క్షేత్రపాల సమర్చితా 345, క్షేత్రపాలుడైన జీవునిచే అర్చింపబడుచున్నది. ఆజీవునికి వృద్ధిక్షయములు లేవు. "నైనం చిందంతి శస్త్రాణి" దీనిని ఏ శస్త్రములు ఛేదింపవు. దేహమునకే వృద్ధి క్షయములు కలిగించినను, దేవి వానినుండి విడిబడినది ఆమె విజయా 346, ఆమె విజయానికి ఎదురేలేదు. విమలా 347 ఆమెయందు ఎట్టి అవిద్యయునులేదు. వంద్యా 348, ఆమెయే నమస్కరింప దగినది. దేవి విధాత్రీ 337, జగత్తులను ధరించునది - వేదజననీ 388, వేదములకు తల్లి. ''అస్యమహతో భూతస్య విశ్వసితమేత దృగ్వేదో యజుర్వేద" [శ్రుతి] - వాగ్వాదినీ 350, శబ్దములను పుట్టించునది. వహ్నిమండల వాసినీ [352] సోమ, సూర్య, అగ్నిమండలవాసినీ 353 సోమ, సూర్య, అగ్నిమండల త్రయమందు వసించునది - తత్పద లక్ష్యార్థా 363 - శబల బ్రహ్మమునకును, శుద్ధ బ్రహ్మమునకును ఐక్యత తెలుపునది - చిదేకర సరూపిణి 354, జ్ఞాన స్వరూపిణి ప్రత్యక్చితీరూపా

367, అంతరత జ్ఞానస్వరూపిణి 389, పరదేవతా, ఉత్కృష్టమైన దేవత అమె ప్రాణదా 783, ప్రాణరూపిణీ 784, పంచప్రాణములను, ఏకాదశేంద్రియములను ఇచ్చునది. వాటిని "ధృతి" ఖండించునదికూడ అమెయే "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తంమాం ఆయురమృత ముపాస్వ" - నేనే ప్రాణము, నేనే ప్రజ్ఞ, నేనే ఆత్మ"-అమెయే ప్రాణరూపిణి పరబ్రహ్మమే - "ప్రాణో బ్రహ్మ" - శ్వాసకాలము నారంభించియే దినములు' నెలలు ఏర్పడుచున్నవి. అవియే ద్వాదశ రాశులుగా మారినవి. రాశి సూర్య, చంద్ర కల్పనలన్నియు ప్రాణ రూపములే.

చిత్రలా 728, ఆనందకలికా 729, మనోమయీ 941 గా మనలోనే యుంటున్నది. సచ్చిదానంద రూపముగల బ్రహ్మము యొక్క కల (ఒక అంశము) గాను, చైతన్యమంతా అంతఃకరణోపాదిగా మనస్సుతో చేరియుండును. "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః (భ. గీ) - నా అంశమే లోకమందు సనాతనుడైన జీవుడుగా యున్నది' సమస్త శరీరధారుల మనస్సులందు చిత్కలాశక్తిగా యున్నది.

జీవులను, జడములను సృష్టించుటయే గాక, దేవి లయింప జేయును. అమె కాల హంత్రి (557), మహాప్రళయసాక్షిణి 571, మహాశనా (753), విశ్వగ్రాసా (890), మహాగ్రాసా (752) - చరాచరములను మింగివేయును, "యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవతిఓదనః మృత్యుర్యస్యోప సేచనంచక ఇత్థావేద యత్రసః'' (కఠోపనిషత్) కాలునకు బ్రహ్మక్షత్రియులే ఆహారము. కాలుడు ఆ పరబ్రహ్మమునకు ఉపసేచనము. (ఊరగాయ) "అత్తాచరాచరగ్రహణాత్" - పరమాత్మయే చరాచరములను భుజించువాడు. మహాప్రళయమునకు ఈమె సాక్షిణి' గ్రాసము-కబళము. బ్రహ్మాండము లన్నింటినీ కబళించి వేయగలదు'

అశనము - ఆహారము కాలునికి ఇవన్నియు ఆహారము - అటువంటి కాలుని కూడా హతమార్చునది. ఈమె ముఖ్యా (563) మృడానీ [564] మృడప్రియా (611), మిత్రరూపిణీ (565) అందరికంటేముందుపుట్టినది కావున ముఖ్యా. "అహమస్మి ప్రథమజా ఋతస్య (శ్రుతి) నేనదదరి కంటె ముందు పుట్టితిని. జనులకు సుఖమును కలిగించువాడు మృడుడు. ఆయన అర్ధాంగి కావున మృడానీ - మిత్రుడు సూర్యుడు-ఆరూపము గలది స్నేహితునివలె అందరికీ అండగాయుండును. మృడుడు ప్రపంచ సృష్టికర్త అయనకు ప్రియురాలు. దేవియొక్క సగుణము అను అనగా తటస్థ లక్షణములను వాగ్దేవతలు చెప్పుచున్నారు. తటస్థ లక్షణము అనగా కాకి కూర్చొని వున్న యిల్లు అని అన్నామనుకొండి ఇంటిని గూర్చి చెప్పుటకుగాను కాకి కూర్చొని వున్నది అని గుర్తుగా చెప్పితిమి. కాకి లేకపోయినను ఇల్లు వుంటుంది. కాకినిగూర్చి చెప్పుట తటస్థ లక్షణము. ఇంటినిగూర్చి చెప్పుట స్వరూప లక్షణము. అమెది పావనాకృతి [619] ఆమెయొక్క శరీరము, చరిత్రను, జ్ఞానములు పరమ పావనములు. దివ్య విగ్రహా [621] కాంతివంతమైన దేహము గలది. కైవల్యపదదాయినీ 625. త్రిగుణ రహితమైన ఏకత్వము అను ముక్తి నిచ్చునది. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యలనబడు నాల్గు ముక్తులకన్ననూ శ్రేష్ఠమైనది కైవల్యముక్తి. బ్రహ్మజ్ఞానముచే సోహమస్మి అను ఆత్మజ్ఞానమును పొందునటువంటిది. త్రిజగద్వంద్యా 627, ముల్లోకములు ఆమెను పూజించును. సత్యానంద స్వరూపిణి 646 సత్యము, ఆనందము స్వరూపముగా గలది. సుప్రతిష్ఠా 660. జగత్తులకు అధిష్ఠానమున్నూ, వాటియందు చక్కగ ప్రతిష్ఠించబడినదిగానూ యున్నది. వృద్ధా 671 - సర్వ జ్యేష్ఠురాలుగావున విశ్వరూపముచేవృద్ధి పొందినది. లోకములను వృద్ధి పొందించునది. బ్రహ్మాత్మైక్య స్వరూ

పిణి 672. బ్రహ్మముతో జీవులయొక్క రూపమును ఐక్యమనురూపము గలది. బ్రహ్మాత్మలకు, శివజీవులకుఐక్యమే సర్వస్వముగ ప్రతిపాదింప దగిన హంసమంత్రము "సోహం"గలది. బ్రాహ్మణి 674. దివ్యజ్ఞానము గలది. బ్రహ్మానందా 676 - బ్రహ్మమే ఆనందముగా గలది. బలి ప్రియా 677. కామక్రోధాదులను జయించి, అవిద్యను తొలగించుకొన్న వారియందు ప్రీతిగలది. జ్ఞానవిగ్రహా 644. సకల జగత్తులు జ్ఞానాత్మక ములు. జ్ఞానవిగ్రహా 644. సకలజగత్తులు జ్ఞానాత్మకనులు "జ్ఞానాత్మక మిదం విశ్వం"- విగ్రహము అనగా విస్తారము, విస్తారమైన జ్ఞానము కలది కలది. స్వర్ణగర్భా 638 స్వర్ణమునుండి పుట్టినది. సు = బాగుగ + అర్ణ - మాతృకాది వర్ణములచే ప్రతిపాదింపబడినది. - అపరదా 639 అవరులు-రాక్షసులు. వారిని ద్యుతి చంపునది. వాగధీశ్వరీ 640 వాక్కు లకు స్వామిని యుగంధరా 657 - కృత, త్రేతా, ద్వాపర, కలియుగ ములను ధరించునది ప్రేమరూపా 730 స్నేహమే రూపముగాగలది. త్రివర్గధాత్రీ 760 - ధర్మార్థకామముల నిచ్చునది. అంతియేకాదు ఆమె స్వర్గాపవర్గదా 764 - స్వర్గము క్షయశీలమైన సుఖము. అపవర్గము - శాశ్వత సుఖము - ఈ రెండు సుఖములను ఇచ్చును.

సర్వలోకవశంకరీ 697 - సర్వలోకములను తన వశమందుంచు కొన్నది. విరజా 779. ఎటువంటి పాపము లేనిది. సామరస్యపరాయణా 792. శివశక్తుల సమమైన భావమే సామరస్యము. అటువంటి పరమైన స్థానముగలది. లేక స + అమరస్య + పర + అయన=దేవతలతోకూడిన లోకములకు స్థానమైనది. సామగాన ప్రియురాలు. "భోక్తృ, భోగ్య కరణోర్మి సంక్షయే సామరస్య రసదోహినీ-శివా"-భోక్తృ భోగ్యములన బడు అలలను నశింపచేసి, సామరస్యమును ఆమె పిదుకును. పుష్టా 801, పురాతనా 802, పూజ్యా 803, పుష్కరా 804 ముప్పది ఆరుతత్వము

లతో కూడిన దైనందున పుష్టా అన్నింటికీ మొదటిది గాన పురాతనాః అందరికీ పూజ్యురాలు. పూజింపతగినది. అందరూ ఎదురుచూడతగినది గాన పూజ్యా, అందరినీ పోషించునది "ర" కు "ల" కు భేదము లేదు గాన పుష్కలా అని అర్థమః చెప్పుకొనినచో - అంతట వ్యాపించి యున్నది. ఆమె పాశహస్తా 810, పాశహంత్రీ 811 - దేవి ఎడమచేతి యందు పాశమున్నది. భక్తుల పాశములను తొలగించునది. పరమంత్ర విభేదిని 812, 1. తన ఉపాసకులనుద్వేషించువారు. చేయుమంత్ర ప్రయోగమును ఛేదించునది.

సత్యవ్రతా 817. సత్యమనగా బ్రహ్మము. ఆ బ్రహ్మమే తన వ్రతము గాగలది. సత్యముచెప్పుట అను వ్రతము గలిగియుండినచో ఆమెను పొందవచ్చును. శీఘ్రముగ ఫలముల నిచ్చుటయే ఆమె వ్రతము.

సత్యరూపా:- (818) త్రికాలములందు నున్నది. సత్యస్వరూపిణి శ్రీదేవి-విశృంఖలా (834), వివిక్తస్థా (835) శృంఖలములనగ సంకెళ్లు ఆమెకు ఎటువంటి బంధములు లేవు.

"ఓ ప్రభూ! నా పుణ్య పాప కర్మములను నశింప జేయుము. కాలిసంకెలలు బంగారువైనను, ఇనుప సంకెలలైనను విశేషములేదు. ఆమెకు పుణ్యపాప ఫలములనెడు సంకెలలులేవు. ఆమె ఎల్లప్పుడు వివిక్త స్థలములందేయుండును. వివిక్త మనగా పవిత్ర స్థలము. ఆత్మానాత్మ విచారశీలుర హృదయము లందుండును. ఆమె అకాంతా (860). అకము-పాపము, దుఃఖము పాపముల నంతమొందించునది. కాంతార్థ విగ్రహా (861) - శివునియొక్క అర్థ దేహము దేవి అర్ధనారీశ్వర స్వరూపము గలది.

కామకేళీ తరంగితా (863) కామేశ్వరుని క్రీడా విలాసము లందు అమెకు ప్రీతి. ముగ్ధా (868) ఆమె అతి సౌందర్యవతి. అది ఆత్మసౌందర్యము. స్వాత్మారామా (878). ఆత్మయందే క్రీడించుచుండును. స్వ × ఆత్మ × ఆరామ=స్వ=విశ్వము, ఆత్మ = బ్రహ్మము, ఆరామ క్రీడనము విశ్వమందు, బ్రహ్మమందు క్రీడించుచుండును.

మహాసక్తి (109)- సంశయరహితమైన ఆత్మసమాయోగరూపము నందు ఆమెకు ఆసక్తిమెండు. వీరగోష్టిప్రియా (898) - వీరుల సభ యందు ప్రీతి గలది-వీరా (899) - తానే వీర్యము. విజ్ఞానకలనా 902 విజ్ఞానము - బ్రహ్మసాక్షాత్కారము - కలనా-ఆత్మసాక్షాత్కారము - ఈ రెండున్నూ ఆమె యందు కలవు. కల్యా (903) కల్య సృష్టి సృష్టించుటలో నేర్పరి. విదగ్ధా (904) - ఆమెకు అన్నింటిలోనూ చాకచక్యము గలదు8

సామగాన ప్రియా (907) సామగానమంటే ఆమెకు చాలా ప్రీతి (2) అందరినీ తన ప్రాణసమానముగ చూచుకొనును. స్వస్థా (914) ఆమెకు దుఃఖములవలన కలుగు చాంచల్యములు లేవు. (2) తనయందే ఉంటుంది. "కస్మిన్ భగవః ? కస్మిన్ ప్రతిష్ఠిత ? స్వేమహిమ్ని తిహోవాచ" శ్రుతి - భగవంతుడు దేని యందుండును ? దానికి సమాధానముగా "తన మహిమయందే" యని జవాబిచ్చెను. (2) స్వ-స్వర్గము, స్థా=అధ్యక్షురాలు. ఆమె స్వభావమధురా (915), మధుర స్వభావము కలది యగుటచే అందరూ అమెనే ఆశ్రయించ కోరుకొనెదరు.

ధీరా 916 - పండితురాలు, ధైర్యవతి, ధియం=అద్వైతబుద్ధిని, రా=ఇచ్చునది "ఈశ్వరానుగ్రహా దేవ పుంసాం అద్వైతవాసనా" ఈశ్వరానుగ్రహము వలననే అద్వైతవాసన గలుగును. ధీరసమర్చితా (917)

ధీః-జ్ఞానముకంటే వేరుగాని ఆనందరసము. దానిని పొందుటకై అందరూ అందరూ ఆమెను సేవించెదరు పండితులామెను పూజించెదరు. చైతన్యార్ఘ్య సమారాధ్యా (918) చైతన్యము-చిద్రూపము "ఆత్మ చైతన్యమాత్మా" (శివసూత్రము) చిద్రూపమే ఆత్మచైతన్యము - అర్ఘ్యము జలాదులను సమర్పించుట. "జ్ఞానమర్ఘ్యం" (భావనోపనిషత్) - ఆత్మ జ్ఞానముతో ఆత్మనే అర్ఘ్యముగ సమర్పించి పూజించవలెను. జ్ఞానముచే ఆత్మానుభవమును పొంది ఆత్మ సమర్పణ మొనర్చవలెను. చైతన్యకుసుమప్రియా (919) చైతన్యపుష్పము లామెకు ప్రియమైనవి. చిత్-చైతన్యము, అదియే పుష్పము. "జడానాం చైతన్యస్తబక మకరంద స్రుతి ఝరీ" (సౌందర్యలహరి) చైతన్యపుష్పములలో స్రవించుతేనెయే దేవి. సదోదితా (920). ఆమెఎల్లప్పుడూ ప్రకాశించుచుండును. సజ్జనుల యందు ఎక్కువగా ప్రకాశించుచుండును. సదాతుష్టా (921) సజ్జనుల యందు ఎల్లప్పుడూ ప్రీతికలిగి సంతుష్టితో నుండును. విరాగిణీ (937) ఆమెకు ఏవరియందూ దేనియందూ రాగములేదు. ప్రగల్భా (938) కానీ ఆమెకు ప్రపంచ సృష్టిని చేయుటయందు ప్రగల్భము అనగా ప్రౌఢ భావము, నేర్పుగలదు. పరమోదారా (939), పరమోదా (940) ఆమె యొక్క ఔదార్యము, ఉత్కృష్టమైన గొప్పదనము నకు మేరలేదు. శ్రేష్ట మైన ఆనందమును అందరికీ యిచ్చును.

విమానస్థా (943) ఆకాశమున సంచరించునవి విమానములు వానిలో దేవతలుందురు. వారితోభేదములేక ఆయా రూపములు గల దేవతలతో సమానముగా నుండును.

వజ్రిణీ (94.) వజ్రాయుధమును ధరించిన ఇంద్రుని భార్య శచీదేవికూడ ఈమె రూపమే. ఇంద్రుని శక్తి. (ఓ) ఈమె ఎల్లప్పుడూ

ఎత్తిన వజ్రాయుధమును దించకుండాయుండును. "మహద్భయా వజ్రముద్యత" - అందుచేత దేవతలెల్లరూ వారి వారి కార్యములందు భయముతోను, భక్తితోను నిమగ్నులై యుంటున్నారు. వామకేశ్వరీ (945), జగత్తులను సృష్టించు దక్షప్రజాపతులకు ఈశ్వరి. (2) వామ కేశ్వర తంత్ర స్వరూపిణి. (3) వామమార్గ రతులయినవారికి ఈశ్వరి. శాశ్వతీ (951), శాశ్వతైశ్వర్యా (952) మరల మరల అభ్యసించబడు నది. నిత్యురాలు. శాశ్వతము, ధ్రువము. "తేషాం సిద్ధిః శాశ్వతీనేకి రేషాం" (కఠ ఉప) భోగినీ (293) ఆమె సుఖ సాక్షాత్కారము గలదిత భువనేశ్వరీ (294) చతుర్దశ భువనాలకు ఈశ్వరి. అంబికా (295) జగ న్మాత, రాత్రి లేక నిద్రా రూపిణీ (రాత్రిరూపామహాదేవీ దివా రూపో మహేశ్వర) - పద్మనాభ సహోదరీ (280) దేవి విష్ణువునకు తోబుట్టువు) రక్షాకరీ (217) లోకములను రక్షించునది. రమణ లంపటా (320) కామేశ్వరునితో రమించుట యందాశక్తి కలది. కామకలారూపా 322 బిందుత్రయము, హార్ధకలచేరి కామకల యగుచున్నది.

ప్రథమ బిందువు కామ. చివరి బిందువుకల. వీని ప్రత్యాహారమే కామకల. కామేశ్వరీ కామేశ్వరుల విలాసరూపమే కల. కావున ఆమె కామ కలారూపా విధాత్రీ 337. ఆమె జగత్తులను ధరించునది. ఆమె ఐశ్వర్యము కూడా శాశ్వతమే. ఆమెయొక్క వాహనములు జగదీశ్వరు లైన పంచబ్రహ్మలు - ధరా 955, ధన్యా 954, ధర్మిణీ 958, ధర్మ వర్ధినీ 959, వర్ణాశ్రమ విధాయినీ 286, ఆమె సమస్త జగములను ధరించును.

ధన్య అనగా కృతార్థురాలు ధనము కలది. భక్తులు అందరి ఐశ్వర్య ప్రదాయిని. అందుచేత అందరూ ఆమెను ఆరాధించెదరు.

ధర్మిణీ: ఆనందానుభవము,నిత్యత్వము,జ్ఞానముమున్న గుస్వరూ ధర్మి పిణి. ఆమెయొక్క శీలమే ధర్మము. ధర్మవర్ధినీ అట్టి ధర్మమును బాగుగా వృద్ధి చెందించును. వర్ణాశ్రమ విధాయినీ - సమాజములోని వ్యక్తులను వారి వారి గుణ కర్మల ననుసరించి వివిధవర్ణములుగా విభజించి, వారికి ప్రత్యేక ధర్మములను సుస్థిరముగా యుంచును, శమాత్మికా (963) ప్రపంచోపశమమే ఆమె స్వరూపము. సుఖమే ఆత్మగా గలది. సర్వమయీ (203) భూతత్వము మొదలు శివతత్వము వరకు గల అన్ని తత్వముల మయమైనది దేవి - ఆమె సర్వమంత్ర స్వరూపిణీ (204) సమస్తమైన ఏడుకోట్ల మంత్రముల స్వరూపము గలది- ఆమె సర్వయంత్రాత్మికా (205) - ఘంటార్గళాది సకల యంత్రములు ఆత్మగా గలది - దేవి సర్వతంత్రరూపా (206) వామకేశ్వరాది సర్వ తంత్రములు శరీరముగాగలది.

వాగ్దేవతలు దేవియొక్క సాకార, సగుణ, స్వరూపములను పై నామములందు కీర్తించిరి. ఇపుడు దేవియొక్క అవతారములను కీర్తించుచున్నారు.

అ వ తా ర ము లు

పరబ్రహ్మమునకు ఆద్యంతములులేవు. అది సత్తుకాదు. అసత్తున్ను కాదు. ఉనికియే దాని స్వరూపమగుటచే ఈ రెంటికీ అతీతమైనది దానికి రూపనామములు లేకున్నను అన్ని రూపములు, అన్ని నామములు దానివే. ఇంద్రియ రహితమైనను అన్ని యింద్రియ వ్యాపారములందును ప్రకాశించుచున్నది. గుణరహితమైనను ప్రకృతి సంబంధమగు గుణముల నుపభోగించుచున్నది. అది భూతములందు లోపల, వెలుపల కలదు. అది చేతనము, జడముకూడ. దూరమందు, సమీప

నిరాకారతత్వము బ్రహ్మాండమునకు లోపల బయటకూడ కలదు. అది అవిభక్తమయ్యును, భూతజాలము లందుండుటచే విభక్తమగు హెసపలెయున్నది. సృష్టి స్థితి లయములకు కారణముగా యుంటున్నది. పరస్పర విరుద్ధముగ కనిపించు పరమాత్మయొక్క వ్యక్తావ్యక్త స్వరూపములను వాగ్దేవతలు వివరించిరి.

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానికలిగి అధర్మము విజృంభించునో అపుడు దేవి అవతరించుచుండును. సాధు జనులను రక్షించుటకును, దుర్మార్గుల శిక్షించుటకును, ధర్మమును సుస్థిరముగా ప్రతిష్ఠించుటకును ప్రతి యుగమందును దేవి అవతరించుచుండును. ఆమె కామేశ్వరి, పూర్ణకామ. కావుననే నిష్కామ. ఆమె అవతరణ ప్రయోజనము స్వార్థము కాక లోక కల్యాణార్థము. దివ్యమగు ఆమె అవతారముల నెవడు తత్వతః తెలుసుకొనునో, అతనికి జన్మలేదు. ఆమెనే చేరగలడు. ఆమె జన్మ, కర్మల, దివ్యత్వమును గ్రహించి, ఆచరణ ద్వారా అనుభవ జ్ఞానమును సంపాదించినచో అవతారపురుషుల కర్మలవలెనే, మన కర్మలుకూడా అకర్మలగును. జీవునకు, ఈశ్వరునకు ఉపాధి సంబంధమగు భేదములెన్నో యుండినను, చైతన్యాంశ ఇరువురికీ సమానమే గాన జీవేశ్వరులు ఇరువురునూ ఒకటేయని వేదాంత నిర్ణయము. ఇదియే అవతారములోని రహస్యము.

వాగ్దేవతలు శ్రీదేవియొక్క అవతరణను ప్రథమముగా కీర్తించినారు. ప్రస్తావవశమున, దుర్గ, మహాలక్ష్మి, సరస్వతి, ఉమ, పార్వతి కాత్యాయిని, చండిక, చండముంతాసుర, నిషూధిని, మహాకాళి, దాక్షాయణి మున్నగు దేవి అవతారములను స్తుతించిరి. కట్టకడపట శ్రీదేవిని "లలితాంబికాయైనమః అని పేర్కొనిరి.

## శ్రీ లలితా పరాభట్టారిక, మహా త్రిపురసుందరి

అవతారిక : హరనేత్రాగ్నిచే మారుడు భస్మమైపోయినాడు, ఆ భస్మరాశిని, చిత్రకర్ముడు కాబట్టి గణపతి, ఒక పురుషునిగా తీర్చెను ఆ బొమ్మకు ప్రాణప్రతిష్ఠచేసి, వానికి శతరుద్రీయము నుపదేశించెను. ఆ పురుషుడు శత వాసరములు భక్తి శ్రద్ధలతో శత రుద్రీయమును జపించెను. అపుడు శివుడు ప్రత్యక్షమై వానిని వరము కోరుకొమ్మనెను. వాడు తన నెదిరించువారి బలములో అర్థబలము తనను చేరవలయు ననియు, శస్త్రము లేవియు తనను బాధించరాదనియు వరమును కోరుకొనెను. శివుడు వాని కా వరమును ప్రసాదించెను ఇది వినిన బ్రహ్మ "భండ, భండ అనెను.'' ఆశ్చర్యము - ఆశ్చర్యము" అది మొదలు వానికి భండాసుర నామము ప్రసిద్ధమాయెను.

మిగిలివున్న మన్మథ భస్మరాశిని గణపతి మరో యిద్దరు మూర్తులుగా తీర్చెను. వాటికి ప్రాణ ప్రతిష్ఠ చేసెను, వారు భండుని అనుజులు - అనుచరులు ఈమువ్వురు శూన్యక నగరమును రాజధానిగా జేసుకొని, ముల్లోకములను బాధించదొడగిరి. దేవతలను జయించిరి, వారు ముల్లోకములలోని ప్రాణులను నపుంసకులుగ జేసిరి.

ఈ రాక్షసత్రయము యొక్క దుర్మార్గమునకు సహకరించుట కేమో అనునట్లు "కామికా" ప్రళయము కూడా తోడ్పడినది. ఈముగ్గురు రాక్షసులు సూక్ష్మరూపముచే తమ తేజస్సును సమస్త ప్రాణుల దేహములందు ప్రవేశపెట్టి, వారి శుక్ల శోణితములను భక్షించి నపుంసకులుగా జేసిరి. త్రిమూర్తులు కూడా నిర్వీర్యులాయిరి, వృక్షములు, లతలు, పైరులు, జంతువులుకూడ సృష్టిచేయలేక రసవిహీనములైనవి. దేవతాంగనల ముఖములు వానర ముఖములుగా మారిపోయినవి.

ఎక్కడకాని సంతోషములేదు. ఆకారములన్నియు వికారములాయెను. స్త్రీ పురుష సమాగములేదు. మందహాసము మందుకుకూడాలేదు. మధుర భాషణములు లేవు. అదొక అంటువ్యాధి. అందరినీ అంటుకొన్నది.

భండాసురునికి ఎదురులేదు. భండాసుర వధోపాయము తెలియు లేదు. వారు ఈ బ్రహ్మాండ కటాహమును భేదించి దాని కావలయున్న పరమేశ్వరుని ప్రార్థించిరి. పరమేశ్వరుడు వారికి చేయదగు ఉపాయ మును బోధించెను.

శివుడు హోతగను, పార్వతి యజ్ఞపత్నిగను ఒక యాగమును చేయ నిశ్చయించిరి. సప్త సముద్రములలోని మంచినీటి సముద్ర మును హోమగుండముగ నెన్నుకొనిరి. శివుడు తన ఫాలనేత్రాగ్నిచే దానిని శోషింపజేసెను. అది రసాతలము వలె ఒక గంభీర హ్రద మయ్యెను. శివుని శరీరమందలి మూలాధారము నుండి బ్రహ్మరంధ్ర పర్యంతము చిత్‌జ్వాలగా ప్రజ్వలించెను. దానిని ఆ మహాబిలమందుంచి తానే అనిలరూపధారియై ఉద్వేద్ జ్వాలముల గొల్పుచు, వెలుగొందెను అట్లు ప్రజ్వరిల్లిన జ్ఞానాగ్నియందు సప్తసముద్రములు,సూర్య చంద్ర నక్షత్రములు వేల్చబడినవి. భండుడు, వాని అనుచరులు, సైన్యము మాత్రము ఈ యజ్ఞమున పాల్గొనక, దానిని పరిహసించుచూ వెడలి పోయిరి.

దేవతలు భండాసురునిచే దూషితములై నిర్వీర్యమైన తమ దేహ ములు వ్యర్థమని భావించి వారే సమిధలుగా యజ్ఞకుండమున దుమికిరి. వెంటనే వారు నవనవోజ్వల శరీరములతో బైటికి క్షేమముగావచ్చిరి.

అపుడు శివుడు లలితాదేవి ప్రాదుర్భావమునుకోరి ఆమెను స్తుతిం చెను అపుడాయజ్ఞకుండము నుండి దేవి అవతరించినది.

శ్రీ మాతా (1) శ్రీమహారాజ్ఞి (2) శ్రీమత్సింహాసనేశ్వరి (3) శ్రీ లలితా పరాభట్టారిక సంపదలను పెంపొందించే శ్రీమాత - జగన్మాత - సంతానాన్ని కని, ప్రాణంపోసి, జ్ఞానాన్ని ప్రసాదించి, సిరి సంపదలను వర్షింపజేయు కారుణ్యరాశి. ప్రపంచములోని విలువలన్నింటినీ కొలిచి, ఎవరెవరికి యెంతెంత యివ్వవలయునో, యెవరెవరికి ఏమేమి బాధ్యతల నివ్వవలయునో తెలిసినతల్లి. ఆమె మహారాణి. పదునాలుగు భువనములూ ఆమె పాలనలోనే యున్నవి. ఆమె శ్రీమత్సింహాసనేశ్వరి ఆమె పాలనలో దుష్టశిక్షణ శిష్టరక్షణ తు.చ. తప్పకుండా జరుగుతుంది. ఆమెలో తల్లి కుండవలసిన మమకారం, ఠీవి, సింహాసనానికుండవలసిన సామర్థ్యం, అనగా సృష్టి, స్థితి, లయములు ఆమెకు పూర్ణముగా యున్నవి. చిదగ్నికుండ సంభూతా (4) దేవకార్యసముద్యతా (5) ఉద్యద్భానుసహస్రాభా (6) చిత్అనగా కేవల పరబ్రహ్మము. అదియే అగ్నికుండము. బ్రహ్మాండ పురాణమున "పది యోజనములుగల కుండమును చక్కగా నిర్మించి దేవతలు తమ దేహములను ఆహుతి చేయగా, అందుండి దేవి అవతరించెను." అద్వైతపరముగ దేవి పరబ్రహ్మము. భండాసురాది రాక్షసులను వధించుటకై దేవకార్యమునుసిద్ధింప చేయుటకై దేవి ఆవిర్భవించెను. ఆమెకు జననములేదు. ఆమె ప్రకాశ రూపమైన చిత్ స్వరూపిణి:-

"పరబ్రహ్మమునకు అరూపము, సరూపము అను రెండురూపములు గలవు. సాకార రూపమును ధరించి శిష్టరక్షణార్థము అవతరించును, ఆమె ఉదయించుచున్న వేయి సూర్యులకాంతిగలది. అవాఙ్మానసమైన బ్రహ్మాండవ్యాప్తమైన తేజస్సులచే అవతరించినది. దేవతలనగా తేజోమూర్తులు. ఆదీప్తికి మూలం పరమేశ్వరి. ఈ చిదగ్ని కుండము నుంచి బయలువెడలిన ఆవెలుగులు వేవెలుగుల సూర్యులు

వెయ్యిమంది ఒక్కసారి ఉదయించినప్పుడుండు కాంతి కలది. సూర్య, చంద్ర, అగ్ని, విద్యుల్లతకు తారలకు వెలుగునిచ్చే పర్యంజ్యోతి చతుర్బాహు సమన్వితా (7) రాగస్వరూపపాశాఢ్యా (8) క్రోధాకారాంకుశోజ్వలా (9) మనోరూపేక్షుకోదండా (10) పంచతన్మాత్ర సాయకా (11) దేవికి నాల్గు చేతులు కలవు. ఆధ్యాత్మికముగ చెప్పవలసి వచ్చినప్పుడు మనోబుద్ధి చిత్తాహంకోములే ఆ నాల్గు చేతులు. ఆ నాల్గుచేతులందు నాలుగు వేదములున్నవి. వాటిచే భక్తుల ననుగ్రహించును. "భారత ఇతిబాహోఅ" నాల్గు చేతులలోని ఆయుధములచే దుష్టులను శిక్షించును. ఒకచేతియందు పాశము కలదు. అనురాగమే అపాశము. ఒక చేతిలో అంకుశముకలదు, అది క్రోధము. క్రోధమనగా ద్వేషము, జ్ఞానము అని రెండర్థములు కలవు. భక్తులకు జ్ఞానముగను ప్రసాదించి దుష్టులకు క్రోధముగను అది బాధించును. ఆమె చేతిలోని కోదండము మనస్సు. అది తీయని చెరుకుగడ. శత్రువులకు మహా భయంకరమైనది. ఈమనస్సును నిరోధించినచో సమాధి కుదురును. అపుడాత్మ సాక్షాత్కారము కలుగును. మనస్సున, ఈ విశ్వమంతయు రజ్జువునందు సర్వభ్రాంతి వంటిదే అను జ్ఞానము కలుగును. ఆమెకు ఐదు బాణములు కలవు. క్షోభణము, ద్రావణము, ఆకర్షణము, వశ్యము, ఉన్మాదము అని వాటిపేర్లు. కమలము, తెల్లకలువ, ఎర్రకలువ, నల్లకలువ, మామిడిపూలు - ఇవి ఆమె బాణములు. అవి శబ్ద స్పర్శరూప రసగంధములు. పంచతన్మాత్రలు, అవి పంచభూతముల సూక్ష్మరూపములు. ఇవియే ఆమె బాణములు. దేవి పంచభూతములను సృష్టించి వానినిమించి వెలుగుచుండును. "అత్యతిష్ఠద్దశాంగులమె".

నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా (12) ఆమె దివ్యమైన అరుణకాంతులచే సకల బ్రహ్మాండములును కప్పబడియున్నవి."

(ధ్యేన)భాస్తాసర్వమిదం" విభాతి"తామగ్ని వర్ణాతపసాజ్వలన్తీం" శ్రుతి శ్రీలలితాదేవియొక్క లావణ్యాన్ని వర్ణించెదరు. మాటలు చాలవు చంపకాశోకపున్నాగ సౌగంధికలసత్కచా (13) ఆమె కేశములం దలంకరింపబడిన చంపక, అశోక, పున్నాగ సౌగంధిక పుష్పములకు, ఆమె వాటిని ధరించుటచేత, అంతటి సువాసనలు వాటికి అబ్బినవి. కురువిందమణి శ్రేణీ కనత్కోటీర మండితా (14) ఆమెకిరీటమందు పద్మరాగమణులు పొదగబడియున్నవి. అవిదేదీప్యమానముగ ప్రకాశించు చున్నవి. ఆ మణులు దేవియొక్క అనురాగము, దయ మున్నగు సుగుణములు. ఈకాంతులు భక్తులయొక్క భక్తి ప్రవత్తులనుపెంచును అష్టమీచంద్ర విభ్రాజలికస్థల శోభితా (15) ఆమె లలాటము అష్టమీ తిథినాటి అర్ధ చంద్రాకారమువలె ప్రకాశించుచున్నది. ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా (16) చంద్రునిపంటి ఆమె ముఖమందుమచ్చవలె కస్తూరిబొట్టువుంది. వదన స్మరణ మాంగల్య గృహతోరణచిల్లికా (17) ఆమె కనుబొమ్మలు ముఖ మన్మధుని కళ్యాణమండపమునకు తోరణము కట్టినట్లుగా వుంది. అవి ప్రపంచానికే మంగళప్రదములు. వక్త్రలక్ష్మి పరివాహచలన్మీ భలోచనా (18) ఆమె కనులు ముఖకాంతి అను కొలనులో తిరుగాడు చేపలజంటవలె యున్నవి. చేపలు తమచూపులతొ తమగ్రుడ్లనుపొదిగి పిల్లలను చేయును. దేవి తనకటాక్షవీక్షణములతో భక్తులనుపోషించును అమె మీనాక్షి, నవ చంపక పుష్పాభనాసాదండ విరాజితా (19) ఆమె నాసాగ్రం అపుడే వికసించిన సంపంగి పువ్వువలె యున్నది. తారా కాంతి తిరస్కారి నాసాభరణ భూషితా (20) ఆమె ముక్కున ధరించిన "బులాకి" లోని మణులకాంతులచేత నక్షత్ర కాంతులను జయించినది. కదంబ మంజరి క్లుప్తకర్ణ పూరమనోహరా (21) ఆమె చెవిపైన కదంబ

పూలగుత్తిని ధరించుటచే మనోహరురాలుగా వుంది. తాటంకయుగళీ భూత తపనోడుప మండలా (22) సూర్య-చంద్రులే ఆమె కమ్మలు. పద్మరాగ శిలలను అద్దములను తిరస్కరించు కపోలము గలది. ఎదురుగానున్న శివుని రూపము వానియందు ప్రతిబింబములుగా కనబడు నవవిద్రుమబింబ శ్రీ న్యక్కారిరదనచ్ఛదా (54) దేవి పెదవులు దొండపండు ఎరుపుదనమును, పగడముల తిరస్కరించు కాంతి కలది. శుద్ధవిద్యాంకురాకార ద్విజ పంక్తిద్వయోజ్వలా (25) శుద్ధ విద్యఅనగా నేను, ఇది అనుద్వైత భావము లేకుండుట శ్రీవిద్యకు ఆమె దంతముల వరుస కాభేదములేదు. పదహారుజంటల పంక్తు షోడశాక్షరి మంత్రము వలెయున్నవి. శబ్ద బ్రహ్మరూపము బీజరూపముగా యున్నప్పుడు పర అనబడును. అంకుర దశయందుపశ్యంతి వికసించని దశ మధ్యమ బాగుగ వికసించినపుడు వైఖరి. ఆ అంతరమునకు దంతములకుపోలిక కలదు. హల్లులు చేరనిఅచ్చులు శుద్ధ విద్య. అవిపదహారు అక్షరములు ఆ అకుల జంట శివశక్తులు. అవి ముప్పది రెండు. అవేదంతరూపము నుగా యున్నవి. బ్రహ్మ విద్య, వేదవిద్యల నెరిగిన బ్రహ్మజ్ఞాను లలితాదేవి సులభసాధ్య కర్పూర వీటికామోద సమాకర్షద్దిగంతరా (.6) సుగంధద్రవ్యములతోకూడిన తాంబూలము కర్పూరవీటిక. ఆ పరిమళము దిగంతముల వ్యాపించినది. నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ (27) ఆమె సంభాషణా మాధుర్యము భారతిచేతిలోని వీణా తంత్రుల నాదమునకన్నను స్పష్టముగా రమ్యముగా నున్నది, మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా (28) ఆమె చిరునవ్వు నవ్వితే ఆదరహాస సరోవరంలో కామేశ్వరుని మనస్సు మునకలు వేస్తుంది. అనాకలిత సాదృశ్యచుబుకశ్రీ విరాజితా (29) దేవియొక్క చుబుక కాంతికి ఉపమానమేలేదు.

కామేశబద్ధ "మాంగల్యశోభిత కంధరా:-

కామేశ్వరునిచే కట్టబడి, మన్మథుని బ్రతికించుటకు కారణమై, సౌభాగ్యాధారణమైన మంగళసూత్ర మామె కంఠము నలరికరించి యున్నది.

కనకాంగద కేయూర కమనీయభుజాన్వితా (31) ఆమె భుజము లకు కనకాంగద కేయూరములు గలవు:-

రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తాఫలాన్వితా (32) రత్నము లచే చెక్కబడిన బంగారు కంఠాభరణములోని ముత్యములు చలించు చున్నవి. హృదయాకాశమందు దేవినిధ్యానించలేకకంఠమందేచింతించు వారు మధ్యములు. లోలాః - విషయ సుఖములకై ధ్యానించువారు అధములు. కేవలముక్తికై ధ్యానించువారు త్తములు. ఇటువంటి త్రివిధ భక్తులచే కొలువబడును. కామేశ్వర ప్రేమ రత్నమణి ప్రతి పణ స్తనీ (33) కామేశ్వరునికి తన స్తన రత్నద్వయమునిచ్చి ప్రేమరత్నము నొకదానిని కొనినది. ఒకటికి రెండిచ్చినది. భక్తిజ్ఞాన ములే ఆమె స్తనములు. నాభ్యాలవాల రోమాళి లతాఫలకుచద్వయీ (34) నాభినుండి పైకిపెరిగే లలితరోమాజిపై పండిన రెండు పండ్లలాగా ఆమె స్తనములున్నవి నాభియే ఆలవాలము. (పాదు) అదియే ప్రకృతి సంసారము, దానిలో నుండి పుట్టిన అజ్ఞానాంధకారమున కప్పబడిన జీవలోకమే రోమాళి మాయాపయుడైన జీవి అహంకారముతోకూడిన లత వలె విజృంభించును. ఆధారరహితమైనచో అది పడిపోవును. అట్టి లత నుద్ధరించుటకై జ్ఞానక్షీరసహితమైన ఫల రూపమైన స్తనముల జంట గలది. అవి మాంసమయములుగావు. సృష్టిలోని సకలజీవరాసుల నుద్ధరింప అమృతక్షీరములు దాల్చిన మాతృమూర్తి యొక్క స్తన ములు. లక్ష్యరోమలతా ధారతా సమున్నేయ మధ్యమా (35) నడు

మున్నదా లేదా అను సందేహముగలిగి అచట పుట్టిన నూగారుచే నడుము కలదని ఊహించవగలము. దేవి నడుమంతటి సూక్ష్మమైనది. మాయచేకప్పబడిన జీవరాశికి ఆధారమై మాయాతీతమైనదని ఊహింప నగును, స్తనభార దళన్మధ్య పట్టబంధవళిత్రయా(36) స్తనభారముచే నడుము వంగిపోపునేమో యని దృఢతకై బంగారు వడ్డాణముచే మూడు చుట్లు చుట్టబడినట్లున్న ముడుతలుగలది దేవి. దేవి స్తనములు సూర్య చంద్రులు. రాత్రింబవళ్లను తెలుపును. కాలమునుభరించు కాలరూపిణి. భూత భవిష్యద్వర్తమానములు మూడు వళయములు:- అరుణారుణ కౌస్తుభవస్త్రభాస్వత్కటీ (తటి)37 కెంజాయతో ధగధగలాడేపట్టుచీరెఆమె కట్టి ప్రదేశము ప్రకాశివుచున్నది. రత్నకింకిణికా రమ్యరసనాధాను భూషితా (38) రత్నమయములైన చిరుగంటలచే రమ్యమైన మొల నూలుచే నలంకరింపబడినది. నాదమయ ఓంకారాత్మక సూత్రధారిణి:- కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా : (39) ఆమె ఊరువుల లోని సొగసు, చెలిమి మెత్తనిమైమరపు కామేశ్వరునికే తెలుసు. శివ శక్తిత్వము తెలుపుచున్నవి. మాణిక్యమకుటాకార జానుద్వయవిరాజితా (40) ఆమె మోకాళ్లు మాణిక్యాలతోచెప్పిన రెండుకిరీటములవలె శోభిల్లు చున్నవి. ఇంద్ర గోప పరిక్షిప్త స్మరతూణాభ జంఘికా : (41) ఇంద్రగోపమణులచే చెక్కబడిన మన్మధుని అమ్ములపొదలతో సమాన ముగా నున్నవి. ఇంద్ర-మోక్షము, గోప-రక్షించునది, స్మర=చింతింప తగిన, జంఘకా-పుట్టిక. మోక్షమిచ్చి రక్షించును. కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా (43) ఆమె మీగాళ్లు తాబేటి చిప్పలను ధిక్కరించున్నవి పదునాల్గు భువనములను భరించగల కూర్మావతారమే. నఖదీధితి సం ఛన్న నమజ్జనతమోగుణా (44) ఆమెపాధములకు నమస్కరించెడి వారి హృదయములలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోల గలిగిన వెలుగు

ఆమె కాలిగోళ్లకు గలవు. పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా (45) ఆమె చరణములు కమలకాంతులను ధిక్కరించుచున్నవి. లక్ష్మి (పద్మాలయా) సరస్వతులకు తల్లి:- శింజానమణి మంజీర మంకిత శ్రీ పదాంబుజా (46) ఆమె పాదపద్మములు శబ్దించుచున్న కాలి అందెలచే అలంకరింపబడియున్నవి. వేదధ్వనులు మ్రోగుచున్నవి. మరాళీ మందగమనా (47) మందమందముగా మరాళగమనంతో ముందుకు సాగుతోంది. సత్వగుణ స్వభావురాలుగనుక రాజస తామసాదుల వలె తీవ్రగతి కలదికాదు. మహాలావణ్యశేవధిః (48) అందాలరాశిసర్వారుణా (49) ఆమె ధరించిన వస్త్రము, గంధము, మాణిక్యాభరణములు, మందార కుసుములన్నియు అరుణకాంతివంతములే. లోకములన్నింటా వ్యాపించిన అరుణ తేజస్సే. అనవద్యాంగీ (50) ఆమె అవయవములన్నియు సుందరములు దోషరహితములు. సర్వాభరణభూషితా (51 శిరోభూషణములనుండి కాలిమెట్టెలవరకు వలుబదినాలుగు ఆభరణములను ధరించినది. సమస్త చరాచరజగత్తును భరించునది. శివకామేశ్వరాంకస్థా (52) ఆమె మంగళకరుడైన కామేశ్వరుని తొడపైన కూర్చొనియున్నది. శివ, కామ, ఈశ్వర మూడు శబ్దమున్ను ప్రజ్ఞానమును తెలుపును. లలితాదేవి జ్ఞాననిష్ఠితురాలై జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాతయై యున్నది. ఆమె స్థూల సూక్ష్మరూపముల కతీతురాలు. శివ, కామ, ఈశ్వర రూపమైన ప్రజ్ఞానముయొక్క ఒడిలోయుండును. లోకములను సృష్టింపదలచిన శివుడే కామశబ్ద వాచ్యుడు. "సోకామయత" - శివా (53) శివుని ఇచ్ఛారూపమే లలిత ఇచ్ఛ యొక్క రూపమే లలిత: ఇచ్ఛయొక్క రూపమైన శక్తికి శివుడే అధారము. శివునికి శక్తిభేదములేదు. స్వాధీనవల్లభా (54) శివుడామెకు స్వాధీనుడు సుమేరు మధ్య శృంగాస్థా (55) మేరు పర్వత మందుండు శృంగ మందుండు శృంగములలోని నాల్గవ శృంగమందు ఆమెకు వాసము,

బ్రహ్మ, విష్ణు రుద్రులవి మూడు శృంగములు. వాని మధ్యయుండు శిఖరమే దేవియొక్క వాసస్థానము. అది లోకాలోకములకు అతీతమైనది. శ్రీమన్నగరనాయికా:- (56) ఆమె శ్రీవిద్యానగరమునకు నాయకురాలు. శ్రీ చక్రనాయిక. బ్రహ్మాండములకు శ్రీ విద్యకు శ్రీ చక్రము సూచకము. ఈ రెంటికి అధిష్ఠానము, చింతామణీ గృహస్థా (57) చింతామణులుతాపిన గృహమధ్యమందుండును. చింతామణివలె దేవి వాంఛితార్థముల నొసగును. పంచబ్రహ్మసనస్థితా (58) పంచ బ్రహ్మలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులకు మించిన మహోన్నతస్థాయిలో పరమేశ్వరి నెలకొనియుండును. శ్రీచక్రమందున్న పంచకోణములే పంచబ్రహ్మలు. బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంధి రుద్రగ్రంధి, ఈశ్వరస్థితి, సదాశివరూపములకుపైన చిత్కళా రూపిణీ మహాపద్మాటవి. షట్చక్రములేగాక అనేకవేలనాడులే మహాపద్మములు వాటిని అధిష్ఠించిన లలితను ధ్యానించవలయును. అరుణోపనిషత్ "ఆండీభవజమాహుః" కదంబవనవాసినీ (60) చింతామణి గృహము దానిచుట్టూ కదంబవనముకలదు. అందు దేవి వసించుచుండును. వెలుగు చీకటుల కతీతమైన స్థానమున వసించును. సుధాసాగరమధ్యస్థా (61) ఇవన్నియును సుధాసాగరమందుకలవు. పునర్జన్మలేని అమృతత్వము దేవి ప్రసాదించును. మోక్షమునకు కర్మ ఉపాసనలు పరంపరసాధనములు. జ్ఞానమేసాక్షాత్సాధనము. వీటిచే పొందగలము:- కామాక్షి (62) కామదాయినీ (63) శివుడే ఆమె కనులు, ఆమె కనులు చాలా ఇంపైనవి. కోరికలనిచ్చును. కామేశ్వరునితొ కలిసి యున్నందున మోక్షము నిచ్చును. దేవర్షిగణసంఘాత స్తూయమానాత్మవైభవా (64) బ్రహ్మాది దేవతలు, వశిష్ఠాది ఋషులు, నారదాది దేవఋషులచే కీర్తింపబడుచు ఆత్మవైభవమును ప్రదర్శించుకొను చున్నది. దేవియే పరతత్వము భండాసుర వధ కోసము ఆమెను పైసమూహము కీర్తించుచున్నారు.

భండాసుర వధోద్యుక్త శక్తిసేనాసమన్వితా (65) భండాసురునిచంపుటకై పూనుకొనిన శ్రీదేవతా సైన్యముచే బాగుగ యుద్ధవ్యూహమును రచించినది. భండుడనగా లజ్జలేనివాడు. ప్రకృతి యందు జీవ భావమును పొందిన దేహి. అజ్ఞానియై సుఖ సుఃఖాదులచే పీడింపబడు దేహియే భండుడు. వాడు అసురుడు. అసూన్ - ప్రాణములను, రా = తొలగించువాడు. తన సుఖమునకై యితరులను చంపుటకైనను సిద్ధపడెడువాడు. అసు అనగా ప్రకృతి బంధము. అజ్ఞాన మనెడి జీవ బంధము. ఆ బంధములను వినాశ మొనర్చుకొనుటకుచేయు ప్రయత్నముల సామర్థ్యముల సమూహములు దేవికే గలవు. జీవుడు మోక్షేచ్ఛచే యత్నించునపుడు జీవుడే పరమాత్మయని ఎరిగినపుడు అతనికి అన్నియును సిద్ధించును. సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా (66) రణకోలాహలమను గజదళమును నడుపుతూ సంపత్కరీదేవిచేత సేవింపబడుతూ భండాసుర సంహారమునకు దేవి సిద్ధముగాయున్నది (చిత్తవృత్తికి విషయ భూతములైన శబ్దాదివిషయములచే సేవింపబడుట సూచితము. సుఖసంపదలతోకూడిన మనోవ్యాపారమే సంపత్కరి. ఇంద్రియములే గజములు. ఒకే జ్ఞానమందు విషయీభూతమైన త్రిపుటిచే - జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాతా - తెలుసుకోబడిన చిత్తవృత్తియే సంపత్కరి - ఎపుడు మనుజుడు యింద్రియాదులకు గోచరమగు పదార్థముల విజ్ఞానము తన మానసిక భావములే యని గ్రహించునో అపుడతనికి తురీయస్థితి కలుగును.

అశ్వారూఢాధిష్ఠితాశ్వ కోటి కోటి భిరావృతా :- (67) లలితాదేవి పాశమునుండి పుట్టిన 'అశ్వారూఢ' అను దేవత మహావేగముగల అపరాజిత అను అశ్వమునెక్కి కోటానుకోట్ల ఆశ్వికదళమును నడుపుచున్నది. (ఇంద్రియములే గుర్రములు. వాటిని స్వారి చేయునది

మనస్సు. ఆయా యింద్రియ సుఖముల ననుభవించు చుండును. ఆ మనస్సు ఆత్మజ్ఞానము పొందవలయును. ఇంద్రియముల నడుపు మనస్సు అపుడు స్వాధీనమగును. స్వాధీనమనస్కుడైన యోగికి ఆత్మయొక్క స్వరూపజ్ఞానము కలుగును. తానే పరమాత్మ యగును. చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా:- (68) చక్రరాజమనే రథంలో సర్వాయుధములను పుష్కలగా ఉంచుకొని స్వయంగా అధిరోహించి సమరభూమికి బయలుదేరినది. (అహంబ్రహ్మాస్మి అను శుద్ధ విద్య. శుద్ధ విద్యచే అన్ని చక్రములపైన అధిపత్యము లభించును. శ్రీచక్రరథమును పొందినవాడు సంపూర్ణ ఆత్మ జ్ఞానము కలవాడై సకలము ఆత్మజ్ఞాన స్వరూపమయమని తెలుసుకొని, సర్వేశ్వరుడే యగును. నేను వేరు, ఇది వేరు అను భేదబుద్ధియే అవిద్యనశించగనే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని తెలుసుకొనును:-గేయచక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా (69) మంత్రిణియయిన శ్యామలాదేవి గేయ చక్ర రథమునెక్కి సైన్యములను నడుపుచున్నది. ఆవిధంగా ఆమె లలితను సేవించుచున్నది. శ్రీచక్రమందు బిందువు నాక్రమించిన త్రికోణమే గేయచక్రము. మంత్రిణీయనగా బుద్ధితత్వ పరివర్తనము అదియే త్రిపురాశక్తి. ఆత్మ జ్ఞానానుభవముచే నేనే ఆదేవి యని అనుసంధానముచేసిన శ్రీవిద్యా స్ఫూర్తి కలుగును. అపుడు పరబ్రహ్మ సాక్షాత్కారము లభించును. కిరి చక్రరథారూఢ దండనాథాపురస్కృతా (70) వరాహరూపములేక వరాహముచే లాగబడుచక్రములుగలరథము వహించిన "వారాహి" అను దేవిచే సేవింపబడుచున్నది. వారాహిహస్తమునందు దండముకలదు. కిరయః - కిరణములు - సృష్టులు. అనగా సృష్టి స్థితి లయములు. చక్రము=వాటి సమూహము. అట్టి రథము నెక్కిన యోగికి దండనాధుడైన యముని బాధలుండవు. పరతత్వ



స్వరూపిణి అయిన దేవిని సేవించువాడు దేవియే యగుచున్నాడు సృష్ట్యాదులలో చిక్కుకొనినను తామరాకుపై నీటిబిందువువలె నిర్లిప్తుడై జ్ఞానమునుండి చ్యుతినిబొందక జనన మరణ రహితుడై శాశ్వతానందమును పొందును. జ్వాలామాలిని. ఆమె దేవిచుట్టూ అగ్నిమయప్రాకారమును నిర్మించెను. జ్ఞాని సృష్ట్యాదులలో చిక్కినను. ఆత్మానుసంధానానుభవమునకు విఘ్నముకలుగదు. శ్రీచక్రమందు శక్తికోణములు ఐదు. అవియే జ్వాలామాలికలు. వానియందు క్షిప్తములు - సమరస భావరూపములనందిన వహ్నిప్రాకారములు. అనగా శివత్రకోణముల నాల్గింటిలోనూ బిందురూపమున దేవి యున్నది. జ్ఞాని స్వరూపానంద స్థితిని అందుకొనకపోయిననూ, జ్వాలామాలికలలో రగుల్కొనియున్నను మోక్షచ్ఛగలవాడగుటచే అతనిని సృష్టి స్థితి లయములు బాధించవు ఎందుకనగా అతడు శివతాదాత్మ్యము నందుకొనినవాడై యున్నాడు. దృశ్యమానజగత్తుమిధ్య - అది నశించును. కానీ ఆత్మ అయిన శివుడు నశింపడు. కార్యము నశించును. కర్తకు నాశములేదు. పరాశక్తి చిదానంద రూపిణి గాన, సాక్షిరూపమున యుండును. ఆత్మ కేదియు ఎట్లు అంటదో దేవికి కూడా అట్లే ఏదియు అంటదు - భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా (72) "నకులి" మున్నగు శక్తులు పరాక్రమముతో భండాసురుని చతురంగ బలములను సర్వ నాశము చేయుటకు విజృంభించుచుండుటను చూచి దేవికి మహదానందము కలిగినది (భండుడనగా జీవుడనివివరించితిమి. వానిసైన్యములు ద్వైతవృత్తులు జీవుని ద్వైతవృత్తుల నాశనము చూచిన ఆత్మకు ఆనందముకలుగును అన్వయిత వృత్తులచే ద్వైతవృత్తుల వినాశము సాధ్యము. నేనువేరు. అదివేరు అను ద్వయిత భావముచే కప్పబడిన, అజ్ఞానియై, జీవుడు సంసార బంధమున తగుల్కొని యున్నాడు. అద్వయిత శక్తులకు

మనస్సు కారణం. మనస్సునకుండు బాహ్య వృత్తులను నశింపజేసి, అంతర్ముఖమొనర్చుకొనినచో ఆత్మ సాక్షాత్కారము కలుగును. అట్టి శక్తుల విక్రమమునుగాంచి దేవి సంతసించును. జ్ఞాని ముక్తుడగును:- నిత్యాపరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా (73) కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావజ్రేశ్వరీ, శివదూతీ, త్వరితా, కులసుందరీ, నిత్యా, నీలపతకా, విజయా, సర్వమంగళా జ్వాలా మాలినీ, చిత్రా అను పదునైదు తిథుల దేవతలు, వారి పరాక్రమముచే దమనకుడు మొదలు చంద్రగుప్తునివరకుగల భండుని సేనాపతులు పదునైదుమంది మడిసిరి. వారి పరాక్రమమునకు దేవి చాలా సంతసించినది. (ఆత్మశక్తుల విజృంభణమును చూచుచుండిన ఆనందము కలుగుచుండును. అవి ఒకసారి విజృంభించుటకు ఆరంభించినచో తర్వాత ఆగవు జ్ఞానబీజము ఒకసారి అంకురించగనే అది వృద్ధి చెందుచునే యుండును. ప్రాణియొక్కకళలు అభ్యాసము లేకపోవుటచే అవి నశించును. జ్ఞాన కళ ఒకసారి తెలిసిననూ వృద్ధిపొందునే గాని నశింపదు.)

భండ పుత్ర వధోద్యుక్త బాలావిక్రమనందితా (74) లలితాదేవి హృదయము నుండి బాల, బుద్ధి నుంచి శ్యామలపుట్టిరి. భండాసురునికి ముప్పది కొడుకులు కలరు. వారుచతుర్బాహు మొదలు ఉపమాయువు వరకు గలరు. వారిని వధించుటకు తన పుత్రికయైన బాల విక్రమించుటనుచూచి దేవి పరమ హర్షము నొందెను. (బాల అనగా విమర్శశక్తి ఆ శక్తి వివిధ బంధములను నశింపజేయును ఆత్మ స్వరూపిణి అయిన దేవి స్వాత్మశక్తుల విక్రమమునుచూచి ఆనందించును. భవబంధములు తొలగినచో మాయ నశించును. ఆత్మానందముకలుగును. మంత్రిణ్యంబావిరచిత విషంగవధే తోషితా (75)

భండాసురుని ఎడమ భుజమునుండి విషంగుడుపుట్టెను. మంత్రి ణ్యంబా అగు శ్యామలాదేవి వానిని సంహరించెను. అందుచే లలితాంబ కు సంతోషము కలిగెను. (ఆత్మ విచారముచే సంగరహితుడైన సాధకుడు, ద్వంద్వరహితుడై ఆత్మానందమును పొందును. విశుక్రప్రాణ హరణ వారాహి వీర్యనందితా:- (76) భండాసురుని కుడిభుజము నుండి విశుక్రుడు జన్మించెను. వాడు శుక్రాచార్యునికి సమానుడు. వానిని దండినీదేవి యగు వారాహి చంపెను. ఆ వార్త విని లలితాదేవి ఆనందించెను. భండ పుత్రులు విషంగుడు, విశుక్రుడు. వారు అణవాది మలములు. విరుద్ధమైన సంగము విషంగము ప్రాపంచిక విషయములపై కోరిక. విషమును పొందునది వీషంగము - చెడ్డకోరికలతో ఇంద్రియ సుఖములను విషములను గ్రహించుట విశుక్ర మనగా విరుద్ధమైన తేజస్సు. అదియే జీవభావము, అధికమైన దుఃఖము పొందు సంసారము. వి=పోయిన, శుక్రము=తేజస్సు - జీవభావము. వారాహి, మంత్రిణి, బాలా అను పదములు మానసిక వ్యాపారములు. అవి కూడా నశింపవలయును. మనో నాశమయినవెంటనే జీవభావము పోవును. అణవాది మలనాశముతో ఆత్మానందము కలుగునని ఫలితార్థము కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా (77) రాక్షసులచే కల్పింపబడిన అనేక విఘ్నములచే బంధింపబడిన దేవతలనుచూచి దేవి కామేశ్వరుని ముఖమునుచూచుటతోడనే మహాగణపతి జన్మించెను. ఓం, శ్రీం, హ్రీం,గ్లౌం,గం,గణపతియే వరవరద సర్వజనం మే వశమానాయాస్వాహా"-ఇది మహాగణపతి మంత్రము.గణపతి రాక్షస విఘ్న యంత్రముల నన్నింటిని భేదించెనుపరమశివుని ముఖచంద్రునియొక్క ప్రేమతోగూడిన చూపులనెడివెన్నెలలచే కల్పింపబడిన మహాగనేశ్వరుడు కలదు.కామేశ్వరుడు నిర్గుణబ్రహ్మము అతనిముఖావలోకనముచే-అనిర్గుణపరబ్రహ్మను

భవముచే కల్పితగణేశ్వరా-పుర్యష్టకాధీశత్వము కలిగినది. పుర్యష్టకము: (1) కర్మేంద్రియములు (2) జ్ఞానేంద్రియములు (3) అంతఃకరణ చతుష్టయము (4) పంచప్రాణములు (5) పంచభూతములు (6) కామ (7) కర్మ (8) అవిద్య:- ఈ ఎనిమిదింటిచే నేర్పడిన పట్టణమే మనశరీరము. ఇవన్నియు మాయా కల్పితములు, నిర్గుణ పరబ్రహ్మము యొక్క అపరోక్షానుభూతి కలిగిన వెంటనే మానవుడు ఈఎనిసుదిశక్తులు నశించును. జీవోపాధి జ్ఞానము తొలగును. అపుడు అతడు పరబ్రహ్మముతో దాదాత్మ్యము నందును. మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా (78) విశుక్రుడు పరాశక్తి సైన్యముపై నాలుగు మైళ్ళ వైశాల్యముగల శిలాఫలకముపై ఎనిమిది కోణములు ఎనిమిది త్రికోణములు లిఖించి వానిపై "అలసాది" దేవతలను ప్రతిష్ఠించి (జయవిఘ్నమను పేరుగల దాయంత్రము) దానిని ప్రయోగించెను. దానిని విఘ్నేశ్వరుడు నిశ్శేషముగా నశింపజేసెను. దేవి ఆనందమునకు మేరలేదు. (పుణ్యష్టకాధిపతి యయిన గణపతిపుట్టుకతో విఘ్నయంత్రము బూడిద అయెను. అనగా చిదాభాసమైన పుర్యష్టకము చిన్మయముగ లెస్సగా భావింపబడుటచే చిదానందము కలుగును. జ్ఞానముచే సంశయనివృత్తి కలుగును. అపుడు ఉపాధులు భస్మమగును. భండాసురేంద్ర నిర్ముక్త శస్త్రప్రత్యస్త్ర వర్షిణీ (79) ఇపుడు దేవికి భండునికి మధ్య యుద్ధము జరుగుతూంది. దేవిపైన భండుడు శస్త్రములను ప్రయోగించుచున్నాడు. వాటన్నింటినీ దేవి ప్రత్యస్త్రములతో ఖండించి వేయుచున్నది. అవిద్య అను అస్త్రమును ఆత్మజ్ఞానమను ప్రత్యస్త్రముచే నశింపచేయవలయును. కరాంగుళినఖోత్పన్న నారాయణదశాకృతిః(80) భండుడు సర్వాసురాస్త్రమును అస్త్రమును ప్రయోగించి, సోమక, హిరణ్యాక్ష హిరణ్యకశిపు, బలి, రావణ, శిశుపాలాది రాక్షసులను పుట్టించి"

దేవిపై ప్రయోగించెను. అపుడు తన పది వ్రేళ్ల గోళ్ల నుండి మత్స్య, కూర్మ, వరాహాది దశావతారములను సృష్టించి వారిని సంహరించెను, (నారాయణ శబ్దము జీవునికి ఈశ్వరునికికూడా అన్వయించును. జీవుడికి పంచావస్థలు కలవు. జాగత్స్వప్న, సుషుప్తి, తురీయ, తురీయాతీత అవస్థలు. ఈశ్వరునికి, సృష్టి, స్థితి,సంహార,ఆవిర్భావ, తిరోధానావస్థలు కలవు. ఇవియే దశావతారములు. జీవేశ్వరుల దశవిధ అవస్థలు మోక్ష హేతువులుతావు. ఇవి దేవిచే సృష్టించబడిన మాయాకృత్యములు. ఆత్మ జ్ఞానముచే వీనిని తెలుసుకొని, మాయను దాటి మోక్షము నొందవలెను. మహాపాశుపతాస్త్ర నిర్దగ్ధా సురసైనికా (81) పాశుపతాస్త్రమునకు ఈశ్వరుడు దేవత. మహాపాశుపతమునకు సదాతవుడు దేపత. "రుద్రాదయః పిశాచాంతాః పశవః" (లింగపురాణం) రుద్రుడు మొదలు పిశాచముల వరకు పశు శబ్ద వాచ్యులే వారికి పతి సర్వేశ్వరుడైన సదాశివుడు, అట్టి సదాశివుని అస్త్రమును ప్రయోగించి దేవి భండుని సైన్యమును హతమార్చినది. (అభ్యాసాతిశయముచే అద్వయిత జ్ఞాన సిద్ధి కలుగును. అ జ్ఞానాగ్నిచే ద్వయితవృత్తులు నశించును):- కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసుర శూన్యకా (82) భండుని బంధువు లందరూ వధింపబడిరి. వాడు ఒంటరి వాడయ్యాడు. వాడుదుష్టుడు. క్రోధాగ్నిచే మండుచున్నవాడు. లోకముల నన్నింటినీ కలవరపెట్టువాడు. మహాబలశాలి. మహాసురుడు. వరాక్రమశాలి, వానిని వేయి సూర్యులతేజస్సు గల కామేశ్వరాస్త్రముతో వధించెను. ఆ అస్త్రాగ్నిచే భండుడే గాక, వాని స్త్రీలు, ధనములు కలిగిన వాని శూన్యకనగరము నిజముగా శూన్యమైపోయెను.

కామేరాస్త్రమనగా చిదగ్ని అందరిచే కోరబడువాడు కాబట్టి కామేశ్వరుడు, అందుచేత చిదాత్మరూపుడు. "ఆత్మనః కామాయ సర్వం

ప్రియం భవతి". బృహ. ఉప : ఆత్మకొరకు అంతయూ ప్రియమే బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుతవైభవా (83):- ఆమె పరక్రమమునుచూచి, బ్రహ్మ, విష్ణు, మహేంద్రుడు దేవతలు - ఆశ్చర్య పడి, ఆనందించి, ఆ వైభవాన్ని కీర్తించిరి. భండాసురునిచే ఇంత కాలము పీడింపబడిన దేవతలందరూ, వాడు చంపబడిన తర్వాత జగదేకమాతను పొగడిరి. - (సర్వత్ర పరబ్రహ్మమును తమ స్వాత గానే సాక్షాత్కరించుకొనిరి. పరబ్రహ్మ మిట్టిదని తెలియరానిది. దాని యందు లీనమైనవారికేతెలియును. హరనేత్రాగ్ని సందిగ్ధ కామసంజీవనౌషధిః (84):- భండాసుర వధానంతరము దేవతలందరూ మన్మధుని బ్రతికించవలసినదిగా దేవిని ప్రార్థించిరి. దేవి మన్మధుని బ్రతికించెను. (జన్మకారణమైన మూలాజ్ఞానము (మాయ) జ్ఞానాగ్నిచే దహింపబడి అవిద్యానాశముచే ఆత్మ సాక్షాత్కారరూపమోక్షము కలుగును. అజ్ఞాన నివృత్తికి దేవి పరమౌషధము):-

ఇంతవరకు దేవియొక్క పరరూపమును భండాసురవధతో శ్లేష రూపమున వాగ్దేవతలు వర్ణించిరి.

దుర్గ - (190)

యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా/దుర్గాత్సంత్రాయతే యస్మాద్దేవి దుర్గేతి కథ్యతే. ప్రపద్యే శరణం దేవీం దుం దుర్గే దురితం హరతాం దుర్గాం దుర్గమాం దేవీం దురాచారవిఘాతినీమ్ నమామి భవ భీతోహం సంసారార్ణవ తారిణీమ్: (దేవ్యుపనిషత్):- దుర్గముడను రాక్షసుని చంపినది. దుర్గముడను రాక్షస సంహారము చేసెను. అందుచే ఆమె దుర్గమా. (189)

"చండికా"

మార్కండేయ పురాణములోని దేవీ మహాత్మ్యమందు దేవియొక్క చండికావతరణము విపులముగా కీర్తించబడియున్నది. లలితాసహస్ర

నామములలో ఈ అవతార ప్రసక్తిని చండికా (755) శివదూతీ (405) చండముండాసుర నిషూధినీ అను నామములద్వారా తెలుపుచున్నారు. పూర్వ మొకప్పుడు కశ్యప ప్రజాపతి భార్యయగు దితి, తనతల్లిఅయిన దక్ష ప్రజాపతి భార్యయొద్దకు పోయి తనకుమారులు దేవతలచేత చంపబడుచున్నారు. దానికి ప్రతీకారము గావించు మార్గము చెప్పుమనెను అందుకామె దితితో "నీవు ఇంద్రాదుల జయించు కుమారుని కొరకు తపస్సు చేయుమని'' చెప్పెను. సుపార్శ్వుడను ఋషి ఆశ్రమమునకు దితి పోయి అక్కడ తపోనిష్ఠురాలై సర్వ జంతురూపముల ధరించుచు పంచాగ్ని మధ్యమున నిలబడి తపస్సు చేయుచుండెను. కడపట మహిషిరూపము దాల్చి ఘోరతపస్సు చేసి ముల్లోకములను క్షోభింప దొడంగెను. సుపార్శ్వ మహర్షి యొక్క తపమునకు భంగము కలిగి అతడు దితిని శపించెను. నీ కోరిక ఫలించును. కానీ వాడు నీచేష్టకు తగినట్లు గానే యుండును" అనెను. అట్లు మహిషాసురుడు దితికి జన్మించి దేవతలమీద దండెత్తి, జయించి తాను వారి పదవుల నాక్రమించెను తానే ఇంద్రుడాయెను. ఓడిపోయిన దేవత లందరూ బ్రహ్మను ముందుంచుకొని శివుడున్న చోటు కరిగి తమ బాధలనివేదించుకొనిరి. అపుడు బ్రహ్మ, విష్ణు, రుద్రులకు మహిషునిపై ఆగ్రహము కలిగినది. ఆ త్రిమూర్తుల మొగముల నుండి, యితర దేవతల నుండి ఒక మహా తేజము అవిర్భవించెను. ఆ దివ్య తేజము దేవి స్వరూప మాయెను, ఆమెయే దుర్గ. చండి:- శివుడామెకు శూలమును, విష్ణు చక్రమును, వరుణుడు శంఖమును, అగ్ని బల్లెమును, ఇంద్రుడు వజ్రాయుధాన్ని, యముడు పాశాన్ని దెవతలందరూ తమ తమ అయుధములను ఆమె కిచ్చిరి. బ్రహ్మ అక్షమాలను, కమండలువును యిచ్చెను. ఆమె సింహ వాహనముకెక్కి అట్టహాసము చేసెను. ఆ భయంకరారావమును విని

మహిషుడు తన సైన్యముతో ఆమెయున్న చోటుకు వచ్చెను వమెకాంతి ముల్లోకములను వ్యాపించియున్నది. ఆమెకుఅనేకచేతులున్నవి. మహిషునిచుట్టూ వేలకోట్ల ఏనుగులు, గుఱ్రములు, రథములు, సర్వసేనలతో సేనాపతులు చేరియున్నారు. దేవికీ అసురులకు భయంకర యుద్ధము జరిగెను. సింహముకూడా జూలు విదుల్చుచు అసుర సైన్యమును చీల్చి చెండాడుచుండెను. మహిషుని సేనాని చిక్షురుడు బాణవర్షములు కురిపించెను. దేవి వాటిని ఖండించి వానినివధించెను. తర్వాత చామరుడు అనెడివాడు రంగములోకి దిగెను. వానిని సింహము చంపి వేసెను. ఉదగ్రుడు, ఉద్ధతుడు, బిడాలుడు మున్నగు వారిని దేవి హత మార్చెను. మహిషుడు సింహరూపము, ఏనుగురూపమును, తుదకు మహిషరూపము ధరించి, దేవితో యుద్ధము చేసెను ముల్లోకములు తల్లడిల్లిపోయెను. దేవి మహాసురుని తన ఖడ్గముతొ కూల్చి వేసెను. దేవతలు, దివ్య మహర్షులు దేవిని సంస్తుతించిరి. సాచండికాఖిల జగత్పరిపాలనాయ నాశాయి చాశుభభయస్య మతింకరోతు" ఆ చండిక సర్వజగత్తును పరిపాలించుట యందును, అమంగళము వలని భయమును నాశిల్లజేయుటయందును తనబుద్ధిని వినియోగించుగాక.

### దుర్గ శుంభ నిశుంభులను వధించుట

శుంభ నిశుంభులు కశ్యపుని భార్యయగు దనువుకు జన్మించిన వారు. వారు ఇంద్రునియొక్క ముల్లోకాధిపత్యమును, హవిర్భాగములను హరించిరి. సూర్య, చంద్ర, యమ, వరుణ, కుబేరుల అధికారములను కూడ స్వాధీనము చేసికొనిరి. అపుడు వారు దేవిని ప్రార్థించిరి. వారికి దెవి ప్రత్యక్షమాయెను. ఆమె శరీరకోశము నుండి అంబిక వెలువడెను. అంబికా (295) ఆమెయే గౌరి, (635) (దేవీ పురాణము ప్రకారము సతీదెవి యోగాగ్నిచే భస్మమై హిమవంతునకి పుట్టెను. ఆమె

శంఖము, కడిమపువ్వు, చంద్రునిరంగు కలది అని వున్నది.) మార్కండేయ పురాణంలో "పునశ్చగౌరీదేహాసా సముద్భూతాయథాభవత్ వధాయ దుష్టదైత్యానాం తథాశుంభ నిశుంభయోః" మరలదేవతలకు ఉపకారము చేయుటకై లోకరక్షణార్థము దైత్యులను, శుంభ నిశుంభులను వధించు కొరకై ఆమె గౌరీరూపమున ఉద్భవ మొందిన విధమును తెలిపెదను వినుము" - ఆమె అత్యంత మనోహర రూపమును ధరించి హిమవత్పర్వత సానువులందు తిరుగుచుండెను. శుంభ నిశుంభ భృత్యులగు చండ ముండులులు చూచిరి. వారిరువురు తమ ప్రభువు వద్దకు పోయి ఆమె యొక్క అత్యుత్తమ సౌందర్యమును వర్ణించి, ఆదేవి ఎవ్వరో తెలుసుకొని తెచ్చుకొనుడని ప్రబోధించిరి. వారు ఆమె వద్దకు సుగ్రీవుడను మహాసూరుని దూతగా బంపిరి. వాడామెకువద్దకు వచ్చి "దేవీ! నిన్ను మా ప్రభువులగు శుంభ నిశుంభులు కోరుచున్నారు. నీవు వారిలో నెవరినైనను పెండ్లియాడుము. నీకుమహాసంపద లభించుమ." అనిచెప్పెను అపుడు భగవతి యగు దుర్గ తనలో తాను నవ్వుకొని "నేను పూర్వము తొందరపడి ఒక ప్రతిజ్ఞ చేసియున్నాను యుద్ధమున నన్ను ఎవరు ఓడించునో అతడే నాకు భర్తయగును. అందుచే వారు యిచ్చటికి వచ్చిన నన్ను ఓడించి నన్ను పెండ్లియాడవచ్చును." అని చెప్పి వంపెను, వాడు వచ్చి ఆ మాటలను రాక్షస రాజుల కెరింగించెను. మొదట ధూమ్రలోచనుని ఆమెను పట్టితెమ్మని ససైన్యముగా పంపెను వానిని వాని సైన్యమును దేవియు, ఆమె వాహనమైన సింహమును వరిమార్చెను. తర్వాత చండ ముండులను చతురంగబలసమేతముగా ఆమెను పట్టి ఈడ్చుకొని రమ్మని ఆజ్ఞాపించిరి. బంగరు శిఖరము మీద సింహవాహనయైన దేవిని వారు చూచిరి. ఆమె నొసట నుండి ఘోరమగు ముఖము కలిగి ఖడ్గ పాశాదుల ధరించిన కాళికాశక్తి బయలు

వెడలెను. ఆమె దైత్యబలమును క్షణమాత్రమున నమలి వేసెను. చండుడు కాళికామీదికి ఉరికెను. వాని శిరస్సును ఆమె ఖడ్గముతో ఛేదించెను. చండుడు కూలుటచూచి ముండుడుకూడ ఆమెపైకి దూకెను వానిని కూడ ఆమె తన ఖడ్గముతో నేలకూల్చెను. చండ ముండుల శిరస్సులను తన చేతులతో పట్టుకొని చండికకు సమర్పించి, శుంభనిశుంభులను నీవే చంపవలసినదని చెప్పెను. అప్పుడామె కాళితో యిట్లనెను "నీవు చండ ముండుల శిరస్సులను తన చేతులతో పట్టుకొని చండికకు సమర్పించి, శుంభ నిశుంభులను నీవే చంపవలసినదని చెప్పెను. అప్పుడామె కాళితో యిట్లనెను. "నీవు చండ ముండుల నిద్దరినీ నా వద్దకు తెచ్చితివి గావున నీవు లోకమందు చాముండీ అను పేరుతో ప్రసిద్ధి చెందెదవని" దీవించెను. అందువే దేవి చండ ముండాసుర నిషూధిని (756) అందుచేత ఆమె దైత్యహంత్రీ (579) అయినది.

## శివదూతీ (405)

చండ ముండులు వధింపబడిన తర్వాత యుద్ధమునకు చండ శాసనుడైన శుంభుడు అనేక సహస్ర సంఖ్యగల మహాసైన్యముతో బయలుదేరెను. దేవికి సహాయముగ ఆయా దేవతలకు గల శక్తి యొక్క మూర్త రూపములతో వారినుండి వెలువడి దేవికి సహాయముగ వచ్చిరి. బ్రహ్మయొక్క శక్తి బ్రాహ్మి, విష్ణువు యొక్క శక్తి వైష్ణవి (892) మహేశ్వరుని శక్తి మహేశ్వరి (208) కుమారస్వామి శక్తి కౌమారీ యిచ్చి వరాహముయొక్క శక్తి వారాహి, నారసింహి, ఇంద్రశక్తి ఐంద్రీ, మున్నగువారందరూ ఆమెవద్దచేరిరి.

ఎంతోదయగల దేవి శివునితో యిట్లు చెప్పెను. "ప్రభూ నీవి శంభ నిశుంభులవద్దకు వెళ్లి, మూడు లోకములను ఇంద్రునికినీ, హవ్యభాగములు దేవతలకును యిచ్చి, వారికి బ్రతకవలయునన్న ఆశ

యున్నచో పాతాళమునకు వెళ్ళుడు" అని చెప్పవలసినదిగా రాయబారము పంపెను. దౌత్యమునకు శివునే స్వయముగా నియోగించెను గనుక అప్పటి నుండి ఆమె శివదూతిగా ప్రఖ్యాతి వహించెను.

ఆ దైత్యులు శివుని రాయబారమునకు ఒప్పుకొనక యుద్ధము చేయుటకే సిద్ధపడి, కాత్యాయని వద్దకు వచ్చిరి.

కాత్యాయని (556)

మహిషాసురుడు ఒకప్పుడు కాత్యాయన మహర్షియొక్క శిష్యుడు తపమాచరించుచుండగా, వానివద్దకు సౌందర్యవతి అయిన అప్సర రూపము దరించి వానిని మోహింపచేసెను. అతని తపస్సు పాడై పోయెను. అది తెలిసిన కాత్యాయనుడు వానిని "నీవు ఒకస్త్రీ చేతియందు మరణించెదవని" శపించెను. ఆయన కుమార్తెయే చండిక :- అందు చేత ఆమెకు కాత్యాయని పేరు కలిగెను,

ఈ దేవతా శక్తులకును, అసురసైన్యమునకు యుద్ధ మారంభ మాయెను. సప్త మాతృకలు విజృంభించి దైత్య సైన్యాన్ని నాశ మొందించిరి.

రక్తబీజుడను మహాసురుడు యుద్ధరంగమునకువచ్చెను. అతడి రక్త బిందువు భూమిపై పడిన వెంటనే అతనిఎంటివాడొకడు భూమిపై లేచుచుండెను. వాని రక్తమునుండి పుట్టిన మహాసుర సాహస్రముతో జగత్త్రంతయునిండిపోయెను.మాతృకలువారందరినిసంహరించుచుండిరి గానీ వారు మరలా అంతమందిగా తిరిగీ జన్మిస్తూనేవున్నారు. అప్పుడు దేవి చాముండతో ఇట్లు చెప్పెను. "నీవు నోటిని విస్తారముగ తెరువుము రక్తబీజుని రక్తమును, అతని నుండి పుట్టుకొని వచ్చు అసురులను

ప్రమింగివేయుము" కాళి రక్తబీజుని నెత్తుటిని తననోటితో త్రాగివైచెను వాడు రక్తహీనుడై భూమిపై కూలెను:- తర్వాత దేవి శుంభ నిశుంభు లను సంహరించి లోకములకు శాంతిని ప్రసాదించెను. జగత్తును అసుర గణములనుండి కాపాడెను. అందుచేత ఆమె దైత్యశమని (96) చతు రంగబలేశ్వరి (691) గా వాసికెక్కెను. మహిషాసుర, భండాసుర, మధు కైటభ, శుంభ నిశుంభ మున్నగువారిని నాశముచేసి, రథ, గజ, తురగ పదాదులగు నాల్గు విధములైన సైన్యములకు ఈశ్వరి:- బృహత్సేనా (679) అపార సైన్యము గలది.

సరస్వతీ : 704

సరస్వతీదేవి శుంభనిశుంభ వధలో పాల్గొనిన శక్తులలో ఒకరు. ఆమె కూడా లలితావరమే:- సరస్వతి జ్ఞాన సముద్రరూపిణి. సర్వజ్ఞాన దృష్టులను ప్రసవింప చేయునది గాన సరస్వతి :- యోగ వాసిష్ఠము, ప్రాణుల నాలుకయందు నివసించునది. ఎల్లప్పుడు వాక్కులకు హేతు వైనందున సరస్వతి అని మహర్షులు పేర్కొనుచున్నారు. పుణ్యాత్ముల ద్వయితబుద్ధిని పోగొట్టి, అద్వైతబుద్ధిని కలిగించునదిగావున సరస్వతి.

సావిత్రి : 699.

లోక సృష్టికర్త పరమ శివుడు. అతనిభార్య సావిత్రి. ప్రజలను సృష్టించువాడు కాబట్టి సవిత. అతని భార్య. భారద్వాజ స్మృతి ప్రకా రము" సవితను అనగా సూర్యుని ప్రకాశింపజేయునది గాన సావిత్రి యను పేరును పొందుచున్నది. లోకములనుపుట్టించు కారణమునచేతను ఆమె సావిత్రి యగుచున్నది. దేవీ భాగవతంలో "దేవతలచే పూజింప బడిన దేవి, వేదములచే, యోగముచే పూజింపబడినది. భావశుద్ధ స్వరూపురాలు కావున సావిత్రి.

సతీ (820) దాక్షయణి (598) దక్షయజ్ఞ వినాశినీ 600) పాతి వ్రత్యమే వ్రతము గలిగినది. సతి. ఆమె దక్షుని కుమార్తె - దక్ష యజ్ఞ వినాశనానికి కారకురాలు.

దక్షుడు యజ్ఞాన్ని చేయ సంకల్పించి అల్లునల్లయిన దేవతలంద రినీ ఆహ్వానించాడు. కానీ శివ సతీదేవులను పిలవలేడు. పిలవకపోయినా తన పుట్టినిల్లేకదా అని శివుడు వారించినా వినకుండా సతీదేవి యజ్ఞానికి వెళ్లినది. అక్కడ ఎవరూ పలకరించలేడు. దక్షుడు పిలవని పేరంట ముగా ఎందుకు వచ్చావు?'' అని తూలభాడుటయే గాక శంకరుని సైతం దుర్భాషలాడినాడు. సతీదేవి యోగాగ్నితో అక్కడికక్కడే శరీ రాన్ని పరిత్యజించినది. సతీదేవి శరీర త్యాగాన్ని తెలుసుకొనిన రుద్రుడు తన జడను ఒకదానిని పెరికి నేలపై బాదెను. అందుండి వీరభద్రు డుద్భవించెను. అతడు పోయి యజ్ఞవాటికను ధ్వంసము చేసెను అచ్చట నున్నవారి నందరినీ భయభ్రాంతులచేపి, చిత్ర హింసలు పెట్టెను. యజ్ఞము ధ్వంసమాయెను. ఫలాపేక్షతో చేయు యజ్ఞ ములు యితరులను అవమానించుటకు చేయు కర్మలు ఈ విధంగా విధ్వంసమవుతాయి. ఈ అవతారము వలన, దేవి, దురహంకార పూరితు లగు వారు దేవతలైనా, శిక్షింపబడవలయునని ఆత్మత్యాగము ద్వారా నిరూపించినది.

(246) పార్వతీ-ఉమా (633), అపర్ణా (754), గుహాంబా (706) గుహజన్మభూః (606): సర్వమంగళా (200) శైలేంద్రతనయా (634) ధరసుతా : పర్వతుని పుత్రిక : (956)

సతీదేవి శరీర త్యాగము చేసిన తర్వాత పర్వతరాజైన హిమ వంతునికి మేన అను ఆమె గర్భమందు జన్మించినది. ఆమె గౌరి

అనియు, పార్వతి అనియు పిలువబడుచుండెను. ఆమె సర్వ లక్షణ

ఆమె సర్వమంగళ:- సర్వమంగళములుకలది. "సర్వాణి హృదయస్థాని మంగళాని శుభానిచ ఈప్సితాని దదాతీతి తేనసా సర్వమంగళా, శోభ నానిచ శ్రేష్ఠానియాదేవీ దదతేహరే, భక్త నామార్తి హారిణీ తేనేయం సర్వమంగళా" హృదయమందుగల సకల శుభములు నొసగునదియగుటచే నామె సర్వమంగళ భక్తుల దుఃఖములను హరించి వారికి శ్రేష్ఠమైన సకల శుభముల నిచ్చుటచే ఆమె సర్వమంగళ."

ఆమె శివుని గూర్చి తపముచేయ ప్రారంభించినది తల్లి మేనక "మాట" వద్దు వద్దు అని యెంతో వారించినది - అప్పటి నుంచి ఆమె ఉమగా పిలువబడుచున్నది. ఆ తపస్సు చేయునపుడు ఆకులను కూడా తినక, నిరాహారియై తపమాచరించెను. అందుచేత ఆమె అపర్ణ,

శివుడు కూడా ఆమెయే పత్నికావలయునని తపమాచరించు చుండెను. మన్మథుడా తపోభంగము గావించి భస్మమైపోయెను.

దేవతలందరూ శివ పార్వతులకు వివాహము గావించిరి లోక కంటకుడయిన తారకాసురుని సంహరించుటకు ఒకమహావీరుడు జన్మించవలయును. వాడు పార్వతికి పుట్టిన కొమరుని చేతనే మరణము కలుగవలయునని వరము పొంది యున్నాడు. అది సాధ్యముకాదని ఆ అసురుని విశ్వాసము.

షణ్ముఖుడు ప్రభవించెను. వానిని కృత్తికలు కాపాడిరి. తుదకు గుహుడు పార్వతీ పరమేశ్వరులచే పుత్రుడుగా స్వీకరింపబడి, దేవా సెనానియై తారకాసురుని సంహరించెను. అందుచే ఆమె గుహాంబా గుహజన్మభూః అని కీర్తింపబడుచున్నది.

## మహాలక్ష్మి (210)

మహాలక్ష్మికూడ దేవి అంశమే; మహాబలుడను రాక్షసుని చంపినది కొల్హాపురమందు వెలసిన దేవి. "సర్వభూత శరీరేభ్యోయావిర్భూతామిత ప్రభా త్రిగుణాసామహాలక్ష్మి సాన్మహిషమర్దనీ'' ఏ దేవి సర్వభూతముల నుండి మిక్కిలి ప్రభతో నావిర్భవించినదో ఆమె త్రిగుణయైన మహాలక్ష్మి, ఆమెసాక్షాత్తుగ మహిషాసురుని వధించినది. (వైష్ణవీ-892) విష్ణురూపిణీ 893 విష్ణువునకు సంబంధించినది. బ్రహ్మాండ పురాణంలో విష్ణువాక్యము, ఆద్యాశక్తిర్మహేశస్యచతుర్ధాభిన్న విగ్రహా,భొగేభవానీరూపా, సాదుర్గారూపాచ సంగరా, కోపేచ కాళికారూపా, పుంరూపాచ మదాత్మికా" మహేశ్వరునియొక్క ఆదిశక్తి నాలుగురూపములు కలది. ఆమె భోగమునందు భవానీ, యుద్ధమందు దుర్గ, కోపమందు కాళిక పురుష రూపమందు నా ఆత్మ, రూపములుగలది. ఆమెఅవరదా (639) అవరులు అనగా రాక్షసులు, వారిని ద్యుతి చంపునది: ఆమె దైత్య వినాశిని:-

## ఉమా: (633) జ్ఞానదా (643)

దేవతలకు రాక్షసులకు ఒకప్పుడు ఘోరయుద్ధము జరుగు చుండెను. ఆకాశమందు పార్వతీ పరమేశ్వరులు వృషభారూఢులై త్రిలోక సంచారమునకై పోవుచుండిరి. ఈశ్వరుడు కండ్లు మూసుకొని యోగ మందుండెను. దేవతల ధాటికి అసురులు పలాయనము గావించు చుండిరి. దేవి పరమేశ్వరుని మేల్కొలిపి "రాక్షసుల అవస్థలుచూడండి" అని చెప్పినది స్వామి అవంకకొకసారిచూచికళ్ళుమూసుకొనెను రాక్షసులు పలాయనము మాని యెక్కడలేని ధైర్య సాహసములతో దేవతలను యెదుర్కొనిరి. దిక్కులు తెలియక దేవతలు పరుగిడసాగిరి. తిరిగి దేవి స్వామిని మేల్కొలిపి "ఈవింత చూడండి దేవతలు ఎలా ప్రాణభీతితో

పరుగెత్తుచున్నారో" అని చూపించి. స్వామి ఆ దేవతల వంకచూచి కళ్లు మ్రూసుకొన్నాడు. వెంటనే రాక్షసుల పై యెదురుదాడి సాగించి వారిని ఓడించిరి. పార్వతీ పరమేశ్వరులు తమదారిన వారు పోయిరి. కానీ దేవతలలోనే ఆ విజయమునకు కారణము నేనంటే నేనని అంతఃకలహము చెలరేగినది. విష్ణువు తన చక్రము వల్ల ననియు, బ్రహ్మ తన బ్రహ్మాస్త్రముచే ననియు, ఇంద్రుడు తన వజ్రాయుధము వల్లనే అనియు అగ్ని, వాయువు అందరు తమలో తాము వాదులాడుకొని, సర్వలోకాధిపత్యమునకై కుమ్ములాడుకొనసాగిరి. అపుడు వారిముందు ఒక యక్షుడు సాక్షాత్కరించెను. ఆ యక్షుడెవరో తెలుసుకొని రమ్మని ఇంద్రుడు అగ్నిని పంపెను. యక్షుడు అగ్నిని నీవెవడివని అడిగెను. తాను మహా బలవంతుడయిన అగ్నిననియు, తాను లోకములన్నింటిని దహించి వేయగలవనియు చెప్పెను. యక్షుడు వాని ముందు ఒక గడ్డిపోచను వేసి దీనిని కాల్చుమనెను. ఎంత ప్రయత్నించినా అగ్ని దానిని కాల్చలేక సిగ్గుతో ఇంద్రుని వద్దకు వచ్చి జరిగిన విషయమును తెలిపెను. తర్వాత వాయుదేవుని పంపెను. వాయువు కూడా దాని కదిలించలేక పోయెను. పిమ్మట ఇంద్రుడే స్వయముగా బయలుదేరెను. కానీయక్షుడు అంతర్ధానమాయెను. అక్కడ ఉమ వానికి ప్రత్యక్షమాయెను. "తస్మిన్నాకాశేస్త్రియమాజగామ, బహుశోభానామ్ ఉమాం, హైమవతీం, తాంహోవాచ. కిమేతద్యక్షమితి: బ్రహ్మేతిహోవాచ" - ఆకాశమందు మిక్కిలి ప్రకాశించు హిమవంతుని పుత్రిక అయిన ఉమను ఇంద్రుడు ఆ యక్షుడెవడని ప్రశ్నించెను. ఆమె పరబ్రహ్మమే యక్షుడని జవాబిచ్చెను: అతని సంకల్పబలము లేనిదే గడ్డిపోచయును కదలదు. అపుడు ఇంద్రునికి జ్ఞానోపదేశమును చేసినది ఉమయే. (కేనోపనిషత్తు):— ఆమె యందలి భక్తిచే మోక్షమును పొందుచున్నారు. "విద్యారూపా

ఉమా శివా వేదవిద్యా, సత్యానందానంత, సంవిత్స్వరూపా, సర్వలోకైక మాతుః భక్త్యయుపస్యాదంబికాయాః ప్రసాదాత్ విద్యారూపిణియయిన పార్వతియే వేద విద్య, సత్యం, జ్ఞానం, అనంతం ల రూపిణి సర్వ లోకములకేకైకమాత యగు అంబికయొక్క అనుగ్రహము భక్తిచే ఆ వాక్కులు కలుగును. జ్ఞానము అనగా సంసారబంధములను ఖండించునది. జ్ఞానమనగా బంధమనికూడా అర్థమున్నది. బంధ జ్ఞానమును పోగొట్టి పరమాత్మ జ్ఞానమొసగును.

(1) ఉ అనగా శివుడు, మా అనగా లక్ష్మి - శివుని భార్య. (2) ఉమ - అతసీపుష్పము-గౌరి, హరిద్రా, కీర్తి, కాంతులని నానార్థములు యివన్నియుకలది ఉమ:- (3) సూత సంహితలో "వరానుభూతిం భవపాపనాశనీం,సదాశివస్యాప్యతి శోభనాఢ్యాం, ఉమాభిధాం ఉత్తమచిత్తవృత్తిం నానావిధ లోకవైభవామ్"- వరానుభూతియు, సంసారపాశముల తొలగించినదియు, సదాశివునికంటె మించిన శోభన సంపదగల ఉమ అను పేరుగల అనేకవిధ లోకవైభవముగల ఉత్తమ చిత్తవృత్తిని మ్రొక్కెదను. అటువంటిది-ఉమ. (4) విష్ణు, శివ, బ్రహ్మవాచకములైన అకార ఉకార మకారములతో గూడిన త్రిమూర్త్యాత్మకమైన ప్రణవస్వరూపిణి. అని లింగపురాణం. (5) ఓంకార సార శక్తిగలదగుటచే ఉమ అని కీర్తింపబడుచున్నది. (6) ఇచ్ఛాశక్తి రుమా కుమారీ". ఇచ్ఛాశక్తియే ఉమాకుమారి:- (ఈ అవతార ప్రయోజనము ముముక్షువులకు జ్ఞానదానము చేయుట. ముకుందా:

(838) ముక్తి నొసగునది విష్ణురూపిణి:- తంత్ర రాజమందు గోపాల మంత్ర భేదారంభమున "కదాచిద్యా లలితా పుంరూపా కృష్ణ విగ్రహా స్వవంశనాదనారంభాత్ అకరోద్వివశంజగత్"- ఒకానొకప్పుడు లలితా దేవి పురుషరూపమున కృష్ణరూపమెత్తి తన పిల్లన గ్రోవిని మ్రోగించి

జగత్తును వివశమొనర్చెను. గోపికలందరూ ఆమె శక్తులే. వారితో పరి వేష్ఠింపబడిన వాడాయెను. అపుడు తనకు తానై పదునారుభాగముల నొనర్చుకొనెను. పుండరీకాక్షుడైన శ్రీకృష్ణుడుకూడా లలితాదేవి అవ తారమే. ద్వాపర యుగాంతమున ప్రబలిన దుష్టులను శిక్షించి, శిష్టు లను రక్షించెను ఆమె రాక్షసఘ్ని - (318) ధేనుకాసుర, బకాసుర) కంస, తృణావర్త, పూతనాది రాక్షసులను శ్రీకృష్ణరూపమున సంహ రించినది.

మోహినీ (562)

క్షీరసాగర మథనకాలమున అమృతమును దేవదానవులకు పంచు టకై దేవి విష్ణురూపధారియై, మోహినీ అవతారమెత్తెను. ఆమె జగ న్మోహనాకారమును చూచి అసురులు వివశులై కూర్చొన్నారు. దేవి అమృతమును దేవతలకు మాత్రము పంచియిచ్చి అదృశ్యురాలాయెను అందరినీ మోహింపజేయగల శక్తిగలది. ధ్యాన సంపదచే మాత్రము పొందదగిన రూపము గలది. అద్భుతమైన ఆరూపమును గాంచి శివుడు గూడా చలించిపొయ్యాడు.

మహాదేవి : (209) గొప్పది. ఏ కొలతలకు అందనిది. మహపూజ గొప్పది: మహాదేవుడు సకల సౌమ్య వస్తువులకు ప్రతీక అయినదేవుడు శివుని అష్టమ శరీరము చంద్రుడు. చంద్రాత్మక శివుని భార్య రోహిణి అటువంటి మహాదేవుని భార్య....శివ భక్తులకు నామ, రూప, గుణ, అధి ష్ఠానాది సౌమ్యములు కలవని, వారిరువురికి భేదములేదని వాగ్దేవతలు చెప్పుచున్నారు.

శివా (53) శ్రీశివా (978) శివమూర్తిః (407) శివప్రియా (409 శివారాధ్యా (406) శివశంకరీ (408) శివపరా (480)

శివా అనునామమును లోగతఃవివరించి యున్నాము: శ్రీ శివా అను నామము శ్రీ చక్రము వర్ణించుటలో చెప్పగలము. శివమూర్తిః (407) శివుడే స్వరూపముగాగలది.

శివశంకరి (408) ఆమెను ఆరాధించు భక్తుని శివునిగనేచేయును మంగళములను చేకూర్చును. అంతియకాదు ఆమె శివవరా (410) ఆమె స్వాధీనవల్లభ (54) అయినందువల్ల శివుడు శక్తికి అధీనమైనవాడు. శివుడు వరుడుగాగలది. భక్తులకు శివస్వరూపమును తెలుపునది.

ఆమె శాంభవి (122) ఆమె శంభుని భార్య (2) యోగశాస్త్రమందు శాంభవీ ముద్రగా పేర్కొనబడినది. దీక్షలు మూడు విధములు: శక్తి, శాంభవి, మాంత్రి: అందులో శాంభవీ దీక్షా స్వరూపిణీ:- శర్వాణీ (124) శర్వుడు అష్టమూర్తులలో భూరూపముగల శివుడు. ఆ శర్వుని భార్య సుకేశిని. వారి కుమారుడు అంగారకుడు. (లింగపురాణం) శాంకరీ: (126) సుఖమును కలిగించువాడు శంకరుడు. శంకరుని భార్య, శ్రీకంఠార్ధ శరీరిణీ: (391) శ్రీ అనగా విషము, దానిని కంఠము నందు కలవాడుశివుడు. ఆయనను తన అర్ధ శరీరమందుంచుకొన్నది. "ఆత్మైవేదమగ్రఆసీత్....స ఇమమే వాత్మానం ద్వేధా అపాయత్తతః పతిశ్చ పత్నీ చాభవతా" మొదట ఈ ఆత్మయే యుండెను. ఆ ఆత్మయే రెండయినది. ఆ రెండు భార్యా-భర్తలైరి:- వాగుద్భూతా పరాశక్తిర్యా చిద్రూపా పరాభిధా, వందేతామనిశం భక్త్యా శ్రీకంఠార్ధ శరీరిణీ. పరా శక్తి చిద్రూపిణి వాక్కుగా జన్మించినది, అదియే పరావాక్కు. అట్టి శ్రీకంఠార్ధ శరీరిణియైన దేవిని మ్రొక్కెదను.

సదాశివ పతివ్రతా:- (709) దేవి నిజముగ సర్వోపాధివినిర్ముక్తా (708) ఆమెకు ఎటువంటి ఉపాధులులేవు. శక్తికిని శివునికిని ఎటువంటి

భేదములేదు. శివుడు శాశ్వతుడు. మూడు కాలములచే భూత భవిష్య ర్తమానములచే బాధింపబడడు.ఎల్లప్పుడు అటువంటి శివుని పతిగా గలది. అ పత్నీత్వ ధర్మము కూడా శాశ్వతమైనది. ఇతర పదార్థము లన్నియు కల్పితములు. వాటి యందు ధర్మత్వముకూడా కల్పితమే. (దృశ్యమానమైనదంతయు కల్పితమే. శక్తి కల్పితముకాదు. అందు వలననే దేవి బ్రహ్మకోటి యగుచున్నది. సదాశివుని పతివ్రత. ఆమెయే బ్రహ్మము. ఆమె బ్రహ్మమునకు సంబంధించినది. దేవికిగల పరాహం తృత్వము తప్ప ఇతర ధర్మములు కల్పితములేగాని, దేవి కల్పితము గాదు. ఆమెయే నిరుపాధికమైన బ్రహ్మము - ఆమె సంప్రదాయేశ్వరీ: (710) ధర్మ ధర్మలకు భేదములేదు కావున ఇచట శక్తులు, ధర్మి, ధర్మ ధర్మలు కాన, వారిరువురు ఒకటియే అని సంప్రదాయము ద్వారా తెలుసుకోవలయును. అందుచేత దేవి సంప్రదాయేశ్వరి. సాధు (సేనమః) (711) (అగ్నికి దాహకశక్తి ఎట్లో అట్లె పరాహంత శక్తి ధర్మము అని చెప్పుట) తగియున్నది. [సాధు=ఉచితము (తగినది) గురుమండల రూపిణీ: (713) పరమశివుని మొదలు తన గురువు వరకుండువారియొక్క పరంపర అంతయు ఆమెయే. వారివలననే శివ శక్తి ఏకత్వమును తెలుసుకోవలయును. "కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తం అవనితల భూమండలమందు ఒకరినుండి ఒకరికి ఈ రహస్యము వినికిడివల్ల సంప్రాప్తమైనది, గురుప్రియా (722) గురువునందామెకు ప్రీతిమెండు. జగద్గురువైన శివుడే ఆమె. గురుడే ప్రియుడు గాగలది:- గురుమూర్తిః (603 గురువే ఆకారముగా గలది,

ఆ గురుమూర్తియే దేవి:- ఆమె దక్షిణామూర్తి రూపిణీ (725) దక్షిణాభిముఖుడై అద్వయిత తత్వమును మౌనసముద్రముతో మహర్షులకు జ్ఞానబోధచేసిన శివస్వరూపముగలది. శివుడు జగద్గురువు. ఆయనే

ఈమె.:- సనకాది సమారాధ్యా: (726) ఆమెను సనక, సనందనాది మహర్షులు బాగాగా ఆరాధించిరి. వారు దక్షిణామూర్తిచే అద్వయిత జ్ఞానమును పొంది శివశక్త్యైక్య జ్ఞానమును పొందిది గురుపరంపరలో లెక్కింపబడిరి. "త్వామేవహి విచిన్వంతి యోగినస్సనకాదయః" సనకాది యోగులు నిన్నే వెదుకుచున్నారు. (బ్రహ్మాం. పురా):- శివ జ్ఞాన ప్రదాయినీ (707) ఆమె శివ సంబంధమైన జ్ఞానమును బాగుగ ప్రసాదించును. శివుడే దేవికి జ్ఞానమిచ్చుచున్నాడు. ఆ జ్ఞానమును దేవి భక్తులకు ఇచ్చును. స్పందశక్తిచే శివుడెరుగబడుచున్నాడు. గాన అట్టి శక్తిని దేవియే ప్రసాదించును. సదాశివ కుటుంబినీ (911) సదా శివునకు భార్య శ్యామల - శుద్ధవిద్య: అశ్వారూఢాది రూపముగలది:— ఆమె త్రినయనా (453) ఆమె యొక్క మూడు నేత్రములు సూర్య చంద్రాగ్నులు.

సర్వేశ్వరీ (202) సకలమునకు ఈశ్వరి. భవానీ (112) భవుడు మహాదేవుడు. సంసారము, కామము వీనిని (అనయతి) పొందించును కావున భవానీ త్ర్యంబకా (762) సూర్యచంద్రాగ్నులు త్రినేత్రములుగా గలది. బ్రహ్మ విష్ణులకు తల్లి అని కూడా చెప్పవచ్చును. భైరవి (276) భైరవుడు పరమశివుడు. ఆయన భార్య భైరవి. భీరురాంద్రయిన స్త్రీల సమూహమే భైరవి. స్త్రీలందరూ గౌరియొక్క విభూతులే. (3) భైరవీ మంత్రస్వరూపిణి - మహాభైరవ పూజితా (231) పరమ శివునిచే పూజింపబడును.

మృడానీ (564) మృడప్రియా (211): ఈ రెండు నామములు ఒకేభావమును సూచించును మృడుడనగా జనులందరికీ సుఖము కలిగించువాడు, ఆయన భార్య, ఆయనకు ప్రియురాలు:- మహేశ్వరీ: చాలగొప్ప ఈశ్వరి (750) 208వ నామము మహేశ్వరి. ఇందుపునరు

లేదు. రాజరాజేశ్వరి దేవతలకు, రాజులకు రాజులు బ్రహ్మవిష్ణురుద్రులు వారికికూడ ఈశ్వరి (684) రాజ్యదాయినీ (685) స్వర్గము, వైకుంఠము కైలాసములకు అధిపత్యమునుకూడా యిచ్చునట్టిది రాజ్యవల్లభా (686) పైచెప్పబడిన రాజ్యములు ప్రియముగాగలది. రాజ్యశబ్దముచే రాజ్యాధిపతులు చెప్పబడుచున్నారు.

రాజత్కృపా: (687) రాజత్-ప్రకాశించునట్టి, కృపా-దయగలది రాజపీఠ నివేశిత నిజాశ్రితా (688) తన భక్తులను రాజ పీఠము లందు అధిష్ఠింపజేయును ఇంద్రుని మొదలు సామాన్య రాజులవరకు ఆమెను ఆశ్రయించి రాజ్యాధిపతులు కాగరు రాజ్యలక్ష్మీ (689) రాజ్యాభిమాభిమానముగల లక్ష్మి, కోశనాథా (690) దివ్య భాండాగారములకు యజమానురాలు. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములకు స్వామిని. మహేశ్వర మహాకల్ప మహాతాండవసాక్షిణి 232 ప్రళయకాలమున సర్వమును నశించిపోగా శివశక్తులు మాత్రము యుందురు. అపుడు వారిద్దరూ ఆనందముతో నాట్యమొనర్తురు. ఆ నృత్యమునకు ఆమెయే సాక్షి.

మహాకామేశమహిషీ:- (233) మహాకామేశుడు పరమశివుడు. ఆ ప్రభువునకు పట్టపురాణి విడరాని జంట. మహా త్రిపురసుందరీ (234) త్రిపుట అను నగరముల తాదాత్మ్యత నందిన సుందరి. మహాకామేశ నయన కుముదాహ్లాద కౌముదీ: (403) మహాకామేశుని కన్నులనెడి కలువలను వికసింపజేయు వెన్నెల. (కుముదములు అనగా ప్రాపంచిక సుఖదుఃఖములు. ఆమె ఇటువంటి వాటిచే బాధపడుచున్న క్షపణులకు ఎల్లప్పుడూ మోక్షమునిచ్చును. శివునికడకు భక్తులను చేర్చునట్టిదేవి! దేవేశీ : (607) దేవతలకు ఈశ్వరి:- గంధర్వసేవితా (636) ఆమెను విశ్వావసు మొదలగు గంధర్వులు సేవించెదరు, (2) అశ్వములుకూడా

ఆమె సేవయందుండును. ఆమె అశ్వారూఢః (1) ఆమెను దివ్య గానములచే సేవించినయెడల ఆమె ప్రసన్నురాలగును. గణాంబా (619) ప్రమధాది గణములకు గణపతికి కూడ తల్లి. గుహ్యకారాధ్యా (620) గుహ్యకులు అనువారు దేవతలలో నొకజాతికి చెందినవారు. వారామెను ఆరాధించెదరు. (2) అజ్ఞాత రహస్య స్థలములందు ఆమెను పూజింపవలయును, నటేశ్వరీ (734) నటరాజైన పరమేశ్వరుని యెల్లప్పుడు అనుకరించుచుండును. సుభగా (761) భగమనగా:- శ్రీ, కామ్య, మాహాత్మ్య, వీర్య, యత్న, కీర్తులు మహతీ (774) మహత్తయిన పరిమాణము కలది. దీనిచే అన్నివస్తువులు కొలవబడుచున్నదో అది మహత్:— మేరునిలయా (775) మేరుపర్వతమే వాసస్థానముగా గలది.

మార్తాండ భైరవారాధ్యా: (785) శ్రీనగరమందు 22, 32, ప్రాకారముల మధ్య భూమియందు మార్తాండ భైరవుడు పూజించుచుండును ఉత్తమ యత్నమే భైరవుడు, అతడే సూర్యుడు. మోహాంధకారమును పోగొట్టువాడు. మంత్రిణీ న్యస్తరాజ్యధూః (7 6):- లలితాదేవి రాజ్య పాలన శక్తుల రక్షణను, ఆ రాజ్యమును తన మంత్రిణి అయిన శ్యామలాంబ యందుంచెను. (నిర్మల చిత్తమే మంత్రమే - పరిశుద్ధ మనస్కులైన సాధకులను ఈ మంత్రిలు దేవితో ఐక్యము పొందించెదరు ఆమెయందుంచబడిన స్వసామ్రాజ్యరూపమైన ఐశ్వర్యమును పుట్టించు ధర్మముగలది. స్వస్వరూపమును అనగా తనకూ, ఆత్మకూ భేదము లేదని చింతించుటే మంత్రము. దేవీమంత్రము మననము చేయువారిని రక్షించును. దేవితో ఐక్యమును కలిగించు శక్తి ఆ మంత్రిలందే కలదు. ఆమె జయిత్సేనా 788. ఆమె సైన్యమున కెల్లప్పుడు విజయమే. భండాసురాదుల సైన్యమును ఓడించగలశక్తి ఆమె సైన్యమునకు కలదు. కపర్దినీ 793. కపర్ది అను పేరు గల

శివుని అర్ధాంగి:- మహేశీ 932. మంగళాకృతిః 933 మహేశుని భార్య, మంగళకరమైన ఆకృతి కలిగినది.

ఇకపై దేవియొక్క దివ్య సౌందర్యమును వర్ణించుచున్నారు. ఆమె మహాకైలాసనిలయా: (578) కైలాసమునకంటె వేరైనలోకము మహాకైలాసము. అది పరమ శివుని నివాసస్థానము. (శ్రీచక్రమందలి బిందుస్థానము. బ్రహ్మరంధ్రమునగల సహస్రారమే మహాకైలాసము అందామె ఎల్లప్పుడు ఉండును. మలయాచలవాసినీ (458) మలయాచలమందు వసించును. (మలయాళదేశమున గల కోబర చింతామణి యందు భగవతిగా వెలసియుండును.) ఆమె ప్రభావతి: (393) ప్రభారూపా (394) కాంతిః 449 తేజోవతి 452 కాంతిమతి 465 చారురూపా 242 ప్రకాశ రూపిణి ప్రభారూపములైన అణిమాది దేవతలే స్వరూపముగా గలది. కాంతి అనినను తేజస్సు. కాంతిమతి అనినను తేజస్సు కలది.-చారురూపమనగా అందమైనరూపము గలది:- మహారూపా 212 గొప్పరూపము కలది, మహాపూజ్యా 213 గొప్పగ పూజింప దగినది శివుడు, విష్ణువు బ్రహ్మ, కుబేర, విశ్వదేవ వాయు, వసు, వరుణ, అగ్ని ఇంద్ర, సూర్య, సోమ, గ్రహ, రాక్షస, పిశాచ, మాతృ గణాదులచే పూజింప బడును. వీరందరూ ఆయా లోహాదులచే దేవీరూపముల నేర్పరుచుకొని దేవిని పూజించెదరు. పద్మరాగ సమప్రభా 248, దాడి మీకుసమప్రభా 560 జపాపుష్పనిభాకృతిః 766 విద్రుమాభా 891 తరుణాదిత్యపాటలా 922 బందూక కుసుమ ప్రఖ్యా 964—

భండాసుర సంహారార్థము దేవి అవతరించినప్పుడు ఆమెస్వరూపమును కేశాది పాద నఖపర్యంతము వర్ణించిరి. ఇప్పుడు మరోవిధముగ వర్ణించుచున్నారు.

ఆమె ముఖము:- శరశ్చంద్రనిభాననా (129) రాకేందువదనా (314) సుముఖీ: (459) చారుహాసా (242) దరహాసోజ్జ్వలముఖీ:— (602) సింధూర తిలకాంచితా 632, శరదృతువు నందలి చంద్రునితో సాటియైన మోముగలది. భక్తులకామె మోము శరచ్చంద్రుని వలె ఆహ్లాదము కలిగించును. పూర్ణ చంద్రబింబము వంటిది. శోభనమైన దావదనము: జ్ఞానముచే ముఖకాంతి అధికముగా ప్రకాశించును-శ్రుతి: "శోభతేస్యముఖం య ఏవం వేద" "ఆమె ముఖము ప్రకాశించు చున్న దని ఎవడెరుగునో" (వాడు మోక్షమునకు పోవును) ఆమె నగవు చాలా అందమైనది (గురుబోధచే దేవీ మంత్రమును తెలుసుకొని స్మరించిన పరమానందము గలుగునో ఆ చిరునగవుచే ముఖము ప్రకాశించుచున్నది సింధూరమనగా: గోరోచనము, రక్తము, చూర్ణము, ధాతుకిక, ప్రెరని బొట్టుంది. ఆమె నొసట - తిలకము, అలకలు, ముంగురులు, సిందూరము అలకలతో ఆమె ముఖము ఒప్పుచున్నది. సిందూరతిలకా - అడ ఏనుగు-వలె మత్తేభయాన, గోపికలు, రుక్మిణి మున్నగు స్త్రీ లందరిచే సేవింపబడినది., శోభనా: (462) అమిత సౌందర్యవతి, చారుచంద్ర కళాధరా (243) వృద్ధి క్షయరహితమైన "సాద" చంద్రికలను ధరించి నది, బర్బరాలకా:- (547) బర్బర: వంపులు తిరిగిన పొట్టి వెంట్రుకలు గలది: (అనీలస్నిగ్ధ బర్బర కచానాం) అని లలితా స్తవరత్నం వర్ణిస్తుంది: బంధుర + అలక = ఉన్నతమైన అలలుగానున్న కచము కలది: తాంబూలపూరితముఖీ: (559) తాంబూల చర్వణము నందు ప్రీతి గలది - దరస్మేరముఖాంబుజా (924) కొంచెము చిరునవ్వుతో కూడినదాముఖము: భయకాలమందు కూడ నవ్వుచునే యుండును. భక్తుల నాదరించుటలో ప్రసన్నమైన ముఖపద్మము కలది: దర: అనగా శంఖము స్మేర: ప్రకాశము:- శంఖము వంటి కంఠము కలది అనియును అర్థము చెప్పవచ్చును.

దేవి నేత్రసౌందర్యము:- పద్మనయనా:- (247) పద్మములవలె విశాలమైన కన్నులు, మృగాక్షి: (561) జింకకన్నులవంటివి., రాజీవ లోచనా:- (308) రాజీవమనగా పద్మము, జింక, చేప అని నానార్థములు ఆమె పద్మాక్షి, హరిణాక్షి, మీనాక్షి రాజీవుడనగా రాజాశ్రయుడు రాజోపజీవులను అనుగ్రహముతో చూచునది. వామనయనా (332) ఆమె చూపులు చాలా సుందరమైనవి. వామ అనగా అకర్మము వలన పుట్టుఫలము, "సంయద్వామా" (ఛాందో-ఉప) కర్మలనొనర్చక పోవుటచే వామఫలము కలుగును. దానిని ఆమె కన్నులు పొందించును. కటాక్ష కింకరీ భూత కమలా కోటి సేవితా (590) ఆమె చూపులమాత్రము చేతనే కోటి లక్ష్ములు ఆమెను సేవించుటకు వచ్చెదరు. దేవియొక్క కరుణాకటాక్షము ఎవనియందు ఈషన్మాత్రము ప్రసరించునో అట్టివానికి పరార్థముల తరబడి లక్ష్ములు వరింతురు. "సచామర రమావాణీ సవ్య దక్షిణ సేవితా (814) లక్ష్మీ సరస్వతులు వింజామరలతో ఆమెకు యిరు వైపులా సేవించెదరు. చతుష్షష్ట్యుపచారాఢ్యా (235) అరువదినాల్గు ఉపచారములతో ఆమెను పూజించెదరు. మహాచతుష్షష్టికోటి యోగినీ గణ సేవితా (237) బ్రాహ్మీ మహేశ్వరీ, కౌమారీ వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ చాముండా, అది అనువారు ఎనిమిది శక్తులు, వాలొక్కరికి అక్షోభ్యాది శక్తులు, కలరు. $8 \times 8 = 64$ యోగినులున్నారు. వారిఅంశలు గలశక్తులు కోటి సంఖ్యల గుంపులుగలవు. అరువదినాలుకోట్ల యోగినీ గణములచే గొప్పగా సేవింపబడుతూంటుంది, లోపాముద్రార్చితా (647) వీరందరూ ఒక ఎత్తు. అగస్త్యుని భార్య అయిన లోపాముద్ర ఒకఎత్తు. ఆమె ఎల్లప్పుడూ దేవిని అర్చించుచుండును. రంభాదివందితా:- (741) అప్సరాంగనలయిన రంభ, ఉర్వశి, మేనక మున్నగువారు ఆమెను

నమస్కరించుచుండెదరు:- కనత్కనకతాటంకా (864) ఆమె కర్ణాభరణములు బంగారుతో చేయబడి మిక్కిలిగా ప్రకాశించుచుండును.

ఆమె తలోదరి (847) హస్తముపలె ఆమె ఉదరము కృశించి యుండును, బానవంటి కడుపు కాదు. తనుమధ్యా (360) సన్నని నడుము గలది. - నళినీ (460) ఆమె కరములు, చరణములు, నేత్రములు, ముఖము మొదలగు అవయవములన్నియు పద్మములవంటివే ఆమె పద్మాసనా : (278) సృష్టికర్త అయిన బ్రహ్మ పద్మాసనుడు దేవియే ఆ రూపమున నుండును. అ పద్మమునకు ప్రకృతి యే పత్రములు. పుష్కరేక్షణా : (805) పుష్కరములనగా తామరలు: ఆమె కన్నులు కమలముల వంటివి. జ్ఞానమయ నాళములు కేసరములు ఇట్టి పద్మము ఆమె ఆసనము:- ఆమె రాణి : (306) రాజ రాజేశ్వరుని పట్టపు రాణి.: రమ్యా (307) అమిత సౌందర్యవతి, రంజనీ, (309) ఆమె అందము అందరినీ రంజింపజేయును. స్ఫటికమువద్ద దాసాని పువ్వునుంచినచో దానికి ఎరుపురంగు వచ్చునట్లు కనబడును. ఆవిధముగా శివునికూడా రంజింపచేయును. రమణి (310) భక్తులనురమింపజేయున. జక్షన్, క్రీడన్, రమమాణ - నవ్వుచూ: ఆడుచూ, రమించును రస్యా (311) రసించుటకు, ఆస్వాదించుటకు యోగ్యురాలు. అందమునకే సారభూతము, "రసోవైసః" బ్రహ్మము రసమే: (శృతి) - రతిరూపా- (3.5) రతీదేవివంటి రూపముగలది. రతిప్రియా (316) రతీదేవియందు ప్రీతికలిగి మన్మథుని బ్రతికింపజేసినది. రతి అనగా భోగము. భోగమందు ప్రీతికలది. రామా (319) స్త్రీమాతృస్వరూపముకలది. యోగులు తామెయందు రమింతురు.

సాగరమేఖలా:- (694) భూమండలము ఆమె స్వరూపము - భూమికి సాగరము మొలనూలు వంటిది. రణత్కింకిణి మేఖలా :- (312)

ఆ మొల నూలుకు చిరుగంటలు గలవు. అవి శ్రవణానందముగ మ్రోగు చున్నవి. మంత్రములే ఆ చిరుగంటలు - కామ్యా (321) ముముక్షువు లచే ఎల్లప్పుడు కోరబడు రూపము గలది. కల్యాణీ (324) మంగళ స్వ రూపిణి (2) కల్యాః శుభమైన వాక్కులు, అణతి : శబ్దించునది - కాంతా (339) కమనీయురాలు - మిక్కిలి చక్కనిది, కం - బ్రహ్మము అంత, సిద్ధాంతముగలది:-దేవియొక్క చివరిరూపము పరబ్రహ్మస్వరూపము: వామకేశీ (351) అందమైన కేశములు గలది, హృద్యా (303) మనోజ్ఞ మైన రూపముగలది. (2) మునుల హృదయ మందు వసించునది., లోలాక్షికామరూపిణి (454) స్త్రీల కామమునునెరవేర్చు మన్మథరూపము గలది. ఆమె యోగేశ్వరి : ఆ రూపము కలది. సుభ్రూః (461) మంగళ ప్రమైన కనుబొమలు కలది. కాలకంఠి (464) నల్లనికంఠము గలది, తారకాసురుని చంపుటకై శివుడు, కాలకంఠిని, కాళిని, కపర్దినిని సృజిం చెను. కల - మంజులమైన, కంఠ-ధ్వని కలది, కాలకంఠుడైన (కాల కూట విషమును కంఠమున ధరించిన) శివుని పత్ని వామదేవీ (469)

అర్ధనారీశ్వరుని వామ భాగమందు ప్రకాశించునది:- వయోవస్థ వివర్జితా:- (470) శిశు, బాల్య, యౌవన, వార్ధక్యావస్థలు లేక ఎల్లప్పు డూ ఒకే పరారూపమున నుండును: యశస్వినీ : (474) కీర్తి కలది:- శ్రుతి : "అస్మాయామేధా ప్రజోవినిః తస్యనామ మహద్యశః" ఆమె గొప్పకీర్తి:- దివ్యవిగ్రహా (621) రమణీయ దేహము కలది:- అంత రిక్షమున పుట్టినది. కావున దివ్యము:- విగ్రహము అనగా యుద్ధము దేవి ఆకాశమునయుండి రాక్షసులతో యుద్ధము చేసెను.

నిత్యయౌవనా: (430) ఎల్లప్పుడు యౌవనవతి. ముసలితనములేదు. మదశాలినీ (431) ఇతర విషయములతో ఆమె కెన్నడూ సంబంధము

లేదు. ఆనంద విషయకమైన వ్యాపారమే మదము: ఆ ఆనందముతో ప్రకాశించుచుండును.

మదఘూర్ణితరక్తాక్షి (432) : లోకసంబంధ విషయములకు దూరమగుటయే ఘూర్ణము. అటువంటి మదముచే దేవి కన్నులు తిరుగుచూ ఎర్రగా నున్నవి. మదపాటల గండభూః మదము అనగా రేడన్న, కస్తూరి, గర్భము, సంతోషము, మదకలము, మద్యము, పాటలము అని నానార్థములుకలవు. పాటలము ఒకజాతి పుష్పము. ఆమెచెక్కిళ్లపై మకరికాది పత్రరచనలు చేయబడియున్నవి. మదముచే ఎరుపు తెలుపు రంగుగల కపోలభిత్తులు చెక్కిళ్లు గలది. మద్యమును సేవించుటచే చెక్కిళ్లు పాటలవర్ణము కలిగియున్నవి. చందనద్రవ దిగ్ధాంగి (434) ఆమె అంగములన్నియును మంచిగంధముయొక్క ద్రవముచే పూయబడి యున్నవి. దివ్యగంధాఢ్యా (631) హరిచందనాది సుగంధద్రవ్యములచే పూయబడిన శరీరముకలది. "గంధద్వారాం దురాధర్షాం: (2) దివ్యులు; దేవతలు, చేతనా చేవనాత్మకమైన పదార్థముల సంబంధముతే పరిపూర్ణమైయున్నది. ఇహలోక సంబంధములైన పదార్థముల చేతనే గాక, పరలోక సంబంధములచే నిండియున్నది. చాంపేయ కుసుమప్రియా (435) చంపకపుష్పముల యందు ఆమెకు చాలా ప్రీతి. కదంబ కుసుమప్రియా:- (323) కదంబ కుసుమములన్ననూ ఆమెకు ఇష్టము. కాదంబరీప్రియా: (330) ఉత్తమమైన కల్లు త్రాగుటయందు ప్రీతిగలదు. త్రిపురోపనిషత్తునందు దేవికి మదిర యనిన ప్రీతి యని పేర్కొనబడి యున్నది. వామాచార తత్పరులు పంచమ కారములు, మద్యము, మాంసము, మత్స్యము, ముద్ర మైథునములతో ఆరాధించెదరు, వారుణీ మద విహ్వలా:- (333) ఖర్జూరీ రసము వరుణ

నకు ప్రియము. అట్టి వారుణీ రసపానముచే కలుగు మదముచే ఆత్మా నందమున మైమరచును.

కుశలా (436) శలము అనగా చంద్రుడు. కుశలమనగా నీచ మైన చంద్రుడు కలది - చంద్రకాంతిని మించిన కాంతిగలది. (2) సృష్ట్యాధులందు నేర్పరితనముకలది. (3) కుశ: నీరు, లాతి : గ్రహించునది : నీటిని గ్రహించునది. కోయలాకారా (437) సుకుమారమైన ఆకాశము కలది.

మృణాల మృదుదోర్లతా (579) - తామరతూడులోని దారము వలె మృదువైన తీగెవంటి భుజములు కలవు:-

మాధ్వీపానాలాసా (575) మాధ్వీ ద్రాక్షా రసము కంటె బిన్నమైన మదిరాపానముచే మత్తిలి మాంద్యముగ అలసట చెందియుండును. మత్తా 576 మాధ్వీపానముచే మదించి యుండును. [2] మత్=నేను పరమశివునియందు పరాహంతా రూప ముతో యుండును. దేవి : భద్రప్రియా 115 భద్రమూర్తి 116 మంగళములే ప్రియముగాగలగి, మంగళకరమైన భవ్యమైన శరీరము గలది. పాటలీకుసుమప్రియా 773 మందారకుసుమ ప్రియా 776. దేవతా వృక్షములయిన మందారపుష్పములందు ప్రీతిమెండు. లేక తెల్లజిల్లేడు పూలయందుకూడా యిష్టము కలది. స్వతంత్రా 723 ఇతర వస్తువుల సాయములేకనే, ఇతరుల సహాయము పొందకనే సృష్ట్యాదులను సమర్థ వంతముగా, స్వతంత్రముచేయునది. ఇంకొకరహస్యంకూడ యున్నది తనకు శివుడు అధీనుడు, శివునికీమె అధీనురాలు. ఒకరికొకరు అధీనులు. అందుచే స్వతంత్ర:- శివపార్వతులకు భేదములేదని ఋజువుపరుపబడి యున్నది. గోమాతా (605) ఆమె కామధేనువు వంటిది. గోవులకుతల్లి

కోమలాంగీ (721) సుకుమారమైప అవయవములు గలది. దీక్షితా:- (695) జ్ఞానమును పొందించునది, శిష్యులకు మంత్రదానముచే పాప ములను పోగొట్టునది:- వింధ్యాచలవాసినీ (330) ఆమె వింధ్యపర్వత ములందు వసించును. మధుమతీ (7.7) మధువులేకతేనె. పూజాసమయ మందు వాటిని ఉపయోగించినచో దేవికి చాలా ప్రీతికరము.

మహీ : (718) ఆమెయొక్క స్వరూపము అతి రహస్యమైనను, భూమివలె ప్రకటితమైనది.



# శ్రీ దేవియొక్క కళ్యాణ గుణములు



శ్రీమాతయొక్క కళ్యాణగుణముల నంతములు. వాటిని లెక్కించుటకు గానీ, వర్ణించుటకు గానీ, ఎవరికినీ సాధ్యముకాదు. అందులో ఏ ఒక్క గుణాన్నో చూచి, అనుభవించగలిగిన మహానుభావులు దానినే తమ జీవిత సార్థకతగా భావించి మౌనం వహించినారు. దుర్వాసుడు, కాళిదాసు, ఆదిశంకరులు, శ్రీరామకృష్ణ పరమహంస లాంటివారు మనబోటి వారికోసమ్మే ఆ కళ్యాణగుణములను వర్ణించి చెప్పినారు. వారికి ఆ గుణములను కీర్తించుటకు, వాగ్దేవతలు సహస్రనామములో వ్యక్తీకరించిన నామములే ఆధానములైనవి. దేవికి నామరూపములుగానీ, గుణములుగానీ, కర్మలుగానీ లేక్‌లేవు. కానీ వాటిని మనము భావించి, నాదరూపమైన ఆ పరాశక్తిని ధ్యానించి కనబడే ఈజగత్తు ఆమె విభూతిగా భావించి, కనబడని ఆ శక్తిని పరబ్రహ్మముగాతెలుసుకొని అపరోక్షానుభూతిని పొందుటకై ఈ నామ, రూప, గుణ, కర్మలను, ఆశ్రయించుచున్నాము. వ్యావహారిక దశలో యున్నంతవరకు, ప్రాపంచిక భావమున్నంతవరకు ఈ నామ, రూపాదులు సత్యములే. వ్యక్తము నుంచే అవ్యక్తాన్ని అందుకోవలసి యుంటుంది. దేవియొక్క కళ్యాణగుణములను తత్త్వతః తెలుసుకొని, గానం చేస్తే - ఆ నాదమే మనకు త్రోవ చూపిస్తుంది.

వశిన్యాది వాగ్దేవతలు సర్వదేవతా సభలో శ్రీదేవియొక్క కళ్యాణ గుణముల నెట్లు కీర్తించారో చూచెదము:-

భవనాశినీ (715) భవారణ్యకుఠారికా:- (114) భవబంధములనబడు సంసారమును నాశనము చేయును. తిరిగి జన్మ లేకుండా

చేయును. జనన మరణ భయములేకుండా చేయును., భవమనగా దుఃఖముతో కూడిన సంసారము. అదొక మహారణ్యము. మరల మరల మొలచుచుండును. దానికి గొడ్డలి వంటిది. అనగా దేవిముక్తినొసగును. భక్త సౌభాగ్యదాయినీ (117) సుభగ : శ్రీ, కామము, మాహాత్మ్యము, వీర్యము, సూర్యుడు, కీర్తులు:- అటువంటి శోభన గుణములు శ్రీదేవికి కలవు. ఆమెయే లలిత. ఆ లలిత భాగ్యమే సౌభాగ్యము:- ఇనన్ని యును అదృష్టకరములు. ఈ సౌభాగ్యముల నన్నింటినీ భక్తుల కిచ్చును. భయాపహా: (121) దేవిని స్మరించువారి భయములన్నింటిని పోగొట్టును. శారదారాధ్యా (123) : ఆమెయొక్క కళ్యాణ గుణములను వాగ్దేవతలు, శారద కీర్తించిరి:- శారదులు అనగా పండితులు, వారు కీర్తించెదరు, బ్రహ్మ, విష్ణువులచే పూజింపబడునది. శర్మదాయినీ (125) భక్తులకు శర్మ అనగా సుఖమును ప్రసాదించును. శ్రీకరీ (127) సంపదలను భక్తులకు విస్తారముగా యిచ్చును. సాధ్వీ (128) సతీ అనిననూ, సాధ్వీ అనిననూ, పతివ్రత అనినను ఒకే అర్థము, దేవి మహాపతివ్రత,

శాంతిమతీ (131) ఆమె అంతరింద్రియ నిగ్రహమునకు సాటి లేదు. ఆమె మనస్సు ఎల్లప్పుడూ శాంతముగా యుండును. భక్తులఎదల ఏమాత్రం తీక్ష్ణభావము లేదు. దేవి:- మదనాశినీ (159) మోహనాశినీ (160) చుమతాహంత్రీ (165) మదనమును నశింపజేసి, మోహమును అనగా ద్వైయిత బుద్ధిని నశింపజేసి, ఆత్మ ఒక్కటే అను జ్ఞానమును కలుగజేయును.

పాపనాశినీ (167) దేవీ మంత్రము జపించిననూ, నామ పారాయణ చేసిననూ, దేవిని పూజించిననూ, ఆ భక్తుని పాపములను నశింపచేయును.

దుర్గారాధన పరుని మహాపాపములు తామరాకుమీది నీటిబిందువు వలె అంటవు:- క్రోధశమనీ (169) "క్రోధయుక్తో యద్యజతి, యజ్జుహోషి, యదర్చతి, సతస్యహరతే, సర్వం ఆమకుంభో యథోదకం" క్రోధముతో ఎవడు యాగములు చేయునో, ఎవడు హోమమొనర్చునో, ఎవడు పూజించునో వానిఫలము పచ్చికుండలోని నీరువలె కారిపోవును. కోపముగలవాడెన్ని సత్కార్యములు చేసినను, వానికి ఫలముదక్కదు: దేవి భక్తుల యొక్క క్రోధమును, శమింపజేయును:- లోభనాశినీ (171) లోభముకూడా ఒకదుర్గుణమే. భక్తులయొక్క లోభమును నశింపయును సంశయఘ్నీ: (173) (ఆమె గురులక్షణములు గలది. గురువు ఆశలేవీ లేనివాడై యుండవలయును. అతని కెటువంటి సంశయములుండరాదు సంశయములను పోగొట్టువాడై యుండవలయును. ఛిద్యంతే సర్వ సంశయాః" అని స్మృతులు చెప్పుచున్నవి) భక్తుల సర్వ సంశయములను ఛేదించును:- భేదనాశినీ (179) జీవాత్మ పరమాత్మ అను భేద బుద్ధిని తొలగించి అద్వయిత జ్ఞానమిచ్చును. మృత్యు మథనీ: (18) తనను ధ్యానించువారిని మృత్యువు నుండి తప్పించి, అమృతత్వము నిచ్చును. "మామృతాదిత్యమృతత్వం ప్రాప్నోతి, అక్షయత్వం ప్రాప్నోతి, నిత్యత్వం ప్రాప్నోతి, స్వయం రుద్రోభవతి" త్రిపురోపనిషత్:-" అమృతత్వమును పొందును. అక్షయత్వమును పొందును.- నిత్యత్వమును పొందును. తాను రుద్రుడే అగును."-వానికి మరణము లేదు. దుఃఖ హంత్రీ: (191) సంసార సంబంధమైన అన్ని దుఃఖములను పారద్రోలును. "దుఃఖేనాత్యంతశ్చరతి" "అత్యంత దుఃఖముల నుండి విడువబడినవాడమై సంచరించును." సుఖప్రదా (192) ఇహపర సుఖముల నిచ్చును. తై - ఉ II 7: "రసగ్ హ్యేవాయా లబ్ధ్వా నందీ భవతి" రసానుభూతి, బ్రహ్మానుభూతి నందిన పిదప సుఖి యగును:- దుష్టదూరా (193) దోషములు - పాపములు - గలవారికి దూరముగ నుండును.

దురాచారశమనీ (194) శాస్త్రవిరుద్ధమైన ఆచారములను శమింప చేసి, భక్తులను సదాచారపరులుగ జేయును. దోషవర్జితా (195) రాగ, ద్వేషాదులు దోషములు, అటువంటివేవియును లేవు. సర్వజ్ఞా (196) ఆమెకు భూత భవిష్యద్వర్తమానములు కృతాకృతములు. ధర్మాధర్మ ములన్నియును తెలియును. "యస్సర్వజ్ఞః ససర్వవిత్" సర్వజ్ఞుడెవడో వాడే సర్వవేత్త:- సాంద్రకరుణా (197) ఘనీభవించిన దయామయి:- సర్వశక్తిమయీ (199):- బాల, బగళ, మొదలగు శక్తులతో భేదము లేనిది. (2) సర్వదేవతాశక్తి సమూహము అన్నియు ఆమె రూపమే:- పదార్థశక్తియో యాయాస్తాస్తా గౌరీం విదుర్బుధాః లింగ పురాణం: పదార్థములందున శక్తులన్నియూ గౌరి అని ఎరుగుచున్నారు:- సద్గతి ప్రదా (201) భక్తులకు బ్రహ్మజ్ఞానము నొసగి సద్గతిని కలిగించును. స్వర్గమునేకాదు మోక్షము వరకుగల గతులన్నింటినీ పొందించును. "గతిస్త్వం, మతిస్త్వం, త్వమేకా భవానీ" - మహాపాతకనాశినీ (214) బ్రహ్మహత్యమున్నగు పాతకముల నన్నింటినీ నాశ మొనర్చును. "బహునాకి ముక్తేనశ్లోకార్ధేనవదామ్యహం బ్రహ్మహత్యశతం వాపి శివ పూజా వినాశయేత్" - బ్రహ్మాండపురాణ "పలుమాటలేల? శ్లోకార్థములో చెప్పెదను. బ్రహ్మహత్యాశతములను శివపూజ నశింపజేయును."

మహాసత్వా (216) సత్వము: ఉనికి, బలము, గుణము, స్థితి అని నానార్థములు : ఇవన్నియు ఆమెయందున్నవి. మహాశక్తిః (217) ఆమెకు మించినబలముగిలవారెవరులేరు. "నతత్సమాభ్యధికశ్చ దృశ్యతే" శక్తి, బలము, సామర్థ్యము, ఆయుధము వీటన్నింటిచే ఆమె జగత్తుల నామె పాలించును. మహారతిః (218) మహాకాముడైన పరమేశ్వరుని భార్య కావున మహారతి (2) జ్ఞానులైన యోగులు

ప్రాపంచిక విషయ విరక్తులై దేవియందు మిక్కిలి ప్రీతిని ప్రదర్శించెదరు. అటువంటివారికి ప్రీతిపాత్రురాలు. మహాభోగా (219) భోగమనగా సుఖము, ధనము యివి ఆమెకు గలవు. మహైశ్వర్యా (220) ఈశత్వము, సంపదలు రెండూ గలవు. మహావీర్యా (221) శుక్రము, తేజస్సు, సామర్థ్యములు కూడా కలవు. మహాబలా (222) బల, బలము, గంధము, రసము, రూపము, రుచి, రంగు, జీవము, సేన, బలరాముడు, రాక్షసుడు, బలి, కాకి అను అర్థములు కలవు. ఇవన్నియు ఆమెకు కలవు. బుసుండుడను కాకికి ముక్తి నిచ్చినది. యోగవాసిష్ఠంలో "భుసుండుడను వాయసము వసిష్ఠునితో "చండుని కుమారులైన వాయసము లన్నదమ్ములము. మేము ఇరువది ఒక్కమంది యున్నాము. మేము మా అక్కల్లెండగు ఆడు హంసలతో కూడి "బ్రాహ్మీ" దేవిని పూజించితిమి మమ్మలను దేవి అనుగ్రహించి ముక్తులను గావించెను." మహాబుద్ధిః (223) గొప్పబుద్ధి కలది. అనగా "యస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంస్యాత్" - శ్రుతి "ఏది తెలియబడిన సర్వము ప్రపంచము తెలియబడునో" - మహాబుద్ధి, మహాసిద్ధిః (224) అణిమా మున్నగు సిద్ధులామెకు గలవు. (1) రసము లన్నింటి యొక్క ప్రకారము (2) ద్వంద్వములచే తిరస్కరింప బడినది - (3) తరతమరాహిత్యము (4) బ్రదుకునందు సుఖదుఃఖములయందు సమత్వము (5) విశోకము: కాంతిబలముల ఆధిక్యము (6) తపోదానములందు నియమము (7) ఆకాశగమనము (8) సమత్వము: ఇవిఎనిమిది యున్న సిద్ధులు: ఇవి ఆమెకు గలవు. మహాయోగీశ్వరేశ్వరి : (225) యోగీశ్వరులైనవారికే ఈశ్వరి: మహాసనా (229) పృథివి మొదలు ముప్పది ఆరు తత్వములు ఆమెకు ఆసనములు:- చతుష్షష్టి కళామయీ: (236) అరువది నాలుగు కళలు లేక తంత్రముల మయమైనది:- లిపి జ్ఞానము, వానిని చదువులు, వ్రాయుట, అనేక భాషలయందు జ్ఞానము

వానియందు కవిత్వము చెప్పుట, జూదము, వేదములు, ఉపవేదములు శాస్త్రములు, శాస్త్రాంగములు, తంత్రములు, పురాణములు, స్మృతులు కావ్యములు, అలంకారములు, నాటకములు, శాంతి, వశ్య, ఆకర్షణ, విద్వేషణ, ఉచ్చాటన మారణములు, గతి, జల, వృష్టి, అగ్ని, ఆయుధ, భాషా, వీర్య స్తంభనములు, శిల్పవిద్య, గజ హయ శిక్ష, రథశిక్ష, నర శిక్ష, సాముద్రికము, మల్లయుద్ధము, వంట గారుణము, (విషశాస్త్రం) సుషిరము, అనర్ధము, ఘనము, ఇంద్రజాలము, నృత్తము, గీతము, రసవాదము, రత్నపరీక్ష, చౌర్యము, ధాతుపరీక్ష, అదృశ్యత్వము. ఇవి అరువదినాల్గుకళలు:- వీటన్నింటియందును నేర్పరి. పుణ్యా పుణ్య ఫల ప్రదా : (288) ధర్మము నాచరించినచో వారికి పుణ్యము కలుగును, అధర్యపరులకు పాపము లభించును. దానివలన నరకలోక వాసము పుణ్య పావ ఫలములను, వారివారి కర్మలనుబట్టి - వారికాయాఫలముల ఒసంగునది. పురుషార్థ ప్రదా:- (291) ధర్మ, అర్థ, కామ, మోక్షము లనెడి చతుర్విధ పురుషార్థముల నిచ్చును. "పురుషోవై రుద్ర"రుద్రుడే పురుషుడు. ఆ పురుషుడే పురుషార్థ ప్రదాత. కానీ శక్తిలేనిచో ఆయన ఏమియు యివ్వలేడు. అందుచే శక్తికూడిన శివునే ఉపాశించవలెను:-

కరణారససాగరా (326): సముద్రములను మించినకరుణకలదు ఆమె దయ అపారము: కళావతీ (327) అరువది నాలుగు కళలలో ఆరి తేరినది. కళాలాపా (328) కళలే ఆమె సంభాషణలు.

వరదా (333) ఆమెను ఉపాసించువారికి వారు కోరిన వరముల నిచ్చును. వందారు జనవత్సలా (349) తనను నమస్కరించు వారి యందు వాత్సల్యముచూపి తన బిడ్డలవలె కాపాడును. వంద్యా (348)

అందరూ నమస్కరించెదరు. భక్తిమత్కల్పలతికా (353) భక్తిగల జనులకు కల్పలతవలె వారికిష్టమైన కోర్కెల నిచ్చును.

పశుపాశ విమోచనీ (354) మాయ, కర్మ, గుణాదులచే కూడిన అజ్ఞానులు,పశువులు అట్టివారి అజ్ఞానపాశముల నుండి తొలగించి ముక్తి నొసంగును. (బృహ: ఉప: 174-107 : "యోన్యాం దేవతా ముపాస్తే అన్యోసావన్యో హమస్మీతి నసవేద యథాపశుః" ఎవడు తాను వేరు దైవము వేరు అని ఉపాసించునో అతడు పశువు" విద్యావిహీనుడు పశువు. (2) పా=దప్పిక., అశ్: తిండి వి : బాగుగ, మోచనీ: వదలించునది, పాశ = పిబతి + అశ్నతి = ఆకలి దప్పులపై ఆశ గలవారు పశువులు, శ్రుతి: "అథేతరేషా పశూనాం, అశనాపిపాసే, ఏవాభిజ్ఞానం, నవాభిజ్ఞాతం వదంతి, నవిజ్ఞానం పశ్యంతి, నవిదుః శ్వస్తనం లోకా లోకాః ఇతర పశువులు ఆకలి దప్పులను మాత్రమే యెరుగుచున్నవి. తెలుసుకోవలసిన బ్రహ్మమును గూర్చి ఎరుగవు. ఆ బ్రహ్మమును చూచుటలేదు. ఇహపరములను గూర్చి ఎరుగవు. భవిష్యత్తును తెలుసుకొనలేవు" (4) పశుపు అవ్యయము: వ్యయము కానటువంటి పూర్ణము. అట్టి వరుణపాశము నుండి దేవి విముక్తి కలిగించును. (5) పాశము పాటికలు - బాగుగ వేయును. పాటికలతో శివుని ఓడించెను. (6) పశుపాలకుడు శివుడు. శివుని పొందగోరువారు భక్తులు. వారిని విశేషముగ విడిపించును. తనను పొందినవారిని తృప్తి పరచును (7) బ్రహ్మ మొదలు కీటకమువరకు ఆహార నిద్రాదులగు పశుధర్మములు గలవారు గాన వారందరూ పశు సమానులే. వానిని అవిద్య బాధించుచున్నది. అది పాశము. ఇరువది నాల్గు తత్వములు మాయ, కర్మ, గుణములతో కూడినపన్నియు పాశములే వానినుండి విడిపించునది. అజ్ఞానంబంధ అజ్ఞానమేబంధము. క్లేశములు ఐదువిధములు: (1) అవిద్య ఆత్మానాత్మ వివేకము లేకుండుట : జీవాత్మ పరమాత్మ లొకటియే అను జ్ఞానము

లేకపోవుట - (2) అహంకారము అహంకారము:- ఆత్మకాని దేహమందు ఆత్మబుద్ధి : (3) రాగము దేహ సుఖమునకై శబ్ద స్పర్శ రూప రస గంధాదులందాసక్తి, (4) ద్వేషము, దేహ సుఖప్రాప్తికి అడ్డంకులేర్పడునప్పుడు కలుగు కోపము : (5) అభినివేశము: విడువరాని జీవ బంధము. ఇది అది కాదని తెలిసియు జీవ భావ భ్రాంతి:- ఇటువంటి పాశములను తొలగించును. ఇవే కాక, దయ, సంశయము, భయము, లజ్జ, జుగుప్స, కులము, శీలము, జాతి, కూడ పాశములేనని కులార్ణవ తంత్రము చెప్పుచున్నది. (8) పాశములు, అణువు, భేదము, కర్మ:-లు (1) అణువు:- అజ్ఞానము : ఇది రెండు విధములు, (1) చైతన్యరూపమైన ఆత్మయందు ఆత్మజ్ఞానము లేకుండుట (2) అనాత్మయందు ఆత్మబుద్ధి. ఇవి రెండూ ఆణవమలములు. అనంతమైన ఆత్మకుపరిచ్ఛిన్నము చేయుట అని తెలుపునది గాన అణుశబ్దము ప్రయోగింపబడినది. మలము అనగా అపరిశుద్ధము (2) భేదము: ఒకటైన ఆత్మకు అనేక భేదములు కల్పించుట - (3) కర్మ: విధింపబడిన కర్మలు, నిషిద్ధకర్మల నాచరించుట వలన, పుణ్యపాప ఫలములననుభవించుటకై శరీరధారణ. ఇది కర్మ మలము:- వీటినన్నింటినీ దేవి తొలగించును.

సంహృతాశేష పాషండా (355) సమస్త పాషండలను రూపుమాపును. "వేదబాహ్య వ్రతాచారాః" వేదవిరుద్ధ ధర్మములనాచరించెడు వారు పాషండులు ; పురాణ, న్యాయ, మీమాంస, ధర్మశాస్త్రములు, శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పములు, నాల్గు వేదములు ఈ పదునాలుగు ధర్మస్థానములు, ఇవి నిత్యములు. వీటి కంటె భిన్నమైన వన్నియును పాషండములు. వాటిని అనుసరించు మిగత శాస్త్రములను ఖండించువారు పాషండులు:-ఇటువంటి వేదబాహ్య వ్రతులైనవారిని ఈమె ఖండించును.

శృంగారరస సంపూర్ణా (376) శృంగారమను రసముచే బాగుగ నిండియున్నది.

జయా (377):- జయమే ఆమె ఆకారము :

అమతిః (537) : అవిద్యా స్వరూపిణీ:- సృష్టిక్రమమందు ప్రాథమిక సృష్టి అబుద్ధిపూర్వకముగా జరిగినందున అది అమతి: వేధా (538) (1) క్రమప్రాప్తమగుటచే బుద్ధిపూర్వక సృష్టికూడ దేవిరూపమే (2) మేధాసిదేవి విదితాఖిలశాస్త్రసారా" సకల శాస్త్ర పారంగతురాలు కాబట్టి ఆమె మేధ కలది. "యా దేవీ సర్వభూతేషు మేధా రూపేణ సంస్థితా" సర్వభూతములందు దేవి మేధారూపమున యుండును. ధీః-"ధారణా వతీ మేధా" బుద్ధిరూపిణీ:- శ్రుతిః (539) వేదరూపిణీ:- స్మృతిః (540) (1) మనుస్మృతి మొదలగు స్మృతులు ఆమె రూపములే: వర్తమానా న్యతీతాని తథైవానా గతాన్యపి స్మరతే సర్వకార్యా ణితేనా సాస్మృతి రుచ్యతే"-భూత భవిష్యద్వర్తమానములైన సర్వకార్యముల స్మరించు టచే ఈమెకు స్మృతి అను నామము కలిగెను. స్మృతిః సంస్మరణాద్దేవి" స్మరించుటచే దేవి స్మృతి అనుత్తమా (541)- ఈమె కంటె మరొక ఉత్తమమైన వస్తువేదీలేదు. ప్రీతి: "నతత్సమశ్చాభ్యధి కశ్చదృశ్యత" దానికి సమానమైనదిగానీ, అధికమైనదియు కనబడుట లేదు" "నత్వత్సమోఽభ్యధికః కుతోన్యః" - గీత - నీతో సమానుడుకాని, అధికుడెవడు? - నీకంటే?" (2) అనుత్త: పరప్రేరితము, మా = బుద్ధి లేక - ఐశ్వర్యము ఎవతె బుద్ధరప్రేరితముకాదో, స్వతంత్రమైనదో- అట్టి బుద్ధికలది. సహజ ఐశ్వర్యముకలదు:-

పుణ్యకీర్తిః (542) ఆమె కీర్తి పుణ్యప్రదము. కీర్తివంతమైన పుణ్యము కలది. పుణ్యశ్రవణ కీర్తనా (544) పుణ్యప్రదములగుకర్మల యందునూ. వాటిని వినుటయందును అసక్తిగలది. పులోమజార్చితా:

"నహుషుడు స్వర్గాధిపతి కాగా, ఇంద్రాణి తన భర్తకు స్వర్గాధిపత్యము అభించుట కొరకు దేవగురువువలన దేవీ మంత్రోపదేశమును పొంది, త్రిపురసుందరిని బలి, పుష్పాదులచే అర్చించెను. దేవి ఆమెకోర్కెను తీర్చెను'' - దేవీ భాగవతము:-

బంధమోచనీ (549) అవిద్యా సంబంధములయిన బంధముల నుండి భక్తులను భక్తులను విడిపించును. హరి వంశంలో "అనిరుద్ధుడు దేవిని" నీ అనుగ్రహముచే, ఎటువంటి విఘ్నములు లేక, శీఘ్రముగ బంధవిముక్తుడ నయ్యెదను. నన్ను దయతో చూడుము. ఓ విశాలాక్షీ! నీ పాదములను శరణు పొందుచున్నాడను. సకల బంధముల నుండి విడిపించగల సమర్థురాలవు నీవే. "సర్వేషామేవ బంధానాం మోక్షణం కర్తుమర్హసీ" అని ప్రార్థించగా బాణుని పట్టణమున బంధింపబడిన అనిరుద్ధుని విడిపించెను. దేవీ భాగవతమందు కూడ "ఏకావలి అను రాకుమారి, కాలకేతువను రాక్షసునిచే చెరపెట్టబడగ యశోవతి యను ఆమె చెలికత్తె దేవి నుపాసించి ఆమెను బంధవిముక్తురాలిని గావించెను. సర్వవాధిప్రశమనీ (551) సర్వమృత్యు నివారిణీ (552) సర్వవ్యాధులను పోగొట్టుటయేగాక, అపమృత్యువు, కాలమృత్యువుల నుండి కాపాడును. "జ్ఞాత్వా ద్వేవం మృత్యుముఖాత్ ప్రముచ్యతే" శ్రుతి: ఆమెను తెలుసుకొని సర్వ మృత్యువుల నుండి వదలబడుచున్నాడు.

అగ్రగణ్య (558) లెక్కించదగినవారిలో మొదటలెక్కింపదగినది కలికల్మష నాశినీ (555):- కలికాలమందలి పాపముల నన్నింటినీ నాశనముచేయును. "శమాయాలం జలం వహ్నేః, తమసో భాస్కరోదయః శాంత్యైః రఘూఘస్య దేవీ నామానుకీర్తనం" = జలము, అగ్నిని, సూర్యోదయము చీకటిని శాంతింప జేయునట్లె దేవీ కీర్తనచే

పాపరాసులన్నియు నశించిపోవును. (కూర్మపురాణం) "కృతస్యాఖిల పాపస్య జ్ఞానతోపివా ప్రాయశ్చిత్తం పరం ప్రోక్తం పరాశక్తేః పద్మ స్మృతిః" జ్ఞానమువలనగానీ, అజ్ఞానము వలనగానీ చేసిన సమస్తపాపములకు ప్రాయశ్చిత్తము పరాశక్తి నిత్య తృప్తా: (566) నిత్యమైన స్వరూపానందముచే ఎల్లప్పుడు తృప్తి పొంది యుండును.

భక్తనిధిః (567) భక్తుల కోరికలు తీర్చును కాన భక్తుల పాలిటి పెన్నిధి. మహనీయా (580) దయామూర్తిః (581) పూజార్హురాలు, దయాస్వరూపిణీ, మహాసామ్రాజ్యశాలినీ (582) మహాకైలాసాధిపత్యమే మహాసామ్రాజ్యము: అటువంటి ఉన్నత పదవికిచేర్చును. దండనీతిస్థా (608) ఈమెను గూర్చి నీతిశాస్త్రము నందు విశేషముగా పేర్కొనబడి యున్నది. అన్యాయ మార్గములందు సంచరించు లోకులను, దండించి వికల్పరహితులను చేసి, దండనీతిస్థ యగుచున్నది.

శుభకరీ (682) శుభ మనగా పుణ్యము. భక్తులకు శుభమును, మోక్షము నిచ్చును. సత్యసంధా: (693) సత్యమందు దాటరాని ప్రతిజ్ఞ కలది. సత్యప్రతిజ్ఞురాలు. సర్వాతంత్రధాత్రి: (698) భక్తులకు ధర్మార్థ కామముల నిచ్చును. సకల పురుషార్థప్రదాత్రి:- తుష్టిః (443) సకల ప్రాణులకు తుష్టినిచ్చును. "యాదేవీ సర్వభూతేషు తుష్టి రూపేణ సంస్థితా - నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః' (మార్కండ-పురా).

పుష్టిః : 444 "అన్నం బ్రహ్మేతివ్యజానాత్" జీవులకు పోషణను కల్పించును. మతిః 445 ఇది ఇట్టిది, ఇంతది అని భింతించు మతి స్వరూపిణి:- సమానము: శుద్ధా 765 పవిత్రమైనది. అవిద్యా సంబంధమైన మలినములులేనిది.... ఓజోవతీ (767) ఓజస్సు అష్టమ ధాతువు.

ఇంద్రియ సామర్థ్యము తేజస్సు. ఇవన్నియు ఆమె యందు కలవు. ద్యుతిధరా 768 కాంతిని ధరించునది. యజ్ఞరూపా 769 యజ్ఞో వై విష్ణుః యజ్ఞమే విష్ణువు యజ్ఞము లన్నియు నామెరూపమే:-

ప్రియవ్రతా:- 770 దేవతా విషయకములైన సకల వ్రతము అందు ప్రీతి కలది - దురారాధ్యా 771 చపలచిత్తులకు ఆమెను ఆరాధించుటకు వలనుపడదు. దురాధర్షా (772) ఆమెను ఎవరూ స్వాధీన పరచుకొనలేరు:- కలామాలా (794) అరువదినాలుగుకళల పరంపర, లావణ్యమును శోభను కలిగినది కామధుక్: కోరికలను పిండునది-పూరించునది కామరూపిణీ (796) (1) కామః శివుడు, శివస్వరూపిణి: శ్రుతి: "సోకామయత బహుస్యాం ప్రజాయేయ" అతడిట్లు తలచెను. నేను అనేకములు కాదలచినాను. నేను ప్రజలను సృజించెదను." (2) యధేచ్ఛగా కోరిన రూపములు ధరించగలది శక్తి కలది. కలానిధిః 797 :- అన్నికళలకు నిధి : బృహ ఉప "ఆత్మయివాస్య షోడశీకలా" ఇతనికి పదునారవ కళ ఆత్మయే అందుచే జీవులకు నిధి. కావ్యకలా 798 : కవియొక్క కర్మ కావ్యము దృశ్యశ్రవ్య కావ్యముల రూపిణి - దేవిని న్మరించిన ఎడల కావ్య నిర్మాణము సుసాధ్యము. 2) శుక్రుని మృత సంజీవని అను కలారూపిణీ - రసజ్ఞా 799. నవవిధ శృంగారాది రసములను బాగుగ తెలిసికొన్నది. కొందరు దశవిధ రసములని చెప్పెదరు. 2. రసనేంద్రియ రూపముగలది. రససేవధిః 800 : బ్రహ్మమృతమునకు నిధి! శ్రుతి : ''రసోవై సః రసం హ్యేవాయాలబ్ధ్వా నందీ భవతి" అతడు రసము. రసస్వరూపుడైన అతనిని పొంది ఆనందు డగుచున్నాడు, ఋధార్చితా 825. ఆమెను జ్ఞానులు పూజించెదరు. "చతుర్విధాభజంతే మాం జనాస్సుకృతి నోర్జున - ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీజ్ఞానీచ భరతర్షభ;" భ.గీ.) - ఓ అర్జునా, ఆర్తిలో నున్నవాడు, నా తత్వమును తెలి ౨

గోరువాడు, ధనమును కోరువాడు, జ్ఞానీ ఈ నాలుగు విధములైన జనులు నన్ను భజించుచున్నారు:-

ధృతిః 446. ధైర్యముకలది. ధృతఃమతం ప్రజ్ఞానస్యా నామధేయాని (ఐత: ఉప: 3) ప్రజ్ఞానమునకు ధృతిమతి అని పేర్లు:- శాంతిః (447) అశుద్ధమైన అణు, మాయ కర్మలచే (మలములు) బాధపడు జీవునకు సుఖస్థానమునిచ్చి శాంతిని కలుగజేయు గుణము కలది. స్వస్తిమతీ (448) సు-బాగుగ, అస్తి-ఉండుట, మత్-కలిగియుండుట. సత్యమునకు సత్యమైన పరబ్రహ్మరూపిణి, అవినాశి, క్షేమము గలది. (ఇచ్చును) నందినీ (450) సర్వజీవులను ఆనందింపజేయును. ప్రజ్ఞానంబ్రహ్మ: విఘ్ననాశినీ (451) మోక్షమునకు అంతరాయములుగా యున్న అవిద్యాదులను తొలగించును. మాలినీ (455) అ నుండి హ వరకు గల అక్షరములే మాలగా ధరించియున్నది. క్ష కారము ఆ దండకు మేరువు వంటిది:- హంసినీ (456): పరమహంస స్వరూపిణి. వారికి-దేవికి భేదములేదు. మాతా (457) అందరినీ అన్నింటినీ పుట్టించునట్టి తల్లి:- (2) మాతృకావర్ణ రూపిణి. స్కాందపురాణంలో "మంత్రాణాం మాతృభూతాచ మాతృకాపరమేశ్వరి:" మంత్రము అన్నింటికి తల్లి కాబట్టి పరమేశ్వరి మాతృకా అని చెప్పబడును. (3) ప్రకృష్టమైన కాంతిగలది. (4) శ్రీ, మా, రమా, కమలా, మాతా, లక్ష్మి, మంగళా అని పర్యాయ పదములు గలవు కాన "మాతా" అనగా ఇవన్నియును అని తెలుసుకోవలయును.

క్షోభిణి (466) సృష్టిచేయునపుడు "మాత" యొక్క మనస్సు క్షోభించెను. వరాహపురాణం "వైష్ణవీదేవి తపస్సుచేయుటకై మందర పర్వమునకు పోయెను. కొంతకాలము తపస్సుచేయగ, ఆమె మనస్సు క్షోభనందెను. ఆ క్షోభముదుండి అందమైనవారు, నల్లని వంగినవెంట్రు

కలు గలవారు, బింబోష్ఠులు, పద్మనయనలు, కలువలవంటివారు, సర్వా
భరణ భూషితులూ, కాంతిమంతులూ, వివిధమోహములుగల స్త్రీలు నూర్లు
వేలు, లక్షలుగా పుట్టిరి:- సురనాయికా (483) దేవతలకు నాయిక
"మహత్తరా మహిమా దేవతానాం" - దేవతలయొక్క మహత్తరమైన
శక్తి (మహిమ) దేవియే. సిద్ధేశ్వరీ (471) సిద్ధవిద్యా (472) సిద్ధ
మాతా (473) గోరక్షకాది సిద్ధులకీశ్వరి - సిద్ధవిద్యాస్వరూపిణీ - అనగా
పంచదశి విశ్వవ్యాప్తమైన పరామంత్రము. జ్యోతిష సంబంధమైన
లెక్కలు దానికనవసరము:- సిద్ధులను తల్లివలె రక్షించును. ప్రియంకరీ
(731) భక్తులకు ప్రియమును కలిగించును. ముక్తిరూపిణీ : (737)
మోక్షమే రూపముగా గలది. 'ఆత్మ స్వరూపమే పరాముక్తి. ఇది
అవిద్యచే కప్పబడియుండును. జ్ఞానముచే - శుద్ధ విద్యచే - స్పష్ట
మగును. ఆత్మ సాక్షాత్కారము. తత్వమసి, అహంబ్రహ్మాస్మి - అను
ఆత్మతాదాత్మ్యమే ముక్తి:- ద్రవ్య, గుణ, కర్మ సామాన్యాది ఆత్మేత
మోక్షముకాదు. (సౌరసంహిత) లాస్యప్రియా (738) నర్తనమంటె
చాలా ఇష్టము కలది. కోమల కరణాంగములు కలిగి కైశికీ వృత్తి
ప్రధానమైనది లాస్యము: లయకరీ (739) తాళముచే నృత్తగీతాదులు
సమముగకూడి యుండుట లయము. అట్టి లయము చేయునది. (2)
లయము, ఇదొక చిత్తావస్థా విశేషము. లయ పద ధ్యావము ప్రసవిత్రీ
(826) ఆకాశము మొదలు ప్రపంచమును బాగుగ పుట్టించునది. బ్రహ్మ
మొదలు స్థావరాంతము ఎవతెవల్ల జనించెనో, మహదాది విశేషాంతము
జగత్తు ఎవతెవల్ల జనించెనో (తామేవసకలార్థానాం ప్రసవిత్రీం పరాం
నుమః) అట్టి పరాదేవిని నుతించెదను:- ప్రచండా (827) చడీ అనగా
కోపము. ఆమె దూతికలు ప్రకృష్టమైన కోపముగలవారు. అటువంటి
దూతికలచే ఎప్పుడూ పరివేష్టింపబడి యుండును. శ్రుతి : "భీషాస్మా

ద్వాతః పహతే "ఇతని భయమువలననే గాలి వీచుచున్నది." మహా ద్భయం వజ్ర ముద్యతం" దేవి చేతిలోని వజ్రాయుధము ఎల్లప్పుడూ భయంకరముగా ఎత్తబడి యుంటుంది. అందరికీ భయము కలిగించి వారి వారి పనులందు నిమగ్నులను చేయుచుండును. కామందకుడు "ప్రజలు ఎవరినిచూచి భయపడరో అతడెట్లు వారిని రక్షించగలడు?" అని ప్రశ్నిస్తాడు - జగత్తంతయు ఆమె యందలి భయము చేతనే నడుచుచున్నది.

ఆజ్ఞా_లేక_జ్ఞ : (828) వేదములందు విధి నిషేధములు ఇట్లు చేయవలయును, అటులచేయరాదు, అనునియమము లుగలవు. అవన్నియును భగవత్ప్రేరితములు. అవియే ఆజ్ఞలు:- ఆజ్ఞానరూపిణి. శివ పురాణంలో "రుద్రాజ్ఞా విషాస్థితా దేవీహ్యనయా ముక్తి రంభయా" ఇది రుద్రాజ్ఞగా యున్నదేవి. ఈమె వలననే ముక్తి కలుగుచున్నది లేక - జ్ఞ : (ఏకాక్షరము) : గుణభోక్త. గుణముల ననుభవించువాడు. శ్రుతి జ్ఞః, కాల కాలో, గుణీ సర్వ విధః" జ్ఞ: అనగా కాలకాలుడు, గణీ సర్వవిదుడు. ప్రకటాకృతిః (830) లేక అప్రకటాకృతిః అందరచే అనుభవింపదగిన రూపము గలది. "శివరూపేణ నవిజానంతి మాయ యా" మాయచేత శివ రూపము నెరుగజాలకున్నారు. అందరమూ "అహం" నేను అనుచున్నాము. కాని "అహం" అనునది దేహమనీ, ఇతరమనీ భావిస్తున్నాము కానీ, పరాశక్తి యని తెలియలేకున్నాము. అప్రకటా అనుకొనినచో - రహస్యరూపమున నుండునది అని అర్థము చెప్పుకోవలయును. (2) నీటియందు ప్రత్యక్షముగ నుండునది శ్రుతిః "అపోవా ఇదగ్ం సర్వం" "అపామేకా మహిమానం బిభర్తిః" నీటి యందు మహిమ ననుభవించునది" - ప్రాణేశ్వరీ (831) ప్రాణములను, యంద్రియములను అధిష్ఠించి యుండు ఈశ్వరి. "జ్యోతిరాద్యధిష్ఠానంతు తదామననాత్ (బ్రహ్మసూత్రము) జ్యోతిస్సు మొదలగు

వానియందు అధిష్ఠానము అట్లు తలచుటచే పంచవృత్తులుగల ప్రాణ స్య ప్రాణః" ప్రాణమునకు ప్రాణము (2) ప్ర + అణి : ప్రకృష్టమైన శబ్దము - వేదరూపమైన శబ్దమున కీశ్వరి. వేదార్థముచే ప్రతిపాదింప బడు దేవత:- ప్రాణదాత్రి (832) ప్రాణములనిచ్చునది: ఉదారకీర్తి (848) ఉత్ + అరా, ఉత్ = అంతటావ్యాపించినదియు, అరా : శీఘ్ర సాధ్యమైన కీర్తి కలది.

ఉద్దామవైభవా (849) దామము : బంధించు త్రాడు., కొలత చేయునది దానిని మించినది ఏ కొలతలకు అందనిది. అత్యంత వైభ వోపేత - గర్వితా : (856) గర్వము : విశ్వమును నిర్మించునట్టి పరా హంత: ఈ పరాహంత ఆమె యందే పుట్టెను:- గానలోలుపా (857) తతము, అనద్ధము, సుషిరము, ఘనము, అను నాల్గింటి సముచ్చ చ్చయమే గానము. దానియందాసక్తి కలది. (2) వాదిత్రములైన వీణాదులందాసక్తికలది. (3) శారీర, గాంధర్వ, సామములందు ప్రీతి కలది. త్రివర్గ నిలయా: (873) ధర్మార్థకామములకు నిలయమైనది' త్రిస్థా (874): ముల్లోకములందు భేదములేకుండా ఉండునది. మూడు లోకములు, ముగ్గురుమూర్తులు, మూడువిద్యలు, మూడగ్నులు, మూడు జ్యోతిస్సులు, త్రివర్గములు, ధర్మత్రయము, త్రిగుణములు, మూడు గుణములు, మూడుదోషములు, మూడుఆశ్రమములు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాత్రయము. పితృత్రయము, మాతృత్రయములు అన్నియు ఆమె రూపములే :- త్రిపురమాలినీ (875) అంతర్దశార చక్రాభిమాని త్రిపురమాలిని :- నిరామయా (876) ఏవ్యాధులు ఆమె దగ్గరకు రావు:- నిరాలంబా (877) సర్వమునకు ఆమెయే ఆలంబ నము. ఆమెకు వేరే ఆలంబనము లేదు. యజ్ఞప్రియా (881) యజ్ఞ కర్త్రి (882) యజమాన స్వరూపిణీ (883) "యజ్ఞోవై విష్ణుపి" యజ్ఞమే

విష్ణువు. అట్టి విష్ణుస్వరూపమైన యజ్ఞమందు ప్రీతిగలది. యజ్ఞమును కూడా ఆమె చేయించును. యజ్ఞయజమాని యొక్క భార్యదీక్ష అట్టి దీక్షాస్వరూపిణి. శివుని అష్టమూర్తులలో ఒకటైనయజమానమూర్తి ధర్మాధారా (884) ధర్మములు : ఆ యా దేశములందు, పరంపరగా, వచ్చినవి, కుల, ఆశ్రమ, వర్ణములయొక్క వేద విరుద్ధములు కాని కర్మలు. అట్టి ధర్మముల ప్రవాహమే దేవి. (2) ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్ : ధర్మమునందే అంతయునుసుప్రతిష్ఠితమైయున్నది. ధర్మమే ఆధారముగాగలది. ధనాధ్యక్షా (885) ధనమునకు స్వామిని కుబేరుడు దేవీ ఉపాసకులలోనివాడు. అతనికి తనకు భేదములేదు. విప్రప్రియా (887) విప్రులయందు ప్రీతికలది.

విప్రరూపా (888) విప్రులయందు ప్రీతికలది. సౌమ్యా (910) సోమ యాగమునకు తగినది : సోముడు (శివుడు) అవయవముగా గలది. (2) సోమ = చంద్రుడు, కర్పూరము వీటివలె ఆహ్లాదము కలిగించునది. స్తుతిమతీ (928) ఈమెను స్తుతించుట చేత జ్ఞానము, ఐశ్వర్యము కలుగును :-

సవ్యాపసవ్య మార్గస్థా (9.2) దేవి సూర్య మండలమునకు సవ్య = కుడి - అపసవ్య = ఎడమ ; మార్గ = మధ్య : ఉత్తర మార్గములందు ఉండును.

తత్త్వాధికా : (906) ముప్పది ఆరు తత్త్వములకతీతముగా యుండునది. ఈ ముప్పదిఆరు తత్త్వములు ప్రళయకాలము వరకు మాత్రమే యుండును. అవి నశించినను, దేవి మాత్రముండును. అందుకే వాటికన్నను అధికురాలు, తత్త్వమయి (907) దేవి తత్త్వస్వరూపిణి: వాటిని మించినది కూడా ; తత్త్వము : శివ తత్త్వము. (2) సంప్రజ్ఞాత - అసంప్రజ్ఞాత సమాధిస్థితులను దాటినది. (3) తత్త్వ

ములు మూడు విధములు: ఆత్మ, విద్యా, శివతత్త్వములు: ఇవి ముప్పదిఆరు తత్త్వములలోయున్నవి. వాటినిమించిన సచ్చిదానంద రూపిణి; ఈ తత్త్వములన్నియు ఆమెకు అవయవములు. తత్త్వ మర్థ స్వరూపిణీ : (908) మహావాక్యమందుండు తత్ = అది: త్వం = నీవు అను పదముల కర్థము శివ జీవులని. తత్ = శివుడు; త్వం = జీవుడు. ఆమె శివ జీవ స్వరూపిణి:- మనస్వినీ (930) మాన వతీ (931) మనస్సు ఈమెపై ఆధారపడి యుండును. మనస్వినిమె యందు స్వతంత్రముగా అధివసించియున్నది. చిత్త సమున్నతి కలది. ఎంతో ఆదరణ కలది. తను ప్రేమించిన వారి అపరాధము లను ఎత్తిచూపించునది:- సుమంగలీ = (967) సువాసిని: శోభన మైన మంగళము గలది. (2) శోభనము = మంగళము = బ్రహ్మం విష్ణు పురాణంలో "స్మృతి మాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం విదుః" స్మరణ మాత్రముచే అమంగళములను తొలగించి మంగళము లను చేకూర్చునట్టిది బ్రహ్మము. అదియే మంగళమని తెలిసికొనుడు సువాసిన్యర్చన ప్రీతా: (971) సువాసినీస్త్రీలు అర్చించునప్పుడు ఆమె ఆనందమునకు కొదవలేదు. ఆశోభనా (972) అంతటా సౌంద ర్యము కలది. అనఘా (987) దుఃఖము కాని, వ్యసనములు కానీ లేనిది. అద్భుత చారిత్రా (988) ఆశ్చర్యకరమైన చర్యలు కలది. మహిషాసుర, భండాసురాది రాక్షసులను సంహరించుట లోను, తన భక్తులను కాపాడుటలోను, ఆమె చరిత్ర అద్భుతమైనది. అద్భుత ములు అనగా భూకంపాదులు:-

షడధ్వాతీత రూపిణీ (991) అధ్వలు = మార్గములు: రూప వృష్టి, నామ సృష్టి - ఈ రెండి ...

నాధ్వా, తత్త్వాధ్వా అనునవి రూపసంబంధములు:- వీటికినిమించినది ఆ రూపము:-

అవ్యాజ కరుణా మూర్తి: (992) ఆమె దయకు కారణము లేదు నిష్కారణముగా భక్తులకు దయను ప్రసాదించును. నిష్కారణ కరుణామూర్తి :- (993)

అజ్ఞానధ్వాంత దీపికా :- అజ్ఞానమనెడి చీకటికి దీపమువంటిదై దానిని పోగొట్టును: "తేషామేవానుకంపార్థం అహమజ్ఞానజం తమః నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥" (భ. గీ.) వారల ననుగ్రహించుటకై వారి అంతఃకరణము నందే యుంటున్నాను. ప్రకాశించుచున్న జ్ఞానమనుదీపముచే వారి అజ్ఞానజన్యమైన అంధకారమును నశింపజేయుచున్నాను.

ఆబాలగోపవిదితా :- (994) బాలగోపశబ్దము పామరపరముగా చెప్పినచో హరిహరాది పామరాంతము ప్రకాశించునది. ఆమె అందరకు తెలిసిన ఆత్మ స్వరూపిణి. స్కాందంలో " తమహం ప్రత్యయ వ్యాజ్యాత్ సర్వే జానంతి జంతవః" - అన్ని జంతువులు అతనిని "అహం" = నేను అని ఎరుగుచున్నారు.

సర్వానుల్లంఘ్యశాసనా :- (995) పై నామమునందు ఆమె అందరికి తెలిసినది. పరిచయస్తురాలు. "అతి పరిచయాదవజ్ఞా" = అతి పరిచయము వలన తిరస్కారము. అందుచే అందరిచే అనాదరింపబడునా? అను ప్రశ్నకు ఈ నామము సమాధానము. ఆమె శాసనమును బ్రహ్మ విష్ణ్వాదులు కూడా ధిక్కరించలేరు.

## యోగములు

" ధిగ్ ధిగ్ ధిగ్ చ తజ్జన్మ యో న పూజయేత్ శివా
జననం సర్వ జగతః కరుణా రస సాగరాం "

(సర్వ ప్రపంచమునకు తల్లియై కరుణాసముద్రయగు దేవిని పూజించని వాని జన్మము వృధా! వృధా! వృధా!

ఇంత వరకు శ్రీదేవియే పర బ్రహ్మ మనియు, ఆమెకు నిర్గుణ, సగుణ రూపములు రెండు విధములుగా నున్నవనియు. ఆమె ప్రతి యుగమందును దుష్ట శిక్షణార్థము శిష్ట రక్షణార్థము అనేకావతారముల నెత్తుననియు, ఆమె రూపములను వీక్షించి, కళ్యాణ గుణములను కీర్తించి వాగ్దేవతలు ఆ పరాశక్తినిపొందు ఉపాయములను, యోగములను వివరించుచున్నారు. ఇదంతయు వివరించుట జీవులకు మోక్షమును పొందించుటకు, ఇహపర సౌఖ్యములను ప్రసాదించుటకే.

స్వస్వరూపాను సంధానమునకే యోగములు :- స్వస్వరూపమును తెలుసుకొనక పోవుటయే చాలా నష్టము. అది కూడా ఈ జన్మమందే ఇప్పుడే తెలుసు కొనవలయును. దేవిని సాక్షాత్కరించుకొనుటకు, ఆత్మ సాక్షాత్కారమునకు ప్రతి సాధకుడు వాని వాని అభిరుచులను బట్టి ఒక్కొక్క యోగమును ఎన్నుకొనును. వాగ్దేవతలు అందుకనుకూలముగ, వివిధ యోగములను వివరించు చున్నారు. దీనిని అపరోక్షానుభూతి యని వేదాంతులు పేర్కొనుదురు. ప్రత్యక్షానుభూతి అనరు. ఎందుకననా ఒక్కొక్కసారి ప్రత్యక్షముగా యుండునదికూడ భ్రమ కారణమైయుండ వచ్చును. త్రాడును చూచి పాము అని భ్రమించినట్లు అపరోక్షము అనగా పరోక్షము కానిది. నిజస్వరూపమును అనుభవమునకు తెచ్చుకొనుట అపరోక్షానుభూతి. ఇపుడు వారు

విశదీకరించిన ఏ యోగము భక్తులు తమకనుకూలమో దానిని ఎన్నుకొని గమ్యమును చేరవలయును.

యోగినీ (653) : ఐక్య భావము ; పరమాత్మతో జీవాత్మను ఐక్యమొందజేయునది. ఐక్యభాగము నిచ్చునది. అటువంటి సామర్థ్యము యోగ్యత ఆమెకు మాత్రమే కలదు.

యోగదా ; (654) ; యోగము నిచ్చునది ! పరమాత్మతో జీవాత్మను లీనము చేయుటయే యోగము. మంత్రయోగము, లయ యోగము, హఠ యోగము, రాజ యోగము, భక్తి, జ్ఞాన, ధ్యాన యోగములను ఇచ్చునది. ఇవన్నియు మార్గములు:- వాటినిచ్చును

యోగ్యా ; (655) : అన్నింటికన్ననూ యోగ్యమయినది. మేలైనది. జ్ఞానేంద్రియాణి సర్వాణి నిగృహ్య మనసా సహ ఏకత్వభావనా యోగః, క్షేత్రజ్ఞ పరమాత్మనోః ;- మనస్సును జ్ఞానేంద్రియములను నిగ్రహించి జీవాత్మ పరమాత్మలను కలుపుటయే యోగము : (విష్ణు పురాణం : తం విద్యాత్ దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్" (భ.గీ. 6. 23) దుఃఖ సంయోగ వియోగమే యోగము: జీవునిస్వభావము ఆనందమే. కాని సంసారమున తగుల్కొని అజ్ఞానముచే ఆవరించ బడినందున దుఃఖము ననుభవించిః దుఃఖమే తన స్వభావమన్ని భ్రమపడుచున్నాడు. ఆ దుఃఖమును తొలగించినచో తన స్వభావమైనచో నిరతిశయానందమును పొందుచున్నాడు. అందుచేత దుఃఖ సంయోగమును వదిలించుకొనుటయే యోగమని భగవద్గీత చెప్పుచున్నది: పతంజలి యోగసూత్రములలో "యోగశ్చిత్తవృత్తినిరోధ చెప్పబడినది చిత్తవృత్తులను నిరోధించుటే యోగము. అది నాలుగు విధములు. మంత్ర, లయ, హఠ, రాజ యోగములు. రాజయోగము

మూడు విధములు: సాంఖ్య, తారక అమనస్క యోగములు: ఇవ న్నియూ దేవియే:-

యోగానందా: (656): యోగమనగా శివశక్తిసామరస్యము దానిచే ఆనందమును పొందుచున్నది. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" శివబ్రహ్మైక్యమును అఖండానందరూపిణి:- ఆమె ఆనంద ఘనమై లోకమందు యోగనిద్రగా యుండును.

భావనాగమ్యా: 113: దేవి షట్చక్రముల పైన, అనగా మూలాధారస్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, అజ్ఞాచక్రముల పైన వుండును. సహస్రార మందే చూడ నగును. షట్చక్రోపరి సంస్థిత: ఆమె సంశయ రహితమైన జ్ఞానైక రూపానందమున ఆసక్తి కలది. ఆమె మూలాధారమందు సర్పాకారముతో చుట్టుకొని తేజో రూపముతో వెలుగు కుండలిని. పంచదశాక్షరిలోని వాగ్భవ కూటమే కుండలిని. ఆమె సబితంతు తనీయసి: (111) తామరతూడులోని దారము వలె సూక్ష్మమైనది. ఇటువంటి రూపములుగల దేవిని ఎట్లు పొందగలము? భావవనల్లనేపొందగలము. యజ్ఞ, దాన, తపస్సు వల్ల పొందలేము. కేవలము మనస్సును నిష్క్రియమొనర్చి సమాధిలో పొందదగినది. ధ్యానము ఒక్కటేమార్గము. ఈ భావనరెండు విధములు. (1) శాబ్దీ భావన: (ధ్యానము) పైదికశబ్దములతో కూడినది. గురు శిష్య సంబంధముతో, శ్రవణ, మనన, నిధిధ్యాసాదులచే పొందదగినది. (2) ఆర్థీ భావన: (ధ్యానము) క్రియా రూపమైనది. కర్మ మార్గ విషయము:- పై రెంటివలన పొంద దగినది. నిష్కామ కర్మ యోగము, ఫలాసక్తిరహితమై, భగవదర్పణ బుద్ధితో చేయు కర్మవలన పొందవచ్చును:

భావజ్ఞా : (881) అందరి భావములను ముఖ్యముగా భక్తుల భావనను బాగుగా నెరుగును. ప్రతి ప్రాణికి షడ్విధ భావములు కలవు: అస్తి, జాయతే వర్ధతే – వుండుట, పుట్టుట, పెరుగుట – మార్పుచెందుట – క్షీణించుట – నశించుట, ఇవన్నియను పదార్థములే ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, సమవాయసములు :- ఇవి కూడా భావములే. (2) భవము = సంసారము, దానికి సంబంధించిన భావములు. (3) భవుడు = శివుడు, శివునికి సంబంధించిన విభూతులు, శైవ సిద్ధాంతములు: శివసూత్రములు- వాటికి సంబంధించిన తంత్రములు: భక్తి మున్నగు ఆరాధనలు, భావములు. వాటినికూడా ఆమె ఎరుగును., భా = కాంతి; వాం = పొందుట :- కాంతిని పొందుట: సూర్యుడు మొదలగు వారి కాంతులు కూడా ఆమె దయవలననే కలుగుచున్నవి. వీటిని ఎఱుగుట, వీటిని ధ్యానించుటచేత దేవిని పొందగలము :-

ధ్యానగమ్యా (641) ధ్యానముచేతపొందదగినది. తే ధ్యాన యోగానుగతా, అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" వారు ధ్యాన యోగము ననుసరించినవారై స్వగుణములచే నీతిరహస్యమున **దేవాత్మశక్తిని గాంచిరి.**

అంతర్ముఖ సమారాధ్యా (870): బహిర్ముఖసుదుర్లభా:- ఆత్మాభిముఖులైన చిత్తవృత్తిగలవారిచే లెప్పగా ఆరాధింపబడునది. బాహ్య విషయాభిముఖమైన చిత్తవృత్తి గలవారికి దొరుకునది కాదు. తరల కరణా నామ సులభే (సౌం. లహరి 95) :-

## ధ్యాన యోగము

యోగమనగా దుఃఖ సంయోగ వియోగము అని ఇంతకుపూర్వం

చెప్పితిమి? ఆ యోగమును అభ్యసించుటకు విధానమును చెప్పు చున్నాము :

సంకల్పం వల్ల కలిగే సకల వాంఛలను సంపూర్ణంగా విడిచిపెట్టి ఇంద్రియాలనన్నింటిని సమస్త విషయాలనుంచి మనస్సును మళ్ళించి బుద్ధి, ధైర్యంతో దేవి యొక్క నిర్గుణ, నిరాకార రూపముపై నెమ్మదిగా నిలిపి చిత్త శాంతిని పొందవలయును. అన్ని భూతములందు దేవిని, తనలో అన్ని భూతములను చూచేవాడికి ఆమెకు సాధకుడు లేకుండా పోడు. దేవికి వాడులేకుండా పోడు. ఈ ధ్యానయోగాన్ని సాధించదలచిన మునికి నిష్కామ కర్మయోగమార్గమే మంచిమార్గము దానికి మనస్సును స్వాధీన పరచుకోవాలి. శాస్త్ర జ్ఞానం వల్ల, అనుభవజ్ఞానం వల్ల సంతృప్తిని పొందుతూ మట్టినీ, రాతినీ, బంగారాన్ని సమదృష్టితో చూడగలిగియుండవలయును. శ్రేయోభిలాషి, స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు, విరోధి, బంధువు, సాధువు, దురాచారి, వీరందరి యందు సమబుద్ధి గలిగియుండవలయును. అతడు ఏకాంత స్థలంలో ఉంటూ, ఆశలను వదిలి, ఇంద్రియాలను మనస్సును వశపరుచుకొని, ఏమీ పరిగ్రహించకుండా చిత్తాన్ని దేవి యందే నిలపవలయును. ఎక్కువ ఎత్తు, పల్లము కాని పరిశుద్ధ ప్రదేశంలో దర్భలుపరచి, దానిమీద చర్మమును, దానిమీద వస్త్రము వేసి, స్థిరమైన ఆసనమునేర్పరుచుకొని, ఇంద్రియాలను మనస్సును స్వాధీన పరుచుకొని ఏకాగ్రచిత్తంతో ఆత్మశుద్ధి కోసం యోగాభ్యాసం చేయవలయును. ఏకాగ్ర చిత్తంతో ఆత్మశుద్ధి కోసం యోగాభ్యాసం చేయ: వలయును. ప్రశాంత చిత్తముతో, భయాన్ని విడిచి పెట్టి, బ్రహ్మ చర్య వ్రతాన్ని అవలంభించి, మనో నిగ్రహంతో, బుద్ధిని

దేవియందే లగ్నంచేసి, అమెయే సర్వమని ధ్యానించవలయును. అటువంటి ధ్యానయోగికి దేవి ఆధీనంలో యున్న మోక్ష ప్రదమైన శాంతిని పొందుచున్నాడు.

శోభనా సులభా గతిః (883) :- మోక్షమును పొందుటకు దేవియే సులభమైన మార్గము. ఆమెను ఆశ్రయించిన, ఆమెను శరణాగతి పొందినచో ఆమె మోక్షమును ప్రసాదించును. శుభ స్కరురాలు సులభముగ పొందదగినది. గతియు కూడి:- శోభనాగతిః సులభా గతి: లేక శోభనాయై నమః, సులభాయై నమః, గత్యై నమః లేక శోభనా ÷ అసులభా ÷ అగతిః అని కూడా చెప్ప వచ్చును. మోక్షాది పురుషార్థ స్వరూపిణీ కావున శోభన. సుఖముగ ఉపాసింపదగినది. కావున సులభ, పొందదగినది స్థానము. పొందదగినది ఫలము జ్ఞానము లేక ఉపాయము. "ఏషైవ సర్వభూతానాం గతీనాముత్తమాగతిః" (కూర్మపురాణం) = ఈ దేవియే పొంద దగిన గతులలో ఉత్తమాగతిః (462వ నామము శోభనా అనిగలదు. పునరుక్తి నివారణకై శోభనాగతిః, సులభాగతిః అని విభజించుట మేలు - కానీ ఈ నామమును ఒకే పదముగా గ్రహింపబడినది.

సుఖారాధ్యా (881) ఉపవాసాది క్లేశములు లేక, రూపనిర్బంధాదులు లేక ఆరాధించవచ్చును. పాపబుద్ధిలేని వారిచే సులభముగ ఆరాధించబడును.

పుణ్యలభ్యా : (543) పుణ్యములచే పొందవచ్చును. "పశ్యంతి పుణ్య పుంజా యే యే వేదాంతా స్తపస్వినః రాగిణో నైవ పశ్యంతి దేవీం భగవతీం శివాం" (దేవీభాగవతం-తృతీయస్కంధము) వేదాంతులు, తపోవంతులు, పుణ్యరాశులు దేవిని గాంచుచున్నారు. ఆశగల వారు, కామాసక్తులు దేవిని దర్శింపజాలరు.

మైత్రాది వాసనాలభ్యా (570) మంచి వారితో "మైత్రి"; దుఃఖములతో బాధపడినవారిని చూచి "కరుణ"; పుణ్య పురుషులందు "ముదిత" పాపులందు "ఉపేక్ష" = ఇవి నాలుగు వాసనలు. వీటిచే కూడ ముక్తిని పొంద గలము. (పతం: యోగ. సూ) మైత్రి కరుణా ముదితో పేక్షాణాం సుఖ దుఃఖ పుణ్య విషయాణాం భావనాతః చిత్త ప్రసాదనం" - సుఖదుఃఖ, పుణ్యవిషయములైన మైత్రి, కరుణ ముదిత, ఉపేక్షలను భావించుటచే - చిత్త ప్రసాదమగును. చిత్త ప్రసాదత్వముచే దుఃఖము తొలగి శాశ్వతానందము పొందును.

భక్తిప్రియా :- (118) భక్తి రెండువిధములు. (1) ముఖ్య భక్తి (2) గౌణ భక్తి "తత్ర ఈశ్వర విషయకో అనురాగాఖ్య చిత్త వృత్తి విశేషో ముఖ్యభక్తిః" ఈశ్వరునియందు అనురాగమనెడి మనోవ్యాపారమే ముఖ్య భక్తి. భక్తి మీమాంసా సూత్రము కూడా "సావరానురక్తిరీశ్వర ఇతి. అది ఈశ్వరునియందు శ్రేష్ఠమైన అనురక్తి: (2) గౌణభక్తి: సేవారూప భక్తిః :- గరుడపురాణం "భజ ఇత్యేషవై ధాతుః సేవాయాం పరికీర్తితః తస్మాత్సేవాబుధైః ప్రోక్తా భక్తి స్సాధన భూయసీ" భజయన క్రియాపదము సేవనుతెలుపును. కావున పండితులు భక్తిసాధనకు సేవయే గొప్పది అనిరి. దేవీభాగవతము తొమ్మది విధములైన భక్తులను తెలిపినది. శ్రవణం, కీర్తనం, స్మరణం, పాద సేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం :- అట్టి భక్తియందు దేవికి ప్రీతి మెండు.

## భక్తి యోగము

భక్తిమార్గమునకు వలసిన యోగ్యతలు వేదాంతులకువలె లేదు ఇది కఠినమార్గము కాదు. సర్వజనులకు సులభముగా యుండును

"అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ" ఇది అన్నింటి కన్ననూ సులభతరమైనది. పాతు కర్మజ్ఞాన యోగేభ్యోఽ వ్యధికతరా" కర్మ, జ్ఞాన, యోగముల మూడింటికన్నా చాలగొప్పది:- భక్తిమార్గమున అందరికీ అర్హత కలదు. ఎవరికినీ జాతి, కుల, వర్ణముల పేరుతో నిషేధములేదు. భగవదనుగ్రహమునందును, భగవదనుగ్రహమువలన జనన మరణరూపసంసారమునుండి ముక్తి కలుగుననెడి నిశ్చయమును ఈ రెండు మాత్రముండినచో చాలును. భక్తి యోగమునకు చదువులు పాండిత్యము పనిలేదు. నిరక్షర కుక్షితులకు, పరమపాపులకు కూడా పై రెండు లక్షణములున్నచో చాలును :-

ప్రతివ్యక్తికి వాని ఇష్టవస్తువునందు మొట్టమొదటనొకవిధమైన అనురంజనము కలుగును. అది క్రమముగాగాఢమై రాగరూపముగా మారును. అట్లు రాగము గాఢ రూపము దాల్చినపుడు మనస్సు తన్మయమగును. అట్టి మనో వృత్తిని భక్తియందురు. భగవద్ధర్మపరముగా మనోవృత్తిని మరలించినచో దాని బలమున హృదయము కరిగి, రసరూపమును పొంది ఎడతెరిపి లేని తైలధారవలె భగవంతుని వంకకు పయనించును. అదియే భక్తి. దానివలన మోక్షము లభించును. అటువంటి భక్తియందు ప్రీతిమెండు.:-

కృతకృత్యస్య తృప్తస్య మమ కిం క్రియతే నరైః, బహిరాభ్యంతరేవాపి మయా భావోహి గృహ్యత" (శివపురాణం):- తృప్తు కృతకృత్యులు నాకేమి చేయగలరు? కాని భక్తులు బహిర్గతము కాని. అంతర్గతముగా కాని చేయు సేవలను నేను గ్రహింతును.

భక్తిగమ్యా : (119) బాగుగ ఆరాధింపబడుటవలన ప్రత్య మగును. "భక్త్యాత్వనన్యయా శక్యమహమేవం విధోఽర్జున. జ్ఞాత

ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప"- (భ.గీ.) అర్జునా ! అనన్య భక్తిచేతనే ఇట్టి రూపముగల నేను తెలుసుకొనుటకును, ప్రవేశించుటకు శక్యుడగుచున్నాను. (చాం. ఉప: 2-23-2)లో "బ్రహ్మసంస్థో-మృతత్వమేతి:- (బ్రహ్మయందుండి అమృతత్వమును పొందును.

భక్తివశ్యా: (:20) భక్తికి కట్టుబడి పోతుంది :- 'శివే భక్తి పారతంత్ర్యం అస్మాషు" = ఓ శివా ! నీవుస్వతంత్రుడవైనను భక్తి చేపరతంత్రుడవే !":2 దేవికూడ భక్తవరాదినురాలు :-

భక్త చిత్త కేకి ఘనాఘనా (747) భక్తనిధిః (567) భక్తమానస హంసికా (372) భక్త హార్ద తమోభేద భానుమత్ భానుసంతతిః(404) భక్తిమత్కల్పలతికా (353) భక్తుల మనస్సు అను నెమళ్ళను సంతోష పరిచే మేఘము వంటిది:- భక్తుల మనస్సును ఘన = అమనా నిరంతరము ఉత్తేజ పరుచునది. భక్తులకు నిధివలె కోరికలన్నింటిని తీర్చునది. భక్తుల హృదయమందుండు అజ్ఞానములను నాశము చేయుటలో సూర్యకిరణముల వంటిది. భక్తుల మానససరోవరములో విహరించునది. భక్తుల అభీష్టములను తీర్చుటలో కల్పలత వంటిది

అందుచే దేవిని సులభముగా పొందుటకు భక్తియోగము చాల ముఖ్యమైనది.

## జ్ఞానయోగము

జ్ఞానగమ్యా :- (980) జ్ఞానముచేపొందదగినది. (జ్ఞానాదేవ తు కైవల్యం) జ్ఞానము వలననే కైవల్యం :-" వరమ పదమును పొందుటకు జ్ఞానయోగమే ఏకైక మార్గమని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.

జీవునకు శరీర పరిగ్రహణము వలన దుఃఖము కలుగుచున్నది
చేసిన పుణ్యపాప కర్మ ఫలముల ననుభవించుటచే శరీర ధారణ
గుచున్నది. రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ మోహ, మద
త్సర్యాదుల వలన కర్మలనుచేయుచున్నాము. రాగద్వేషాదులు
నము వలన కలుగుచున్నవి. అజ్ఞానమును జ్ఞానముచే
ట్టుకొనినచో దేహధారణ జరుగదు. దుఃఖముపోయి శాశ్వతానం
కలుగుతుంది. "జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం అచిరేణాధి
తి"

జ్ఞానమనగానేమో కొంచెము విచారించెదము:-

ప్రకృతి పురుషుల కలయికయే ప్రపంచము. ఈ ప్రపం
ఆత్మ. అనాత్మ, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, దృక్కు, దృశ్యము
యు ఏకమై అజ్ఞానికి కనబడుచున్నవి. వానినివిడదీయుటయే
ము. బియ్యము రాళ్ళు కలిసియున్నప్పుడు రాళ్ళని ఏరిపారే
, ఆత్మ అనాత్మలు కలిసి యున్న ఈ ఉపాధి యందు గానీ
ప్రపంచమందు గాని, వానిని విడదీసి, ఆత్మయందే నెలకొల్పి
యందు విరక్తి కలిగి యుండవలయును. ఇదియే జ్ఞానము
యి నుండి దేహిని వేఱుచేసి, దేహియే (క్షేత్రజ్ఞుడు) తానని
చి, దేహము (క్షేత్రము) నందాసక్తి విడువవలయును. "అస్తి
ప్రియము, నామ రూపములతో కూడి యున్న జగత్తులో,
టి మూటిని ఆశ్రయించి, తక్కిన రెంటినిపరిత్యజించవలయును
టి మూడున్ను సత్యములు - చివరి రెండున్ను అసత్యములు

దేహము (క్షేత్రము) అనగా పంచ మహాభూతములు, అహం
, బుద్ధి, అవ్యక్తము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు
ర్శ రూప రసగంధాదులైన విషయములు. ఇచ్ఛ ద్వేషము

సుఖము, దుఃఖము ఇంద్రియాది సమూహము, అంతఃకరణ వృత్తులు మున్నగునవి అన్నియు క్షేత్రము. వీనిని తెలుసుకొని ప్రజ్ఞారూప మైన చైతన్యమే. శక్తియే క్షేత్రజ్ఞుడు. విశ్వవ్యాప్తమైనచిచ్ఛక్తి ప్రతియొక్కని హృదయాంతరాళమందే వెలుగొందుచున్నాడు. సర్వ సాక్షియై, మనలోనే ప్రకాశించుచున్నాడు. పంచకోశముల లోపల ఉన్న పరమాత్మను, ఆ పంచకోశములనుండి వేరు చేసి చూపినచో అపరోక్షానుభూతి కలుగును. ఆ ఆత్మానుభూతియే జ్ఞానము యొక్క ఫలము. అదియే మోక్షము. కాబట్టి జ్ఞాన విచారణ జీవుని మహో న్నత ఆధ్యాత్మిక శిఖరములను కొనిపోయి, స్వస్వరూపాను భవము ద్వారా జీవుని దేవునిగచేసి పరమానందమును జీవన్ముక్తి ఇచటనే కలుగచేయునది జ్ఞానమార్గము. (జ్ఞానవాన్ మాం ప్రపద్యతే) జ్ఞాని నన్నే పొందుచున్నాడు. (భ. గీ.) న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే :- జ్ఞానముతో సమానమగు పవిత్ర వస్తువీ ప్రపంచ మున ఎచటను లేదు. (భ.గీ.):- జ్ఞాని సాక్షాత్తుగభగవంతుడే. ద్వైత సాధనలన్నియును క్రమక్రమముగ వికసించి అద్వైత స్థితిలోనికి కొని పోయి, భగవంతునికి భక్తునికి ఎటువంటిభేదములేని స్థితికి కొనిపోయి ఒకే సచ్చిదానంద ఘన రూపముతో ప్రకాశింప చేయుటే జ్ఞాన మార్గ లక్ష్యము. మన జీవితమును అమోఘమైన ఈ జ్ఞానస్థితిని పొందుటకు వినియోగించుకొనవలయును.

శ్రీవిద్య యొక్క లక్ష్యముకూడ నిదియే : ఈ అద్వైతానుభూ తిని కలిగించుటలో శ్రీవిద్యకు మించిన మరొక విద్యలేదు. దీనిని మేము శ్రీవిద్య, శ్రీచక్రము అనుఅధ్యాయములలో చర్చించగలము

మనోన్మని : (207) : త్రిపుటులు ధ్యాన, ధ్యాతృ, ధ్యేయ భావములు నశించినచో మిగులునట్టి జ్ఞానామృతమే దేవి : త్రిపురోప

నిషత్తులో "మనస్సు బంధరహితమైనపుడు, హృదయమునందు దృష్టి నిలిపినప్పును కలిగెడి స్థితియే ఉన్మని.

జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ :- (881) ఉన్మనీ స్థితిలో కలుగు అనుభవమును తెలుపుచున్నాడు. తెలియబడునది; తెలియబడుట-తెలుసుకొనబడు అంతయు ఒకటే అనే అపరోక్షానుభూతి కలుగుతుంది.

అజ్ఞానస్వరూపిణి దేవి :-

అభ్యాసాతిశయజ్ఞాతా :(890) - తీవ్రఅభ్యాసమువలనే పొందుటకుసాధ్యమగునది. "ఆమె అవయవములు జ్ఞానము; ఆమె శాస్త్రము ఆమె స్థానము హృదయము. అట్టి దేవిని తెలుసుకొనవలయునన్నచో చిరకాలానుష్ఠానము, ఆత్మైక్యముచే మాత్రమే సాధ్యము.

అనిత్యతృప్తా (815) :- భక్తి మాత్రము చేతనే - ఉపచారములచే తృప్తిపొందునది. పత్రం, పుష్పం, ఫలం, తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః" ఆకులు, పండ్లు, జలమునునాకెవ్వడు భక్తితోసమర్పించునో నేను వాటిని ప్రీతితో స్వీకరించెదను.

ముని మానసిక హంసికా :- (816) ఆమె ఎల్లప్పుడు మునుల మానస సరోవరంలో హంసవలె విహరించు చుండును. మౌనముగా దేవిని ధ్యానించుటవలన ఆమెను హృదయమందు నిలుపుకొనవచ్చును

మహాయాగ క్రమారాధ్యా : (230) శ్రీచక్రమండలి నివారణములలోయున్న బ్రాహ్మీ మొదలగు అరువది నాలుగు యోగినీ పూజలతో కూడినది మహాయాగము. దానిచే ఆరాధించబడునది.

ధ్యాన ధాతృ ధ్యేయరూపా (254) ధ్యై = చింతాయాం॥ అను ధాతువు నుండి పుట్టినది. చింత అనగా మనస్సంబంధమైన జ్ఞానము. "ప్రత్యయైకతానతా ధ్యానం" విశ్వాస స్వరూపత్వమే ధ్యానము. (పతంజలి: యో. సూ.) జ్ఞాన- జ్ఞాతృ జ్ఞేయ రూప మైన త్రిపుటికూడా దేవియే :- ఈ మూడున్నూ ఒకటే యనియు అది దేవియేఅనియు, తానుకూడ అదియే అనితెలుసుకొనుటే యోగము

నామ పారాయణ ప్రీతా : (732) : దేవికి నామ పారాయణను చేయువారియందు ప్రీతికలుగును. ఇదిదేవిఅనుగ్రహమును పొందు టకు చాలా సులభోపాయము.

స్తోత్రప్రియా (927) :- స్తోత్రముచే ప్రీతినొందును. స్తోత్ర మనగా లోక సంబంధమైన గుణములను అనువదించి కీర్తించుట:- అవి ఆరు విధములు: నమస్కారస్తథాశీశ్చ, సిద్ధాంతోక్తిః, పరా క్రమః - ప్రార్థనా చేతి షడ్విధం, స్తోత్ర లక్షణం"- ఈ ఆరు లక్ష ణములు శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రము నందు క్షుణ్ణంగా కలవు. ఈ ఆరు లక్షణములుగల స్తోత్రముచే దేవి తప్పక ప్రీతిచెంది తన అనుగ్రహమును ప్రసాదించును. (2) అంతే కాదు. మంత్రము లలో చెప్పబడిన దేవతల గుణములనుచ్చరించు వైదికసూక్తములు స్తుతుల చేతను కూడ ఆమెకు ప్రీతినొందును.

పంచయజ్ఞ ప్రియా : (946) పంచ యజ్ఞములు చేసి కూడ దేవి అనుగ్రహమునుపొందవచ్చును. యాగములు కూడ యోగమే పంచ యజ్ఞములు: (1) అగ్ని హోత్ర (2) ధర్మ పూర్ణ మాస (3) చాతుర్మాస్య (4) పశు (5) సోమ:- ఇవి పూర్తిగా వైదిక యజ్ఞములు.

వందారు జన వత్సలా (349) ఆ తల్లిని ఒక్కసారి నమస్కరించినను చాలును. అట్టి వానిని ఎంతో వాత్సల్యముతో చూచును.

పంచసంఖ్యోపచారిణి (950) గంధము, పుష్పము, ధూప, దీప నైవేద్యములను పంచోపచారములచే పూజించుటచేకూడ యోగమే :"

## యోగఫలములు

వివిధములైన యోగములచే దేవినిఆరాధించుట వలన మనకు కలుగు లాభము లేమి? వాటి ఫలము లెట్టివి అను విషయములను వాగ్దేవతలు ఈ నామములతో వివరించుచున్నాను.

సర్వాపద్వినివారిణీ : (913) :- దేవిని స్మరించుట: పూజించుట వలన, ఆమె ఎంతో దయతో మనసర్వాపదలను నిశ్శేషముగా తొలగించును.

అన్నదా (669) : వసుదా (670) ఆహారమునిచ్చి పోషించును వసు = ధనము, రత్నము : వీటిని ఇచ్చును. "సవా ఏష మహానజ ఆత్మాన్నాదో వసుదానో విందతే - వసు య ఏవం వేద "- పుట్టుక లేని ఈ ఆత్మ అన్నమును భాగ్యమును ఇచ్చును. దీనిని ఎరిగినవాడు అన్నమును ధనాదులను పొందును.

రాజ్య దాయినీ (692) స్వర్గ, వైకుంఠ, కైలాసాదిపత్యములను ప్రసాదించును.

సామ్రాజ్యదాయిని (68.) సామ్రాట్టు అనగా : రాజసూయ యాగముచేసినవారు. భూభర్త (మండలేశ్వరుడు) రాజులను శాసించువాడు: వారి భావము సామ్రాజ్యము- దానిని ప్రసాదించును.

ప్రియంకరి; (731) భక్తులకు ప్రియమును చేకూర్చును.

భవదావ సుధావృష్టిః: (742) సంసారమనెడుదావాగ్ని-అడవి మంట-ని శమింపచేయు అమృతవర్షము: సంసారమే అడవి-దానిని బాగుగ అభివృద్ధిచేయుటకు కూడ అమృతవర్షము వంటిది. సంసారాన్ని కూడ సుఖప్రదముగాగా చేయగల శక్తి ఆమెకు గలదు:

పాపారణ్యదవానలా: జీవునకు దుఃఖములనుకలిగించేవి పాపములు. అట్టిఅరణ్యముల వంటిపాపములకుదావాగ్నివంటిది. పాపములనెల్ల భస్మీ పటలము గావించును. బృహన్నారదీయంలో "గంగాయాః వరం నామ పాపారణ్య దవానలః భవ వ్యాధి హగీ గంగా తస్మాత్సేవ్యా ప్రయత్నతః" గంగ యొక్క శ్రేష్ఠమైన నామము పాపారణ్యమునకుదావాగ్ని. గంగ సంసారమనెడివ్యాధిని హరించును. అందుచేత యత్నముతో సాధింపవలెను. గంగకూడ దేవి రూపమే. దేవిని ధ్యానించినచో పాపములు కాలిపోవును.

దౌర్భాగ్యతూలవాతూలా: (744) :- సత్కర్మలు దేవినిపూజించుట- మున్నగువానిచే దౌర్భాగ్యము తొలగిపోవును. ఈ సత్కర్మల వల్ల అంతటి పాపరాశినికూడ (డ్డి పోచను పెనుగాలివలె దూరముగా విసరివేయును.

జరాధ్వాంత రవిప్రభా: (745) :- ముసలి తనము అనునది ఒక పెనుచీకటి; జీవితంలో అది ఒక దుర్దశ. దానిని పోగొట్టు సూర్య కాంతి వంటిది. వార్ధక్యాన్ని కూడ సుఖప్రదముగ చేయును.

భాగ్యాబ్ధి చంద్రికా: (746) భాగ్యము ఒక సముద్రము వంటిది. దానికి వెన్నెల వంటిది. దానిని ఉల్లాశ పరిచి చూప్పొంగించును.

రోగ పర్వత దంభోళిః (748) రోగములు కొండల వంటివి. అట్టి వాటికి దేవి వజ్రాయుధము వంటిది. దేవి సేవాపరాయణులను రోగములు చేరవు.

మృత్యుదారు కుఠారికా : (749) మృత్యువు సంభవించుటకు లోగడ 296వ నామమున అనాదినిధనాః చెప్పబడిన "వధలు" కట్టెల యితే వాటిని తెగనరుకుటకు దేవి గండ్రగొడ్డలి వంటిది.

ప్రాణదాః (783) పంచప్రాణములను ఇచ్చునది. కౌషీతకీ బ్రాహ్మణమునందు "ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మాం ఆయురమృతం ముపాస్వ" "నేనే ప్రాణము. నేనే ప్రజ్ఞ. నేనే ఆత్మ. నన్ను ఆయురమృతములగా సేవించి" :- వీటన్నింటిని భక్తులకు ఇచ్చును.

వాంఛితార్థ ప్రదాయినీ : (989) భక్తులకోరికలనిచ్చు స్వభావము కలది. భక్తుడై యుండి ఏమి కోరినను ఇచ్చుట ఆమె స్వభావము అది పరమలాభము.

భవరోగఘ్నీ : (842) సంసారరోగమును నాశము చేయును. రామాయణంలో "నాన్యం పశ్యామి భైషజ్యం అంతరేణ వృషధ్వజం" సంసార రోగమునకు వృషధ్వజుడు తప్ప వేరు ఔషధము కానను." భవునికి భవానికి భేధను లేదు. వారిరువురిలో ఎవరిని సేవించిననూ సంసారరోగము పోవును.

జన్మమృత్యుజరాతప్త జన విశ్రాంతి దాయినీ : (851) :- పుట్టుక, మరణము, ముసలి తనముచే తపించు జనుల దుఃఖముల తొలగించి ఆత్మసుఖమును ప్రసాదించి విశ్రాంతిని ఇచ్చును.

క్షిప్రప్రసాదిని (869) : దేవిని సేవించుటవలన, శీఘ్రముగా ం కరుణ లభించును.

సంసార పంక నిర్మగ్న సముద్ధరణ పండితా : (880) సంసార నే బురదలో కూరుకొని పోయి వున్న వారిని ఉద్ధరించి గట్టుమీదికి ర్చుటలో ఆమె పండితురాలు. కూర్మపురాణంలో " యే మనాగపి ర్వాణీం స్మరంతి శరణార్థినః దుస్తరాపార సంసారసాగరే నపతంతి " శరణార్థులై ఎవరు శర్వాణిని స్మరింతురో వారు దాటరాని అపార ంసారసాగరమున పడరు.

ధన ధాన్య వివర్ధనీ (886) ఈయోగములలో ఏ ఒక్క యోగ మను అభ్యసించినను వానికి ధన, ధాన్యములను (ఐహిక భోగము ను) పుష్కలముగా లభింపజేయును.

శర్మదా : (953) : ఐహికభోగములనేకాను సుఖమునుకూడ ప్రసాదిస్తుంది. భోగములు, సుఖము లేకపోతే లాభమేమి?

నిర్వాణ సుఖ దాయినీ (390) ఇంతఅని చెప్పరానంత మోక్ష మునిచ్చును. దేవిని నిరాకార, నిర్గుణపరబ్రహ్మముగా సేవించినను లేక సాకారసగుణమూర్తిగా ఎట్లు సేవించినను ముక్తినిపొందవచ్చును అయితే దేవినే శరను పొంద వలయును.

ముక్తిదా (736) మోక్షమునుఇచ్చునది. " తస్మాద్విముక్తి మన్విచ్ఛన్ పార్వతీం పరమేశ్వరీం ఆశ్రయే త్సర్వభూతానాం ఆత్మ భూతాం-శివాత్మికా" మోక్షమునుకోరువాడు సర్వభూతముల కాశ్రయ భూతమైన పరమేశ్వరినే ఆశ్రయింపవలెను." (కూర్మపురాణం)

"యేఽర్చయంతి పరాంశక్తిం విధినాఽవిధినాఽపి వానతే
సంసారిణో నూనంముక్తయేవ నసంశయః" ఎవరు పరాశక్తినివిధితో
గాని, అవిదితోగాని పూజింతురో వారు సంసారబాధల ననుభవింపక
ముక్తులగుదురు. ఎన్నో యోగములు కలవు. అవన్నియు శాస్త్ర
విహితములు. కాని శ్రమజీవులు విద్యాగంధములేనివారు తమ కులా
చారమని తమ పూర్వీకులు అనుసరించినపద్ధతిలో భక్తి ప్రధానముగా
అచంచల భక్తితో పూజించువానికికూడా మోక్షమునిచ్చును.

ముక్తిరూపిణి (737) మోక్షముఅమె స్వరూపము. ఆత్మస్వరూ
పమే పరాముక్తి. ఇది అవిద్యచే కప్పబడియుండను. ఈ యోగ
ములన్నియు ఆ అవిద్యను తొలగించుటకే ఏర్పడినవి. జ్ఞానము చే
శుద్ధ విద్యచే అది స్పష్టమై ఆత్మ సాక్షాత్కారము కలుగును. తత్త్వ
మసి, అహం బ్రహ్మాస్మి అనుఅత్మతాదాత్మ్యమే ముక్తి. అదికలుగును.

ముక్తి నిలయా (839) సాలోక్య, సామీప్య, సారూప్య,
సాయుజ్య, సార్ష్టి అను ఐదు విధములకు అమెయే నిలయము.
స్థానము ఆకారము కలది.

అనర్ఘ్య కైవల్య పదదాయినీ (926) అమూల్యము, అవరి
చ్ఛిన్నమైన ముక్తి రూపమైన కైవల్య పదము నిచ్చును. దీనిని
మించిన కైవల్యపదమే లేదు. అంతములేనిదా పదము.

మానవుని జీవిత పరమార్థ మదియే. కైవల్యపదమును అందు
కొని సచ్చిదానంద రూపమును పొందుటయే.

# శ్రీ విద్య

"శక్తిజ్ఞానం వినాదేవి నిర్వాణం నైవ జాయతే"

శక్తిజ్ఞానం లేక నిర్వాణము కలుగ నేరదు. ఆ జ్ఞానమును కలుగచేయునది శ్రీవిద్య. లలితా సహస్రనామములలో శ్రీదేవిని శ్రీవిద్యగానే గుర్తించినారు. శ్రీవిద్యయే శ్రీదేవి. (585) అవగా పంచదశీమంత్రస్వరూపము గలది. ఈ పంచదశీ శ్రీమాత యొక్క సూక్ష్మరూపము. ఇందు మూడు భాగములు కలవు. (1) వాగ్భవ కూటము :- అందు ఐదు బీజాక్షరములు కలవు. (క, ఏ, ఈ, ల, హ్రీం), ఇది ఆమె యొక్క ముఖకమలము. కన్నులు, పెదవులు, కంఠము, చెవులతో ఒప్పుచూ వాక్కుల యొక్క పుట్టుక గలదియే వాగ్భవకూటము. (శ్రీమద్వాగ్భవ కూటైకస్వరూపముఖపంకజా)(85) (2) కామరాజకూటము :- ఇది కంఠము నుండి నడుము వరకు గల భాగము మధ్యభాగము. ఇందు ఆరు బీజాక్షరములు కలవు. (హ, స, క, హ, ల, హ్రీం) (86) ఇది మధ్య కూటము. "కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ". (3) శక్తికూటము :- చరాచర జగత్తునందు గల శక్తి స్వరూపము. ఇది దేవి యొక్క నడుము క్రింది భాగము. ఇందు నాలుగు బీజాక్షరములు గలవు. (స, క, ల, హ్రీం) "శక్తి కూటైక తాపన్న కట్యధో భాగధారిణీ") (87) మూలమంత్రము యొక్క కూటత్రయమే స్థూల రూపముగా గలది. మూలమంత్రమవగా పంచదశాక్షరికి "శ్రీ" చేర్చినయెడల "షోడశాక్షరి"గా మారి దేవికి సూక్ష్మరూపమగును. (మూలమంత్రాత్మికా88) (89) "మూల కూటత్రయ కళేబరా :- ఇదియే మూల మంత్రము.

సంసారక్షయమొనర్చి ఆత్మసాక్షాత్కారము కలిగించునదే ఈమంత్రము అందుచేతనే దేవి త్రికూటా (588) అగుచున్నది. మోక్షము ఒసగు నట్టి జ్ఞానస్వరూపమే విద్య. (548) "విద్యా హి సా భగవతీ వర మూహి దేవి". "సైవ విద్యయే - శ్రీదేవియే విద్య.

ఈ విద్య రెండు విధములయినది.

"విద్యాంచా విద్యాంచ యస్తద్వేదో భయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే॥

విద్యయనగా స్వాత్మరూపజ్ఞానము. అవిద్య యనగా చరమ వృత్తిరూపజ్ఞానము. అనగా ఆత్మనెరుగుటకు ముందు వుండే ద్వైత భావము.

"విద్యా విద్యేతి దేవ్యా ద్వేరూపే జానీ హి పార్థివ
ఏకయాముచ్యతే జన్తుః అన్యయా బధ్యతే పునః"

"ఓ రాజా! విద్య, అవిద్య దేవియొక్క రెండు రూపములని తెలిసికొనుము. విద్యచేజంతువులు (మానవులు) ముక్తులగుచున్నారు అవిద్యచే కట్టుబడుచున్నారు. అందుచే దేవి విద్య అవిద్య యన బడు పరమాత్మ స్వరూపములుగలది. (402) "విద్యావిద్య స్వరూపిణి".

శ్రీదేవి 'కామసేవితా' (586) శ్రీవిద్య నుపాసించిన వారిలో మన్మధుడు ముఖ్యుడు.

## పంచదశీ మంత్రార్థము

"క, ఏ, ఈ, ల, హ్రీం"; "హ, స, క, హ, ల, హ్రీం"
"స, క, ల, హ్రీం"

ప్రథమ కూటము :- " క, ఏ, ఈ, ల, హ్రీం "

క = పరోక్షమగు బ్రహ్మము. ఏ = దానికి ఆత్మయై అవిభాజ్యమైన చైతన్య ప్రకాశ రూపమైన ఆత్మ. ఈ = అపరోక్షముగా, కార్యాత్మకముగా అగ్నియందు దాహకశక్తివలెనుండు బ్రహ్మ, ఆత్మలయొక్క సమ్మేళనమైన ఏక రూపము. ల = క్రియా రూపమును పొంది ఆనందమనే బ్రహ్మమందు లయము గాంచినది. ముప్పది యారు తత్త్వ సమ్మేళనములతో కూడిన ప్రకృతి. (ప్రపంచము) హ్రీం = బ్రహ్మ + ఆత్మ = సత్, స్వరూపము. వీటియొక్క ఐక్యానుసంధానురూపమైన ప్రకాశ, విమర్శల మిశ్రమ బిందువు.

ద్వితీయ కూటము :- " హ, స, క, హ, ల, హ్రీం "

హ = బ్రహ్మము; స = ఆత్మ: క = అపరోక్ష బ్రహ్మము హ = కారణాత్మక బ్రహ్మము: ల = ఇది బ్రహ్మను, ఆత్మను క్రియా రూపము ద్వారా లయింపచేయుచున్నది: హ్రీం = బ్రహ్మానందానుభవమును పొందించునది.

తృతీయ కూటము :- " స, క, ల, హ్రీం "

స = ఆత్మ: సకలము = అంతయు బ్రహ్మమే అదినాకన్న అన్యముకాదు. బ్రహ్మైవాహమస్మి: హ్రీం = ఈ సకలమునకు ఆధారభూతమైనది. అనగా "నేనేసర్వవ్యాప్తస్వరూప బ్రహ్మమును" ఇదియే మంత్రార్థము. ఈ మంత్రమునకు భాస్కరరాయులువారు పదునైదు అర్థములను ఇచ్చియున్నారు. కాని మరొక అర్థమును

మహావాక్యములలోని "తత్త్వమసి" అర్థమునుతెలుపుచున్నాము "క, ఏ, ఈ, ల. హ్రీం" = ఓపరమాత్మా ! నేను నీవై యుండియు అవిద్యవలన నీకంటె నేనుభిన్నుడను అను భేధబుద్ధినికలిగియున్నాను అట్టి భేధబుద్ధిని నిర్మూలింపుము. త్వం = "హ, స, క, హ, ల, హ్రీం" పైన చెప్పినట్లు భేధ బుద్ధి నశించినంతనే నేను పర బ్రహ్మమునగు చున్నాను. అను బ్రహ్మ భావము కలుగును. ఇది 'తత్పదమును సూచించును. 'స, క. ల, హ్రీం' = అఖండాకార వృత్తిని నన్ను పొందనిమ్ము. దీనిని "అసి" పదమును తెలుపును.

ఈ మంత్రమునందలి 'క' లు మూడు, 'హ'లు రెండు కలవు. ఇవి శక్తివర్ణములు. "ఏ, ఈ, ల, స" ఈనాల్గున్నూ, శివవర్ణములు 'హ్రీం'లు మూడు. ఇవి ఉభయాత్మకము. హ్రీం = హ = సృష్టి: ర = స్థితి, ఈ = లయము: ం = బిందువు. ఈ సృష్టి, స్థితి, లయ ములను మూటిని అధికారములోనుంచునది. (301)

శ్రీవిద్యలో అతిముఖ్యమైనది "బాలత్రిపురసుందరీ మంత్రము దీనినే "గుప్తగాయత్రి" అందురు. "ఐం, క్లీం, సౌః" ఈ మూడున్నూ, క్రమముగా పంచదశిలని మూడు కూటములుగా వున్నవి. ఇందు "అహం బ్రహ్మాస్మి" అను మహా వాక్యార్థము తలదు. దీనినే "సౌః, క్లీం, ఐం" అనినచో "బ్రహ్మైవాహమస్మి" అగుచున్నది.

కేవలా (623) : క్లీంకారమందలి కకార, లకారములు తొలగించినచో కేవలము "ఈం" కారము మాత్రమే మిగులును.

క్లీంకారి (622) కామ బీజస్వరూపిణి

ఏవం విభాగమజ్ఞాత్వా శ్రీవిద్యా జపశీలినః
నతేషాం సిద్ధిదావిద్యా కల్పకోటి శతైరపి " ॥

ఈ పంచదశీమంత్రములోని బీజాక్షరములయొక్క వివరము తెలియకనే ఈ మంత్రమును ఏవరైనా జపించినచో, వాడు కల్ప కోటి శతములు శ్రమించినను సిద్ధి పొందలేడు.
(711 = సాధు: 712 = ఈః 713 = గురుమండలరూపిణిః
714 = కుళోత్తీర్ణా)

## శ్రీ వి ద్యో పా య ము లు

శ్రీవిద్యను అనగా శ్రీమాతను పొందుటకు వామము, కౌళము, సమయము, దక్షిణము అను నాలుగు సాంప్రదాయములుగా విభజించి చెప్పబడియున్నవి. లలితా సహస్రనామము అందు (90) కుళామృతైక రసికా = కులమనగా త్రిపుటి. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత. ఈ మూడు నశించిన పిదవ కలుగు నటుకంటి నిశ్శేషమైన ఆనందమే జ్ఞానానందము. (త్రిపుటులు వుండువరకు కలుగునట్టి ఆనందము "బింబానందము." అందు కుళ మార్గ మనగా వామ, దక్షిణ మార్గములు అని అర్థము. (91) కులసంకేతపాలినీ = ఇచ్చట కులమనగా శ్రీవిద్యోపాసనకు వుపయోగపడే పూజా ద్రవ్యములన్ని జ్ఞానమయములు: ఆ పూజలను తెలుపు శాస్త్రములు కులములు. ఆ పరాశక్తియే. (92) కులాంగనా = మిగత కులములన్నియు (శాస్త్రములు) వేశ్యల వంటివి. శ్రీవిద్య మాత్రము పతివ్రత వంటిది. "అన్యాస్తు సకలా విద్యాః ప్రకటాగణికా యివ, ఇయంతు శాంభవీ విద్యా కులవధూరివ." అంతేగాక దేవి కులాంతస్థా (93) = ఈమె ఈ కుల శాస్త్రములందు నిక్షేపింపబడినది. శ్రీదేవికౌళినీ(94) = ఈమె అన్ని కులముల వారిచే, అన్ని దేశములందు, అన్ని దేహములందు పూజింపబడుచున్నది.

" కులం శక్తిరితి ప్రోక్తమకులం శివముచ్యతే
కులాకులత్వ సంబంధః కౌళమిత్యభిధీయతే ॥ "

కుళమనగా శక్తి. అకుళ మనగా శివుడు. వీరి సంబంధమే అనగా శివశక్తి సారూప్యమే కౌళము. అందుచే దేవి కౌళిని. కుళ యోగినీ. ఆమె (96) అకుళకూడ = శుద్ధ జ్ఞానస్వరూపిణిగా సమయ మార్గులచే పూజింపబడునది. వరాశక్తి సమయాంతస్థా (97) సమయాచార తత్పరా (98) : కౌళ మార్గ తత్పర సేవితా (441) : కుల రూపిణీ (897) : దక్షిణా దక్షిణా రాధ్యా (923) = దక్షిణ మార్గముచే గాని, వామ మార్గముచే గాని అనగా నిష్కామ కర్మ యోగులచే గాని. జ్ఞానులచేగాని పూజింపబడునది. కౌళినీ కేవలా (925) = కౌలులు ఆమెను కేవలగా పూజించెదరు. సంప్రదాయేశ్వరీ (710) = పంచదశీ మంత్రమునకధి దేవత.

పైన దహరింప బడిన వివిధ నామములచే దేవి ఆరాధనము మొదట చెప్పిన నాలుగు మార్గములలో సాధించవలెను.

## కౌ ళ మా ర్గ ము

కులాచారం వినా దేవి కలౌ సిద్ధిర్న జాయతే
తస్మాత్ సర్వప్రయత్నేన సాధయేత్ కులసాధకః ॥

ఈ కలియుగమున కులాచారమునగాక సిద్ధిజనింపదు: అందుచే సర్వ ప్రయత్నములచే కులసాధనములను సాధింపవలయును.

కులాచారేణ దేవేశి బ్రహ్మజ్ఞానం ప్రజాయతే
బ్రహ్మజ్ఞానయుతో మర్త్యో జీవన్ముక్తో న సంశయః ॥

దేవీ! కులాచారము చేతనే బ్రహ్మజ్ఞానం కలుగును. అట్టివాడే జీవన్ముక్తుడు సుమా! అంతియగాక పరమశివుడు ఈ విధానమును ఇంకను పొగడుచున్నాడు.

సత్యం బ్రవీమి తే దేవి హృది కృత్వావధారయ
సర్వధర్మోత్తమాత్ కౌళాత్ పరోధర్మో నవిద్యతే ॥

దేవీ! నీకు యదార్థమును చెప్పుచున్నాను. బాగుగావినుము సర్వధర్మములకంటె "కౌళము" వుత్తమమైనది. ఈశ్రీవిద్య మనువు చంద్రుడు, కుబేరుడు: లోపాముద్ర. మన్మథుడు, అగస్త్యుడు, అగ్ని, సూర్యుడు, ఇంద్రుడు, స్కంధుడు, శివుడు, దూర్వాసుడు అను ఈ పంద్రెడుగురు శ్రీవిద్యోపాసకులై పన్నెండు శాక్త విధానములను ప్రవేశపెట్టినట్లు జ్ఞానార్ణవము తెలుపుచున్నది.

ఈ పన్నెండు విద్యలున్నూ, కాది విద్య, హాది విద్యలుగా రెండు విధములు. హాదివిద్యలో యమము. నియమము మొగలగు రాజ యోగ అష్టాంగములు నిర్దేశింపబడినవి. కాది విద్యలో అవి లేవు వారి వారి ప్రవృత్తిననుసరించి ధర్మాచరణమునందు స్వేచ్ఛగలదు హాదివిద్యను లోపాముద్ర మున్నగువారు అనుసరించిరి. చంద్ర. ఇంద్ర, కుబేరాదులు కాదివిద్యను అనుసరించిరి. " సైషా శాంభవీ విద్యా కాదివిద్యేతి వా, హాదివిద్యేతి వా, సాది విద్యేతి వా, రహస్యం అని. బహ్వృచోపనిషత్తు చెవుతుంది వీటిలో కాది విద్య సులభము ఇది సర్వ విద్యలకు పరావిద్య. ఇదియే సమయాచారము.

## స మ యా చా ర ము

సమయమునగా హృదయాకాశమున శ్రీదేవిని శ్రీచక్రముగా భావించి అర్చించుట. సమయ మతమునకు దక్షిణామూర్తి ఋషి.

కామేశ్వరీ కామేశ్వరులు అధిదేవతలు. శ్రీచక్రమునందుగల శక్తి చక్రములకును శివ చక్రములకును ఐక్యమును సాధించి, ఆ చక్రములకును తన లోని మూలాధారాది షట్చక్రములకు ఐక్యమును భావించి, భావనోపనిషత్తులో ప్రతిపాదించిన విధముగా అంతర్యాగముగా పించుచు శివతత్త్వ ప్రధానముగా సహస్రార మందు ఆత్మను లయమొనర్చుట సమయమతము. దీనివలన శక్తులకు, సాధకునికి చతుర్విధైక, షడ్విధైక అనుసంధానము కలుగును. గౌడపాదికారికలో, "తవాజ్ఞాయాం విద్యున్నయతి నియుతాఖ్యాక్షరమయీ, స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంథిమభినత్ తతోగత్వా జ్యోత్స్నామయ సమయ లోకం, సమయయా, పరాఖ్యః సాదాఖ్యా, జయతి, శివ తత్త్వేన మిళితా." (పి. 130) శివ శక్తుల ఐక్యమును గాఢముగా నమ్మి క్రమ విధానమున ఉపాసనచేతను, తపస్సు చేతను, కుండలినీశక్తిని జాగృతము చేయుటే సమయాచారము. ఇది పూర్ణముగా పరిశుద్ధము. కేవలము అంతరము. అందు వలననే దేవి అంతర్ముఖ సమారాధ్యా (870) ఇది ఎక్కువగా జ్ఞాన యోగ పరము. మానసిక పరిణామమునకు ఆధ్యాత్మిక ప్రయోజనమున కొరకే గాక మోక్షమునకు ఏకైక మార్గము. దీనికి దక్షిణాచారమనియు పేరు గలదు. దక్షిణాదక్షిణారాధ్యా (923) అందుచేత దీనిని శుద్ధవిద్య అందురు.

## వామాచారము, దక్షిణాచారము

షోడివిద్యయను రెండవదానిని గూర్చి వివరించెదము. ఇందు కర్మకాండ మెక్కువగా నుండును. ఎక్కువగా బాహ్యపూజ గలది. ఐహిక సుఖముల నపేక్షించువారు దీనిని సాధనగా ప్రయోగించెదరు

దక్షిణాచారమందు పరబ్రహ్మము శ్రీమాతగా పూజింపబడును. ఇ
మోక్షప్రదము. వామాచారులుకూడ మోక్షమును పొందెదరు. కా
వారిది క్రమముక్తి. ఐహికభోగములు, సుఖానుభవమువలన వా
వాసనలు నశించుటకు కొన్ని జన్మలెత్తుట అవసర మగును. సద
చార సంప్రదాయమునను సరించువారు దక్షిణాచారముననే దేవినిఉపా
సించెదరు. రెండును మంచివే. "అర్చనం ద్వివిధం ప్రో
వామదక్షిణ భేదతః, వామేన వా దక్షిణేన పూజనంతు యథా రుచి
కానీ దక్షిణ మార్గము సత్త్వ గుణ ప్రధాన మైనది. వామాచారవ
రజోగుణ ప్రధానమైనది.

వామాచారమే "కౌళ" పద్ధతిగ వాడబడుచున్నది. కులమన
సంప్రదాయము. ఇది శిష్టాచారమే అనియు కీర్తింపబడుచున్న
ఇది గురు పరంపరానుగతము. గణపతి, రుద్రుడు, విష్ణువు, సూ
బ్రహ్మదేవతలు వామాచారపరులు. "వామ మార్గ ప్రకారేణ సర్వ
సర్వం సిద్ధ్యతి నాన్యథా." వామ మార్గ ప్రకారమున అన్నియ
సిద్ధించును. దక్షిణాచారమునకు వ్యతిరేకమైనదిగాన వామమనియ
అది నిషిద్ధమనియు కొందరు వాదించెదరు. వామాచారములో
"మ" కార పంచకము స్త్రీ మొదలగు విషయవాంఛలయందు వై
గ్యమును అభివృద్ధిపరచుకొనుటకేయని గుర్తింపవలయును. అం
నను సాధకుల సంస్కారలోపము వలన "మ" కార పంచకమున
మద్యము, మాంసము, మత్స్యము, ముద్రమైథునములను వి
తార్థములను భావించుకొని జుగుప్సాకరమైన తంత్రపద్ధతులనవ
భించి, శ్రీవిద్యను క్షుద్రవిద్యగా ముద్రపడునట్లు చేసిరి. వా

దేవతల జాతరలు, కొలుపులు, బలులు మున్నగు పామరుల తామ
సిక పూజాపద్ధతుల విధానమును ఖండించితి.

## శక్తి ఉపాసన - త్రివిధములు

సాధకు లందరూ కేవల సత్త్వ గుణ ప్రధానులు కారు. రజ
స్తమో గుణములు కలవారుకూడా కలరు. శాక్తముగలవారికి త్రివిధ
సాధనా పద్ధతులను నిర్దేశించినది. తమోగుణము అధికము కలవార
ధ్యాన, యోగములకు పనికిరారు. అదే సత్త్వ గుణము గలవార
బాహ్యపూజలకు పూనుకొనరు. వారిది జ్ఞానమార్గము.

శాక్తము పశుభావము- వీరభావము, దివ్యభావము అని త్రి
విధములు. (1) పశుభావము :- ఈ భావముతో దేవిని ఆరాధించ
సాధకుడు విషయసుఖములకు దూరముగావుండుటవలన వైరాగ్యమ
కలుగునని భావించును. సాధకులలో అధికశాతము ఈకోవలోనివా
వారు యాంత్రికముగా పూజలు చేయుదురు. వీలయినంతవర
సత్యము, అహింస, దయ వంటివి కలిగి యుందురు. కానీ పరీక్ష
సమయములందు నిబ్బరమునుకోల్పోయి, పతనమైపోగలరు. ఇట
వంటి వారు భారత, భాగవత పురాణేతిహాసములలో ఎందరో కలర
కానీ పడుతూ లేస్తూ ఎప్పటికో ఎన్ని జన్మలకో గమ్యాన్ని చేరు
గలరు.

(2) వీరభావము :- వీరారాధ్యా (777) రజోగుణ ప్రధాన
లయిన శాక్తేయులు అనుసరించుపద్ధతి. వీరికి ధైర్యస్థైర్యము
ఎక్కువ. మన దృష్టిలో వారి ఆచార వ్యవహారములు దారణవ

భక్తుడు కన్నప్పను తీసుకొన వచ్చును, అతని పూజా విధానము ఆచార రహితమైనది. అతని దృష్టి గమ్యము నందు మాత్రమే. అతడు తను పూజించుటకు సృష్టిలోని ప్రతి వస్తువును వుపయోగించుకోగలడు. వస్తువుల మంచి చెడ్డలను నిర్దేశించునది మనస్సే కదా! ప్రకృతిలో నుండున దంతయు జడశక్తి (418), జడాత్మికా (418) చిచ్ఛక్తి (416) చేతనారూపా (417) అంతయు దేవియొక్క విభూతులేనని అతని నమ్మకము. ప్రకృతి సహాయముతోనే ప్రకృతిని జయించును. ముల్లును ముల్లుతోనే తీసి రెంటినీ పారవేయును. ఏ విషయములయితే మానవుని అధోమార్గమున త్రిప్పునో వాటినే వుపయోగించి ఊర్ధ్వ మార్గమున పయనించుట వామాచార సాధన లోని ముఖ్యోద్దేశము. ఏ పాశములయితే నిన్ను బంధించుచున్నవో ఆ తత్త్వముల రూపాంతర మొనరించి, వానినే ముక్తి సాధనములుగ మార్చుకొనవలయును. మంచి చెడుగులనికాక ఈరెంటిలోను వున్న దివ్యత్వమును దర్శించి, వాటిని తన సాధనకు పయోగించుకొనును. దీనిని శాక్త తంత్రములన్నియు ఆమోదించినవి. మనబోటి సామాన్యులకు ఘోరముగా, భయంకరముగా వుండవచ్చును.

ఆమె నిర్వాణసుఖదాయిని: ఆమె అన్నదా (668): వసుదా (670): త్రివర్గదాయిని (760). వీటితో తృప్తి పడి తనలక్ష్యమును మరచినవారిని తీవ్రముగా శిక్షించగలదు. సర్వానుల్లంఘ్య శాసనా (995) ఈ ఐశ్వర్యములతో, ఈ సంపదలతో విర్రవీగి భ్రష్టుడైన వానికి దుష్టదూరా (993) వీరికి దూరముగా వుండగలదు.

## దివ్య భావము

మొదట పశుభావసంబంధ సాధనలలో ఉత్తీర్ణుడై తర్వాత వీర భావముచే సర్వేంద్రియ జయము: సర్వ ఐహికభోగములను, విషయసుఖములనుజయించి ఆత్మవిశ్వాసముతో ముందుకుసాగు సాధకుడే ఈ దివ్య భావమునకు అర్హుడు. లలిత షడధ్వాతీత రూపిణి (991) వర్ణ, పద, మంత్రములనెడు నామరూపాత్మక జగత్తును: కల,తత్త్వ భువనము లనబడు రూపాత్మక జగత్తును అను ఆరు మార్గములను దాటి— లేక శివ, విష్ణు, దుర్గ, సూర్య, గణపతి, ఇంద్ర మంత్రము లచే (షణ్మతములచే) పవిత్రమైన మనస్సు గలవానికి దేవిజ్ఞానము కలుగునని భాస్కర రాయుల భాష్యము. అప్పుడ తనికి అపరోక్ష జ్ఞానము కలుగును. ఇతడు సాక్షాద్దేవియె యగు చున్నాడు. అప్త కాముడు, మేరునగ గంభీరుడు, జీవన్ముక్తుడు ఇతడే.

ఇంతకు ముందు మనము వేద, వైష్ణవ, శైవ, దక్షిణ, వామ సిద్ధాంత, కౌలాచారము లు సప్తభూమికలని కులార్ణవతంత్రము ప్రస్తా పించిన దానిని తెలిపియున్నాము. సాధకుడు క్రమముగా ఈసప్త భూమికలలో అభివృద్ధిని పొంది, బ్రహ్మస్థితిని పొందును. మొదటి మూడు అనగా వేద, వైష్ణవ, శైవములు పశు భావమునకు, దక్షిణ వామాచారములు వీరభావమునకు, సిద్ధాంత కౌలములు దివ్యభావము నకు చెందును. పశు, వీర భావములతో సాధన చేయి వారికి గురువు యొక్క సేవ, ఉపదేశము, శిక్షణ అత్యంత ప్రధానము. లేనిచో అతనికి పతనము తథ్యము, సిద్ధాంత కౌలము లందు గురువుతో పనిలేదు.

ఈ ఏడు సప్త జ్ఞాన భూమికలుగా వ్యవహరింపబడుచున్నవి.

1) సుఖేచ్ఛ : మూఢునిగా వున్నాను. శాస్త్రముచేతను, సజ్జనుల వలననుసు, బ్రహ్మమునుతెలుసుకొని దానిని ప్రత్యక్షముగావించుకొనవలెను. ఈ ప్రపంచము అశాశ్వతము. దీని యందు నాకు రాగము లేదు. అనే బుద్ధి సుఖేచ్ఛ.

2) విచారము : వైరాగ్యాభ్యాసములు కలిగి సజ్జనుల, సద్గురువుల సంపర్కముచే శాస్త్ర పఠనము వలన ఆత్మానాత్మ విచారణ చేయుటయే విచారము.

3) తనుమానసీ : వైరాగ్యము విచారణ వలన ఇంద్రియ విషయములందు విరక్తి కలిగి మనోవృత్తి కలుగుటయే తనుమానసీ అనబడును.

4) సత్వాపత్తి : పైన చెప్పిన భూమికా త్రయము నభ్యసించుట చేత చిత్తము విశ్రాంతి చెందును, అపుడు సద్వస్తువు యొక్క ఆత్మరూపము యొక్క రూఢి అయిన జ్ఞానమును పొందును. అది సత్వాపత్తి.

సంసక్తినామిక : ఈ జ్ఞానము వలన ఇంకొక ఫలమున్నదని వెనుకటి స్థానబలమున తానే ఆత్మస్వరూపుడననే రూఢి జ్ఞానము కలుగుట సంసక్తి అని పిలిపించుకొనును. సకల సంశయములు వదలి పోవును. ద్వైత బావము నశించును. "అహం బ్రహ్మాస్మి" నేనే బ్రహ్మ స్వరూపుడనను జ్ఞానము కలుగుట వలన మరొక ఫలమును కోరుటకు అస్కారమే లేదు. అమృతత్వసిద్ధియే ఈ భూమిక యొక్క ఫలము. ఈ బ్రహ్మ వస్తువునకు జనన మరణాదులు లేవు. దీనికి మాయ సంబంధమెంతమాత్రమును లేదు.

6) పదార్థ భావన : ఇంతకుముందు చెప్పిన పంచదశల వ
కలిగిన జ్ఞానముచే బ్రహ్మ స్వరూపమయిన ఆత్మయందు విశ్రాం
రూఢిగాపొంది బాహ్యాభ్యంతరములలోని పదార్థములను స్మరించ
ఇతరులచే బోధించబడినప్పుడు మాత్రమే వ్యవహారజ్ఞానము కలుగ
పదార్థభావన యనబడును. బాహ్య వస్తువులైన పంచభూతాదుల
అంతరములైన ఇంద్రియాదులన్నియు బ్రహ్మవస్తువునందు లీన
అగుచున్నవి. మనస్సు వృత్తి శూన్యమైనది. దేహధారణ కొర
పరులచే గుర్తింపు చేయబడినప్పుడు మాత్రమే వీరికి లోకజ్ఞాన
కలుగుచున్నది.

7) తుర్యగా : ఈ అవస్థలో ప్రపంచజ్ఞానమే వుండదు.
తయూ బ్రహ్మమే. దానితో తాదాత్మ్యము చెందియుండును. అది
బ్రహ్మానందము. దీనిని తురీయ ప్రాప్తి అనెదరు. దీనిలో
పడియుండుటె తురీయాతీతఅవస్థ. ఇది జీవన్ముక్తస్థితి. దేహ
తాననుభావము వీడుటయే విదేహముక్తి.

దేవ్యుపాసనలో ఈ సాధననాలా ముఖ్యమైనది. జీవునికి
దేవతకూ తాదాత్మ్యమును పొందించునది శ్రీవిద్య మొదట ఎం
కష్టమనిపించిననూ, తుదకు అతి సులభము.

## దేవీపూజ

దేవీపూజ బాహ్యమనియు, అంతరమనియు రెండు విధము
ఈ రెంటియందును ఉపాసకునకు పరాశక్తియగు దేవితతో ఐకా
నుసంధానమే లక్ష్యము.

"అహం దేవీ నచాన్యోస్మి బ్రహ్మైవాహం నచశోక భాక్
సచ్చిదానందరూపోహం నిత్యముక్త స్వభావవాన్ ॥"

"నేనే దేవిని. అన్యమును కాను. నేనే బ్రహ్మమును. నాకు శోకములేదు. నేను సచ్చిదానందరూపుడను. నిత్యముక్తుడను"- అని ప్రతిక్షణము భావనచేయుచుండవలయును. మన మతములోని ప్రత్యేకత ఏమనగా ఉపాసకుడు ఆ పరబ్రహ్మ శక్తిని ఏరూపముగా నయినను అనగా లలిత, కామాక్షి, దుర్గ, చండీ, శారదగా ఆరాధించ వచ్చును. అది సాధకునియొక్క గుణములనుబట్టి. క్రియలనుబట్టి యుండును. సాధకుడు ఆ మూర్తియొక్క విగ్రహమును గాని, పటమును గాని, యంత్రమును గాని ముందుంచుకొని, ఆ దేవిని పరబ్రహ్మముగనే భావించి ధ్యానింపవలయును. చిత్తమును దేవిపైననే యుంచవలయును. అర్చనతోను, షోడశోపచారములచేతను. జపము, ధ్యానము, స్తోత్రాదులచే ఆదేవినిస్మరించుచుండవలయును ఈ విధముగా ధ్యానతీవ్రత పెరిగేకొలదీ ఆదేవిమూర్తి తానేకాగలడు.

పూజావిధానములో మొట్టమొదట బాహ్యపూజ చేయవలయును విగ్రహమునందో, యంత్రమునందో దేవిమూర్తిని భావించి అర్చనాదులు చేయవలయును. మన ఇంద్రియ నిగ్రహమునకు, ప్రకృతిని జయించుటకు ఈ పూజ చేయవలయును. ఈ షోడశోపచారములతోచేయుపూజయందు, కండ్లు, చేతులు, వాక్కు, చెవులు, మనస్సు మున్నగు ఇంద్రియములన్నియు సమన్వయపూర్వక ఏకాగ్రతను సాధించుచుండును. దేవిని పూజించుటకు ఎన్నో తంత్రశాస్త్రములు, ఎన్నో విధములైన అర్చనాపద్దతులను నిర్దేశించియున్నవి. వాటి అన్నింటిలోనూ ప్రధానమైనది శ్రీచక్రపూజా విధానము దానిని ముందు వివరించగలము. బాహ్య పూజావిధానమునకు గాని, మానసిక పూజాకుగానీ ముఖ్య లక్ష్యము దేవీ స్వరూపముతో స్థూలముగా ఏకతా భావమును పొందుటకు తీవ్రముగా కృషి చేయవలయును

దేవియొక్క స్థూలరూపమును ధ్యానించి, ఆ రూపముయొక్క అవయవములను సాధకుడు తనదేహములోని అవయవములకు అనుసంధించుకొనవలయును. దీనినే న్యాసమందురు. తన దేహమునే దేవాలయముగా భావించుకొనవలయును. అందులో వుండు తాన్నేఆదేవిగా గుర్తించుకొనవలయును. మన దేహములోని కేశముల మొదలు పాదముల వరకు గల భాగములన్నియు దేవి యొక్క శక్తులే. దీనినే అంగన్యాస, కరన్యాసములని వ్యవహరించెదము. మన హైందవ పూజా విధానము లోని విశిష్టత ఇదియే. పుష్టువును గాని, శివుని గాని పూజించుటయందును, సంధ్యా వందన మందుచు ఈ న్యాస విధినినిర్దేశింపబడియున్నది. దేవ్యుపాసనలో దేవీ స్వరూపమును బీజాక్షరములుగా పంచదశీ మంత్రముగా నిర్దేశింపబడియున్నది. అందులోని మూడు కూటములలోని ఒక్కొక్క కూటమును అంగన్యాస, కరన్యాసములుగా భాగించుకొని, దేవీమూర్తిని తన స్వంతదేహమునందు నిలుపుకొనవలయును. దీక్షచేత దేహములోని మలములన్నియు తొలగిపోయి, పరిశుద్ధమగును. న్యాసము లేకుండాచేయు మంత్రజపము గాని షోడశపూజలుగాని నిష్ఫలములని శాస్త్రాదేశము. "న్యాసం వినాకృత్వా మంత్రక్రియాః సర్వం వినిష్ఫలాః। తస్మాన్న్యాసం మంత్రకర్త వ్యోమంత్రాగత ఫలేప్సుభిః॥

దేనిమంత్రముతోకూడా మాతృకావర్ణములను అనగా "అ" నుండి "క్ష" వరకు గల అక్షరములను చేర్చి ఆ యా అవయవములందు న్యాసమొనర్చుట ఋష్యాదులన్యాసము. పీఠ న్యాసములు మొదలగువాటిని కూడ చేయవలయును. న్యాసముచేయనిచో దేహమలములు పోవు అని పైన చెప్పితిమి. మలములనగా నేమో చూచెదము. మలములు ఆణవ, కార్మిక, మాయిక మలములని మూడు

విధములు. ఈమూడున్నూ మనదేహముగా వ్యవహరింపబడుదానిని స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు సంబంధించిన ముప్పై అరు ప్రకృతి తత్త్వములకు సంబంధించిన దానిని "ఆణవ" మలమనెదము. ఈ దోషమువలన మనము దేహము మనస్సులచేపూర్తిగా తాదాత్మ్య మును చెంది స్వస్వరూపమును మరచుచున్నాము. స్థూల దేహమే నేననెడి భ్రాంతికార్మిక మలము. ఇక్కడ మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయమేమనగా, మనలోని మూడు శరీరములే వ్యష్టిగాను, మనముచూచునటువంటి యావత్ప్రపంచము సమిష్టిగాను ఈముప్పదిఆరుతత్త్వములే మనలోయుండునవే బయటకూడయున్న వనియూ, ఈ వ్యష్టి సమిష్టిదేహములకు 'నేనే' కర్తను అనియూ అన్న దేహాభిమానమే కార్మికమలము,

స్థూలదేహమునందు ఇరువదినాలుగు (24) తత్త్వములున్నవి (1) ప్రకృతి (2) మనస్సు (3) బుద్ధి (4) అహంకారము (5) శ్రోత్రము (6) చర్మము (7) చక్షు (8) జిహ్వ (9) ఘ్రాణ (10) వాక్కు (11) పాణి (1 ) పాద (13) పాయు (14) ఉవస్థ (15) శబ్ద (16) స్పర్శ (17) రూప (18) రస (19) గంధ (20) ఆకాశ (21) వాయు (22) తేజ (23) అపః (24) పృథివీ తత్త్వములు – దీనిని ఆత్మ తత్త్వమనెదము, ఈ అపమనముతో కార్మిక మలము తొలగును. ఈ అచమనమును పంచదశీమహామంత్రములోని మొదటికూట బీజములతో ".ఐం, క, ఏ, ఈ, ల, హ్రీం, – ఆత్మ తత్త్వం శోధయామి స్వాహా" అని చేయువలయును. (1) దీనిని ఆత్మతత్త్వ ఆరాధనమనెదరు.

పూర్తిమంత్రము :- "ఓం ఐం హ్రీం శ్రీం ఐం, – క, ఏ, ఈ ల, హ్రీం" ప్రకృత్యహంకార బుద్ధి మనస్త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వ

ఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థ శబ్ద స్పర్శ రూప రస గంధాకాశ వాయు వహ్ని సలిల భూమ్యాత్మనా చతుర్వింశతి తత్త్వాత్మికా ఐంకా రాత్మక ధర్మప్రద దశకలాత్మనే వహ్నిమండలరూపాయ వ్యష్టిసమిష్టి స్థూల శరీరాభిమానినే, స్వాధిష్ఠాన నిలయాయ సరస్వతీ సమేతాయ బ్రహ్మణే, అం, ఆం, ఇం, ఈం, ఉం, ఊం, ఋం, ౠం, ఌం, ౡం, ఏం, ఐం, ఓం. ఔం, అం: అః: క, ఏ, ఈ, ల, హ్రీం.- ఆత్మతత్త్వేన ఆణవమల శోదనార్థం, స్థూల దేహం, పరిశోధయామి జుహోమి స్వాహా " - అత్మా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం, విరజా విపాప్మా భూయాసగ్ స్వాహా -

(2) కార్మికమల శోధనార్థం – విద్యాతత్త్వాచమనం:

మాయతో కూడిన ఈశ్వరుడు సూక్ష్మ రూపముతో శివ శక్తి స్వరూపడయి హంసాత్మకమగు (ప్రాణాత్మకమగు) జీవుడై, ఈ ఈశ్వర జీవులు మాయ: అవిద్యలనబడు ఉపాధియుక్తులై, సమష్టి వ్యష్టి, సూక్ష్మ శరిరా భిమానియై నేను చేయించు చున్నాను, నేను పోషించుచున్నాను అను అభిమానము యొక్క కార్మికమలమను దోష మును అనగా ఆవరణమును తొలగించుటకై ఈ విద్యా తత్త్వాచమ నము నిర్దేశింపబడినది. దీనిచే సాధకునికి తనస్వస్వరూపము అర్థ మగును, తన స్వప్రకాశక శక్తి అనుభవము లోనికి వచ్చును. దీనికై పంచదశీ మహామంత్రములోని ద్వితీయకూటము లోని బీజా క్షరములతో తత్త్వాచమనము చేయవలయును.

"క్లీం - హ, స, క, హ, ల, హ్రీం. విద్యాతత్త్వం శోధ యామి స్వాహా." ఓం, ఐం, హ్రీం, శ్రీం, క్లీం, హ, స క, హ ల, హ్రీం, మాయా, కలా, అవిద్యా, రాగ, కాల, నియతి, పురుషా త్మనా, క్లీంకారాత్మక, అర్థప్రద ద్వాదశకలాత్మనే, సూర్య మండల

రూపాయ, విష్ణుగ్రంథిహృత్కమల నిలయాయ వ్యష్టిసమష్టి సూక్ష్మ శరీరాభిమానినే లక్ష్మీసమేతాయ విష్ణవే నమః. క్లీం - హ, స, క, హ, ల, హ్రీం-కం, ఖం, గం, ఘం, ఙం. చం, ఛం, జం, ఝం, ఞం, టం, ఠం, డం, ఢం, ణం, తం, థం, దం, ధం, నం, పం ఫం, బం, భం, మం - విద్యా తత్త్వేన మాయికమల శోధనార్థం సూక్ష్మదేహం సంశోధయామి - జుహోమి స్వాహా " అంతరాత్మా మె శుద్ధ్యం తాం జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ స్వాహా, "

(3) మాయికమలశోధనార్థం శివతత్త్వాచమనం :

సృష్ట్యారంభమందు పరబ్రహ్మము మాత్రమే యుండెను. దాని యందు సృష్టి సంకల్పబుద్ధి పుట్టినది. అందు ఆవరణ విక్షేపశక్తులు కలిగినవి. ఈరెంటి కలయికే మాయ. ఇదే కారణశరీరము. అందు చేత జీవుడుగా యున్న సాధకుడు వ్యష్టి, సమష్టి, కారణశరీరాభిమానియై, తన నిజ స్వరూపమును మరచి, సృష్టి, స్థితి, లయములకు తానే ఆధారుడనని అభిమానముతో మాయికమల దోషగ్రస్తుడై యుంటున్నాడు. ఈ శుద్ధవిద్యవలన, శుద్ధ తత్త్వమైన శివ తత్త్వమును, మాయికమలదోషవర్జితునిగాచేసి, స్వస్వరూపానుసంధానము ను ప్రసాదించు పంచదశీమహామంత్రము లోని మూడవ కూటముతో తత్త్వాచనము ను చేయుచున్నాడు.

సౌః = స, క, ల, హ్రీం-శివ తత్త్వం శోధయామి స్వాహా ఓం, ఐం, హ్రీం, శ్రీం, సౌః: స, క, ల, హ్రీం: శివ,శక్తి సదాశివేశ్వర శుద్ధతత్త్వాత్మనా, సౌః కలాత్మక కామప్రద షోడశ కలాత్మక సహస్ర కమల నిలయాయ, సోమ మండల రూపాయ, రుద్ర గ్రంధి విచ్ఛేదనాయ, వ్యష్టి, సమిష్టి కారణ శరీరాభిమానినే ఉమా సమేతాయ రుద్రాయ నమః. సౌః = స, క, ల. హ్రీం - యం.

రం, లం, వం, శం, షం, సం, హం, ళం, క్షం, శివ తత్త్వేన మాయికమల శోధనార్థం, కారణదేహపరిశోధయామి. జుహోమి స్వాహా పరమాత్మా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం, విరజా, విపాప్మా భూయగ్ స్వాహా.

(4) తురీయ, తురీయాతీత తత్త్వాచమనం :

సాధకులు ఈ నాల్గవదయిన సంపూర్ణాచమనాన్ని తప్పక చేయవలయును.

స్థూల, సూక్ష్మ కారణ శరీరాత్మకమైన కూటముల యొక్క మొదటి మూడు ఆచమనముల వలన ఆయా తత్త్వానుభవములను గ్రహించినవాడై ఈ ముప్పదియారు తత్త్వములకు అతీతమైన స్థితి ఏదిగలదో అది అయిన తురీయస్వరూపమును, ఆ స్వరూపమే తన నిజస్వరూపమని గ్రహించి ఆస్థితియందే యుండుటకై ఈ నాల్గవఆచమనమును ఏర్పరచిరి. పంచదశీమంత్రములోని అన్ని బీజములతో దీనిని ఏర్పరచిరి.

ఐం = క, ఏ, ఈ, ల, హ్రీం: క్లీం = హ, స, క, హ, ల, హ్రీం: సౌః = స, క, ల హ్రీం-సర్వతత్త్వం పరిశోధయామిస్వాహా ఓం, ఐం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః - క, ఏ, ఈ, ల, హ్రీం; హ, స, క, హ, ల, హ్రీం: స, క, హ, ల, హ్రీం- ప్రకృత్యహంకార బుద్ధి మనస్త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా, ఘ్రాణ. వాక్పాణి, పాదపాయూపస్థ, శబ్ద స్పర్శ రూప రస గంధాకాశ వాయు వహ్ని సలిల భూమి మాయాకలాఽవిద్యారాగ కాలనియతి పురుష శివశక్తి సదాశివేశ్వర శుద్ధవిద్యాత్మనా-అం, ఆం, ఇం, ఈం,.................ళం,క్షం ఓం, ఐం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః = క, ఏ, ఈ, ల, హ్రీం హ,

స, క, హ, ల, హ్రీం, స, క, ల, హ్రీం. షట్ త్రింశత్ (36) తత్త్వాని సర్వతత్త్వేన జీవాత్మ పరమాత్మనో ద్వైక్యం భావయామి స్వాహా. ఈ నాలుగు ఆచమనములు (1) ప్రజ్ఞానం బ్రహ్మ (2) అహం బ్రహ్మాస్మి (3) తత్త్వమసి (4) అయమాత్మా బ్రహ్మ అను మహావాక్యముల వివరణమునుసూచించుచున్నవి. అందుచే శ్రీవిద్యోపాసకులు ఉపాసనకు ముందు ఈ నాలుగు విధములుగా ఆచమించ మించవలయును.

ఈఅంగన్యాస కరన్యాసములవలన, తత్త్వశోధనలవలన సాధకుని దేహేంద్రియములు పరిశుద్ధమగును. ఈన్యాసము వలన సాధకుని శరీరమందు మాతృకావర్ణములు, అ నుండి క్ష వరకుగల అక్షరముల యొక్క అధిదేవతలు, మంత్రముయొక్క అధిష్టానదేవత సాధకుని శరీరావయవములందు ఆక్రమించుకొని, తాదాత్మ్య భావమును కలిగించుకొనును.

ఈప్రక్రియవలన సాధకునికి శ్రీదేవి ఎక్కడో మేరుపర్వతమునందో, సుధాసాగరములోని మణిద్వీపములో వుందనో భావన కాక, తన హృదయమునందే యున్నదనే విశ్వాసము కలుగును. అట్లు హృదయమందు ఆమెను నిలుపుకొనుటకు శక్తి, సామర్థ్యములు కొరవడినప్పుడు తనకెదురుగా యుండు దేవియొక్క ప్రతిమనే, యంత్రమునే దేవిగా భావించి తన హృదయ పీఠము నధిష్టించ వలసినదిగా దీనాతిదీనముగా వేడుకొనును. మహాభక్తులు తమ కవితావేశముతో దేవిని అద్భుతమైన స్తోత్రములతో ఈలాగుననే ప్రార్థించిరి.

ఈవిధముగా సాధకుడు బాహ్యపూజతో ప్రారంభించి, క్రమక్రమముగా దేవిని, దేవియొక్క శక్తిరూపములైన వివిధ దేవతలను

తన అవయవములందధిష్ఠింప జేయుచు, తుదకు తానే ఆదేవతయు అనుభవమును సంపాదించుకోగలుగును.

ఇది ఒక రోజులో, తక్షణమో జరుగుననుకొనుట పొరబా పశుభావముతోకూడిన పూజనుంచి దివ్యభావమును పొందుటకు ఎం సాధన, అభ్యాసము అవసరము. శ్రద్ధాభక్తుల తీవ్రతను బట్టి ఫ తములుండును. ఈ అభ్యాసమునకు ఆలంబనము మంత్రసాధన.

## మంత్రము

మహామంత్రా (227), ఛందస్సారా (844), శాస్త్రసారా (845) మంత్రసారా (846). అని దేవియొక్క నామములు. వేదసా స్వరూపిణి. వేదములన్నియు మంత్రములే. గాయత్రీఛందరూప మున యుండునది. గాయత్రికి రెండు రూపములున్నవి. మొద టిది అందరూ ఉచ్చరించునది. నాలుగువేదములందు రహస్యముగా యుండునది. శ్రీవిద్యాస్వరూపమైన పంచదశీ మంత్రము వేదము లందు రహస్యముగా యుండునది. వేదములు దీనినే కామయోని-కామకల-అని సంకేతములుగ చెప్పుచున్నవి. కానీ స్పష్టముగాలేదు ఛందోబద్ధమై వరావాక్కుచే స్తుతింపబడుచున్నది.

మంత్రమనగా "సత్యము, జ్ఞానము, అనంతము అనుపదము లచే మాత్రము నిర్వచింపబడగల శుద్ధబ్రహ్మస్వరూపమును, నిర్వి కల్ప జ్ఞానముగల సాధకునికి, అజ్ఞాన రూపమును మననము చేయుట వానిక కలుగజేసి. ద్వైతభావమును పోగొట్టి. అద్వయస్వరూపమును పొందించి రక్షించునది. (భాస్కరరాయులు). జీవబ్రహ్మైక్యమును

కలిగించునదే మంత్రము. ఆధునికులు కూడ మంత్ర మహిమను గుర్తించుచున్నారు.

సర్వే వర్ణాత్మికా మంత్రాః తేచ శక్త్యాత్మకాః ప్రియే
శక్తిస్తు మాతృకాజ్ఞేయా సాచ జ్ఞేయా శివాత్మికా ॥

అన్ని మంత్రములు వర్ణాత్మకములు. ఆవర్ణములు శక్తిరూపములు. (అకారాది క్షతరాంతవర్ణములన్నియు) శక్తి అనగా మాతృకయే. ఆమాతృక శివాత్మకమే. శబ్దరూపమున నున్న శక్తియే మంత్రము. శబ్దము రెండురకములు. "ధ్వని"అనియు, "వర్ణము అనియు. లిపిరూపమున యుండునది వర్ణము. అక్షరరూపములేనిది ధ్వని. రెండువస్తువులు ఘర్షణ పడినప్పుడు ధ్వని కలుగును వర్ణమటువంటిది కాదు. ధ్వని వర్ణమును అభివృద్ధిచేయును. ధ్వని పరస్పర సంఘర్షచే కలుగును. కానీవర్ణము అనాహతము. అనగా ఘర్షణ లేకనే కలుగునది.

ఏకో అనాదాత్మకో వర్ణః సర్వనాద విభాగవాన్
సోఽనస్తమిత రూపత్వాత్ అనాహత ఇతీరితః ॥

దీనినే నాద బ్రహ్మము. శబ్ద బ్రహ్మము అని గుర్తించెదము. నాదరూపిణి (901), నాదరూపా (299), అని ఆ తల్లికి పేర్లు. ఈ శబ్దబ్రహ్మమే నామ, రూపములుగా, జగత్తుగా పరిణమించినది.

ఈనాదము మొదటఎట్లుత్పన్నమైనదో మనమహర్షులు తాము దర్శించి. విని, మనకందజేశారు. వారుచెప్పినవిధానమును చూడుడు "మహా ప్రళయము సంభవించినది. అకాలమున జీవ కర్మలు పరిపక్వము కాకనే మాయూవిశిష్టుడైన బ్రహ్మమందలి మాయతోలయించి యున్నవి. కొంతకాలమునకు అకర్మలుతరిపక్వమయినవి. అపుడు

"విచికిత్స" జరిగినది. ఆ పరిపక్వ దశ యందు మాయ పరిమాణ మొందుచూ, సృష్ట్యున్ముఖ మగుచున్నది. ఆస్థితియే అవ్యక్తము. ఆ అవ్యక్తమే సృష్టికి కారణము. అసృష్టి యందు సర్వకర్మలును మొలకెత్తును గాన దానిని "కారణ బిందువు" అని అనిరి. కారణ బిందువు నుండి కార్యబిందువు పుట్టినది. అందుండి నాదము దాని నుండి బీజము పుట్టినవి.

మన దేహమునందు మూలాధారచక్రమున "కుండలినీ" రూప మున ఆ కారణబిందువు కలదు. అదియే శక్తి. అది అచట స్పన్ద రహితముగా యుండును. అది కార్యబిందువుగా పరిణమించినపుడు నాదబ్రహ్మము అనబడును. మూలాధారమందు నిష్పందనస్థితిలో యున్న శబ్దమును "పరా"వాక్ లేక "పరా"శబ్దమందుము. పరా (366) శివశక్తుల అవినాభావ స్థితియే బ్రహ్మము. శివునిది ప్రకాశ రూపము. శక్తిది విమర్శ రూపము. ఇందు విమర్శశక్తి విజృం భించినపుడు సృష్టి జరుగును. అవిధముగా మారువపుడు స్థితి పరా శబ్దస్థితి. శబ్దమునందు స్పందనము ప్రారంభమైనది. కానీ విభా గము కలుగలేదు పరాశబ్దము నాభివరకు చలించి మనస్సుతో కలి యును. అపుడు కార్యబిందురూపమునుధరించును. ఇదిసామాన్య స్పందము. అస్థితిని " పశ్యంతి " (368) నామమును పొందును. ఇచట ఇచ్ఛాశక్తి సృష్టికి ఉన్ముఖమైనది, ఇది మణిపూరము వరకు వ్యాపించియుండును. ఇచ్చట స్పందము సామాన్యమేగాని, విభా గమైన విశేషస్పందము లేదు. ఇదియే కారణశరీరము -॥ మనస్సు పైకితెలిపిన విధమున సూక్ష్మనామరూపాత్మకముగ శబ్ద+అర్థ రూప మున పరిణమించిన స్థితినే అనగా ఆ పరావాక్కు, పర చైతన్యము, మనోరూపమున శబ్దార్థరూపమున అభివ్యక్తన స్థితినే " మధ్యమ " (370) అందుము. ఇదియే జ్ఞానశక్తి విలాసము, ఇదియే సూక్ష్మ

శరీరము. ఇదియే " హిరణ్యగర్భ " శబ్దము. ఇది హృదయము వ్యాపించియుండును.

ఆదే విధముగా శబ్దబ్రహ్మము కంఠస్థానమును పొంది సుస్పష్ట ముగ మనముఖద్వారము గుండా, ఇతరులు విని అర్థము చేసుకొనుటకు వీలుగ, మనముచ్చరించుస్థూలశబ్దమే "వైఖరి" (371) ఆదియె విరాట్. క్రియాశక్తి విలాసమిది.

మూలాధారమందలి కుండలినీ "మహామాతృకా సుందరి" అని పిలువబడుతున్నది. వైఖరీశబ్దరూపము ఏబది యొక్క స్థూలాక్షరములే మూలాధారమందు సూక్ష్మ రూపముతో యుండును. అక్షర శాస్త్ర ప్రకారము "అ" నుండి "క్ష" వరకు గల వర్ణము లన్నియు ఒక్కొక్క భూతపరమై యుండి ఆభూతముల శక్తిని పొందును.

ఆకాశమునకు సంబంధించినవి ప, ఫ, బ, భ, మ, ఓ, ఔ, అం, అః.

వాయువునకు సంబంధిలచినవి : క, ఖ, గ, ఘ, ఙ, అ, ఆ, ఋ, హ, శ, య.

అగ్నికి సంబంధించినవి : చ, ఛ, జ, ఝ, ఞ, ఇ, ఈ, ౠ, క్ష, ర.

జలమునకు సంబంధించినవి. త, థ, ద, ధ, న, ఎ, ఏ, ఐ, స.

పృథివికి సంబంధించినవి : ట, ఠ, డ, ఢ, ణ, ఉ, ఊ, ఒ, ష, వ, ల,

ఈ అక్షరములను ఏకముగా గానీ, కొన్ని కొన్నిగా కలిసికానీ మంత్రములగుచున్నవి. ఈ అక్షరసమ్మేళనముచే ఆమంత్రములకు ప్రత్యేకశక్తులు జనించి, సాధకునికి సంకల్పసిద్ధిని ప్రసాదించును,

మంతారం తారయతీతి మంత్రః = రక్షించునది మంత్రము, మననాత్ త్రాయతే యస్మాత్ మంత్రమిత్యభి దీయతే" - మననము చేయువారిని రక్షించునది మంత్రము. శబ్ద పూరితమై: భావ రూప మైన శక్తి కలది మంత్రము. మానసికభావములు కూడ స్పందనాత్మకములే, ఈ స్పందనములన్నియు ఒకదానితో నొకటి సంబంధ పడియున్నవి. భౌతికస్పందనలతో ఎన్నో అద్భుతములను ఈనాటి విజ్ఞానశాస్త్రజ్ఞులు కనిపెట్టిరి కానీ సూక్ష్మనాద స్పందన వలన ఎన్నో సూక్ష్మశబ్దతరంగములనుండి ఎన్నెన్నో దివ్యశక్తులను పొందవచ్చునని మన మంత్రశాస్త్రము తెలుపుచున్నది.

ఇసుకను చదునుచేసి దానితోపైనను శబ్దము చేయుదమేని ఆ ఇసుకపై వివిధరూపములేర్పడును, శాస్త్రీయసంగీతముచే, ప్రత్యేక రాగములవలన ఆయా రూపములు ప్రత్యక్షమగును, ఇక దేవతా రూపములైన మంత్రోచ్ఛారణ వలన సాధించలేనిది ఏది కలదు? ఆదిత్య హృదయము, ఇంద్రాక్షివంటి స్తోత్రములచే ఎన్నో వ్యాధులు నివారణయగుచున్నవి. "ఓం, ఐం, హ్రీం, శ్రీం" అను మంత్రోచ్ఛారణచే "బాల" ప్రత్యక్షమగును, కానిసాధన తీవ్రముగాయుండ వలయును.

ఈ వర్ణములకును, మనలోని నాడులకున్నూ సంబంధమున్నది అందుచేత ఏఏ ఫలములనాశించెదరో, వారుఆయావర్ణములను సంపుటి చేసి, మంత్రముగా చేసుకొనినచో, తప్పక ఆఫలమును పొందెదరు,

ఈ రహస్యమును గ్రహించి వశ్యము, ఆకర్షణ, మోహన, స్తంభన. విద్వేషణ, మారణ, ఉచ్చాటన, మున్నగు ప్రక్రియలను ప్రయోగించి, సమయాసందర్భములనెరుగక, మంత్రములదుర్వినియోగ చేసిన ఘటనలు ఎక్కువగానే యున్నవి.

భావరూపమై, శబ్ద ప్రపూరితమై, బీజాక్షర సమ్మేళనమైన ఈ మంత్రములు మహాశక్తివంతములు. ఈ సాధనాబలమువలన సాధకునిలో అమానుషశక్తులుద్భవించును. సాధకుడు పవిత్రభావములు కలిగియుండవలయును, ఈమంత్రసాధనచే అతనికిమంత్రశక్తియు సాధనశక్తియు కలిగి, ఆధ్యాత్మరంగమున ఉన్నత స్థాయికి పోయి కైవల్యమును పొందును.

## మంత్రాంగములు

ప్రతి మంత్రమునకును ఆరు అంగములు కలవు. ఋషి, ఛందస్సు' దేవత, బీజము, శక్తి, కీలకము వీటిని తప్పకపాటించ వలయును.

లలితాసహస్రనామ స్తోత్రమునకు:

ఋషి, వశిన్యాది వాగ్దేవతలు: ఛందస్సు-అనుష్టుప్: దేవత శ్రీ లలితా పరాభట్టారికా మహాత్రిపురసుందరి: బీజము-ఐం: శక్తి సౌః. కీలకము-క్లీం: దేవి-షడంగదేవతాయుక్తా (386)

## కుండలినీ యోగము

మనదేహము లోని అంతర్గతశక్తులను పరిణమింపచేసి, మనకు ఇహపర సౌఖ్యములను కలుగ జేసి, కైవల్య ప్రాప్తిని కలుగ జేయు

షట్చక్రభేధనమనబడు కుండలినీజాగరణమనబడు కుండలినీయోగము శ్రీవిద్యలో ప్రప్రథమముగా సాధనచేయవలసిన విధానము.

మానవదేహము అనగానే మనకు గోచరించునది స్థూలశరీరము మాత్రమే. కానీ మనకు గోచరించని, ఎక్స్ రే కిరణములకు కూడ గోచరించని ఎన్నో నాడులు వాటి కేంద్రములు, అతిమానుషశక్తులు ఎన్నో అందు ఇమిడియున్నవి. అవి బీజ రూపముగా యున్నవి. వాటిని కొన్ని ప్రక్రియలచే రేకెత్తించి అంకురింప జేసినచో అతడు అనేక అద్భుత సాహస కృత్యములను చేయ గలుగు సిద్ధులను పొందగలడు. ఈ యోగములలో ముఖ్యమైనవి మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగములు.

వీనిఅన్నింటిలోనూ యమము, నియమము, బ్రహ్మచర్యము మౌనము, సత్యము, అహింస మున్నగు అష్టాంగ యోగములను పాటించవలెను. వీటి లక్ష్యము బ్రహ్మానుభూతి, మోక్షము, కుండలినీయోగము, రాజ యోగముగా గుర్తించ బడినది, ఈ యోగము ఉపనిషత్తులచేతను, శాస్త్రముల చేతను ప్రశంసింపబడుచున్నది.

"కుండలే అస్యాస్త ఇతి కుండలినీ" - వలయాకృతిని చుట్టుకొని యుండునది కుండలినీ. ప్రకాశవంతమైన తేజస్సు, జీవ శక్తి ప్రాణరూపము అయినదీ కుండలినీ శక్తి. ఇది మూలాధార చక్రమునందు వహ్నిమండలమున నివసించుచున్నది. ఈశక్తి సర్పము వలె మూడున్నరచుట్టలతో నిద్రించుచున్నది. ఇది సుషుమ్నానాడీ మధ్యమున మాయా శిరముతో సర్వదా బుస కొట్టుచుండును. దీనికి ఋజువుగా మనము చెవులు గట్టిగా మూసుకొనినచో ఒక శబ్దము వినబడుతుంది. అదే పాము బుసవలె యుండును.

మూలాధారమున చక్రమందున్న ఈ కుండలినీ శక్తి యోగినీ బృందముచే మేల్కొలుపబడి, మూడున్నర వలయములను వీడి, షట్చక్రములనుదాటి, బ్రహ్మ, విష్ణుగ్రంథులను త్రెంచి, శిరోభాగమున గల సహస్రారమును చేరి అమృతప్రవాహమును కలిగించును భాస్కరరాయుల అభిప్రాయమున యోగము వలననే గాక భావనా ప్రభావమున గూడ ఈక్రమమును పొందవచ్చును. ఈ కుండలినీ మూలాధార మందు నిద్రించు నపుడు మానవుడు ప్రపంచమున మేల్కొని యుండును. అదిమేల్కొనినపుడు అతనికి జగత్తువుండదు విశ్వమందు అది శుద్ధమాయగా వుండును. వ్యక్తియందు ఇదికుండలినీ రూపమున యుండును. యిదియె సర్వాధారము. మూలాధారను నుండి సహస్రారము వరకు "వరా" నాడియనియు. జీవనాడి అనియు. ప్రఖ్యాతమైన సుషుమ్నానాడి. ఈమధ్యగల కమలములందు మాతృకారూపముగ ప్రదక్షిణక్రమమున వ్యాపించియున్నందుననూ, ఇది కుండలినీ ఆకృతితో యున్నందుననూ దీనికి కుండలినీ శక్తియన్ని పేరు వచ్చినది.

ఈయోగమును అనుసరించువారే కౌళులు. కౌళపదముశక్తికి అన్వయించును. అంతేకాదు "మూలాధారాదికం చక్రషట్కం కులమితి స్మృతం," మూలాధారముమండి ఆజ్ఞాచక్రమువరకుగల షట్చక్రములు కుళమనబడును.

## షట్చక్రములు

షట్చక్రోపరిసంస్థితా '(108) షట్చక్రములపైన సహస్రారములో వుండునది.

మానవునిలో అంతర్గతముగానున్న అతి మానుషశక్తులను ఉద్దీపన మొనరించి, తద్వారా పరమాత్మానుభూతి పొందుటకు ఈ షట్చక్రమును దర్శించి, సహస్రారమందలి వాచామగోచరమైన శివశక్తి సామరస్యమును పొందించు ఉపాయమును శోధించునది ఈకుండలినీ యోగము ఒక్కటియే. బ్రహ్మానుభూతి ఈ షట్చక్రముల ద్వారానే జరుగవలయును.

మనదేహంలో వెనుకవైపుగల వెన్నెముక అతి ముఖ్యమైనది. దీనిని వీణాదండమనెదము. మూలాధారచక్రము మనజననాంగానికి గుదస్థానానికి మధ్య వుంటుంది. మూలాధారము మొదలుకొని కపాలకుహరం వరకు వెన్నెముక వున్నది. దీనినే "బ్రహ్మదండి"అని కూడ అంటాము. వెన్నెముకమధ్యలో గొట్టమువలె సూక్ష్మరూపంలో ఒక రంధ్రం వుంది. దానిని బ్రహ్మనాడి అంటారు. కుడిముక్కులోని నాడికి పింగళ లేక సూర్యనాడి: ఎడమ ముక్కు లోని నాడికి ఇడలేక చంద్రనాడి యనిపేరు. ఈరెంటి మధ్య త్రిగుణాత్మకమగు సుషుమ్న నాడికలదు. ఇది చంద్రసూర్యాగ్ని తత్త్వము కలది. ఈ సుషుమ్న నాడి మూలాధారము నుండి సహస్రారము వరకు ప్రకాశ స్వరూపముగ వ్యాపించియుండును. దీనికి మధ్యమున యోగులకు యోగగమ్యమైన "చిత్రిణి" యనుశక్తి కలదు. ఇదిమిక్కిలిసూక్ష్మమై సాలెపురుగు దారముకంటె సన్నగాయుంటూ, బిసతంతు తనీయసి!!! వీణాదండమునకు మధ్య అందందు గల చక్రముల దూరుచూ పోవు చుండు శుద్ధచైతన్యము. ఇది విద్యుల్లతవలె మెరయుచుండును.

## మూలాధార చక్రము

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా
అంకుశాదిప్రహరణా వరదాది నిషేవితా (106)
ముద్గౌదనాసక్త చిత్తా సాకిన్యాంబా స్వరూపిణీ (107)

సుషుమ్న ముఖమునకు అనుసంధింపబడి ఉపస్థా గుదస్థానము మధ్య మూలాధారచక్రముకలదు, ఆచక్రపద్మమునకు నాలుగుదళములున్నవి. దీని రంగు సువర్ణము. ఇందలి బీజాక్షరములు వ. శ, ష, స. ఇది సృష్టికర్తయగు బ్రహ్మకుస్థానము. ఇందలిదేవత సాకినీ. ఇందలి కుండలినీ నిద్రావస్థలో సుసూక్ష్మముగా నుండును. ఆమెది (889) విశ్వభ్రమణకారిణి రూపము. అటునున్న శివలింగాకృతిని మూడున్నరపర్యాయములు చుట్టి, తటిల్లతా సమరుచి (107) తేనెటీగవలె ఝుంకారము చేయు చుండుచు. అమెయే సర్వాధారా (659) అందు ఆమె పరాశక్తి (572) గా పిలువబడు పరమేశ్వరి (396) ఆమె శాశ్వతజ్ఞాన ప్రబోధిని. సూక్ష్మాతిసూక్ష్మరూపిణి(467) మహాకాళి (751) కూడఆమెయే. శాశ్వతానందమునుండి నిత్యస్రవంతియై ప్రవహించుఅమృతప్రవాహమునకామె మూలము. ఆమె విభూతిచే సర్వ ప్రపంచము ప్రకాశించును. కోటిసూర్యుల తేజముతో ప్రకాశించుచుండు ఈ దేవిని ధ్యానించువాడు వాక్పతి యగును. ఏ వ్యాధులు వానిని పీడింపవు. ఈమెయొక్క ఆయుధములు అంకుశాదులు. ఈమె అస్థి ధాతువునకధిపతి "వరదా" మున్నగు వారిచే సేవింపబడును. ఈమెకు ఐదు ముఖములు, పృథ్వీ తత్త్వము. ముద్గాన్నమందు ప్రీతి కలది.

## స్వాధిష్ఠానచక్రము

స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్ర మనోహరా
శూలాద్యాయుధ సంపన్నా పీతవర్ణాఽతి గర్వితా 104
మేదోనిష్ఠా మధుప్రీతా బంధిన్యాది సమన్వితా
దధ్యన్నసక్త హృదయా కాకినీ రూపధారిణీ 105

స్వాధిష్ఠానమను ఆరుదళములుగల పద్మమందు కాకినీరూపమం దుండునది. నాల్గుమోములతోమనోజ్ఞమైనది. త్రిశూలము, పాశము కపాలము, అభయమను ఆయుధములుగలది. వసుపురంగు కలది. సౌందర్యమువలవ కలిగిన మహా గర్వము కలది. మేధస్సు అను ధాతువునందుండునది. తేనెచే ప్రీతినొందునది. "బందినీ" మొదలగు వారిచే పరివేష్ఠింపబడినది. పెరుగన్నమంటె ఆమెకు ప్రీతి,

సుషుమ్నా నాడిలో ఉపస్థా స్థాన మూలమున దానిమ్మ పుష్ప వర్ణముతోయుండును. ఈచక్రమును స్వాధిష్ఠానమందురు. ఈదళములలో బ, భ, మ, య. ర, ల - బీజాక్షరములు ప్రకాశించును ఈ చక్రధ్యానము చేయువాడు యోగీశ్వరుడగును.

## మణిపూర చక్రము

మణిపూరాబ్జ నిలయా వదనత్రయ సంయుతా
వజ్రాదికాయుధోపేతా డామర్యాదిభి రావృతా 102
రక్తవర్ణామాంసనిష్ఠా గుడాన్న ప్రీతమానసా
సమస్త భక్త సుఖదా లాకిన్యంబాస్వరూపిణి 103

నాభియందలి పదిరేకులు గల పద్మము మణిపూరము. ఆమె పేరు లాకిని. మూడుమోములు కలది. వజ్రముమొదలగు ఆయుధములు గలది. డామరి మొదలగు పదిశక్తులచే ఆవరింపబడియుండును. రక్తవర్ణము గలది. మాంస ధాతువు నందుండును. బెల్లముతో కూడిస అన్నమందు ప్రీతి. భక్తులందరికి సుఖమునిచ్చునది ఈమె ప్రకృతి జలతత్త్వము. ఈ దళము అందు డ, ఢ, ణ, త, థ, ద, ధ, న ప, ఫ, లు బీజములుగ నున్నవి. ఈ చక్రమును

ధ్యానించుటచే, సాధకుడు సృష్టి, సంహారశక్తిని పొందును. మహా పండితుడగును.

## అనాహత చక్రము

అనాహతాబ్జ నిలయా శ్యామాభా వదనద్వయా
దంష్ట్రోజ్జ్వలాక్షమాలాది ధరారుధిరసంస్థితా 100
కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా స్నిగ్ధౌధనప్రియా
మహావీరేంద్రవరదా రాకిన్యంబా స్వరూపిణి 101

హృదయమందు ద్వాదశపత్రముల కమలము అనాహతచక్రం బందుండు దేవి రాకినీ. నల్లని కాంతి, రెండు ముఖములు, వరాహ దంతములు. అక్షమాల మొదలగు ఆయుధములు కలిగి రక్త ధాతువు నందు వసించును. కాళరాత్రి మున్నగు శక్తులచే కూడియుండును నేతితో కూడిన అన్నమందు ప్రీతికలది. తురీయ స్థితిని అందుకొన్న మహాయోగులచే సేవింపబడును. సకలాభీష్టముల నొసగును. "క" నుండి "ఠ" వరకు గల బీజాక్షరములీపద్మమునందు గలదు. ఈమె ప్రకృతి వాయుతత్త్వము.

## విశుద్ధిచక్రము

విశుద్ధి చక్రనిలయాఽఽరక్తవర్ణా త్రిలోచనా
ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా 98
పాయసాన్నప్రియాత్వక్స్థా పశులోక భయంకరీ
అమృతాది మహాశక్తి సంవృతా డాకినీశ్వరీ 99

కంఠస్థానమందు ఆకాశతత్త్వ ప్రకృతికమయి షోడశ దళ పద్మ మందుంటూ, రక్తవర్ణముగలిగి త్వగాది ధాతువుకు అధిదేవతయయి ఏకవదనము కలిగి, త్రినేత్రములు కలిగి, హస్తములందు ఖట్వాంగాది ఆయుధములు కలిగి, అమృతాది యోగినీగణదేవతలచే సేవింపబడుచు, అకారాది పదునారుస్వరముల స్వరూపిణియై, డాకినిదేవతగా యుంటున్నది. ఆమె పశు లోక భయంకరి, ఈ చక్రము నందు సదాశివుడుండును. ఈవిశుద్ధిచక్రమును ధ్యానించుయోగి ఆత్మజ్ఞాన వరుడై, మహాయోగియై, త్రిలోకములను కూడ చలింప చేయగల శక్తిసంపన్నుడగును.

## ఆజ్ఞా చక్రము

ఆజ్ఞా చక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడాననా
మజ్జాసంస్థాహంసవతీ ముఖ్యశక్తిసమన్వితా 107
హరిద్రాన్నైకరసికా హాకినీ రూపధారిణీ 108

భ్రూమధ్యమందున్న రెండు దళములుకల ఆజ్ఞా కమలమందు, శుక్లవర్ణము, ఆరుముఖములు కలిగి, మజ్జధాతువు నందు వసించుచూ, హంసవతీ మొదలగు శక్తులచే సేవింప బడుచూ, హరిద్రాన్నము నందు ఆసక్తి కలదియగు దేవి డాకిని రూపిణి. హ, క్ష బీజములు రెండు దళములయందుగలవు. ఈచక్రమును అరాధించు సాధకుడు అసామాన్యశక్తులుకలవాడగును. అతడుసర్వజ్ఞుడు: సర్వద్రష్టయు సర్వద్రష్టయు సర్వత్రశేయోఖిలాషియై బ్రహ్మైక్యమును పొందును.

## సహస్రదళ కమలము

సహస్రదళ పద్మస్థా సర్వవర్ణోపశోభితా
సర్వాయుధ ధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ 10-
సర్వౌదన ప్రీతచిత్తా యాకిన్యంబాస్వరూపిణీ 110

బ్రహ్మరంధ్రాధో భాగమందున్న పరాకాశమందు గల సహస్ర దళములు కల పద్మాకారమగు చంద్ర మండలము స్థానముగా గలదియు, శుక్లధాతువునకధిదేవతయు సర్వదిక్కులందు ముఖములుగలదియు, సర్వాయుధ ధారిణియూ, సర్వాన్న ప్రీత చిత్తయూ, తేజోమయమైన అవ్యక్త రూపములుగల అకారాది క్షకారాంతమయిన పంచాశద్వర్ణమయ యోగినీ పరివేష్టితమైన పరాశక్తియే "యాకినీ" అను మహాయోగిని. ఆమెయే నిత్య (136). ఆమెలో శివస్థానముకలదు ఈ స్థానము మాయా రహితము. శుద్ధ జ్ఞానస్వరూపము గలది. ఇదియే కైవల్యము, దీనినే హంసయందురు.

యమనియమాదులచే పరిశుద్ధచిత్తుడై, సద్గురువు యొక్క అనుగ్రహముచేత ధన్యుడైనవానికే ఇది సాధ్యము. ఈ చక్రముల గుండ కుండలిని ప్రబోధించి, క్రమముగ సహస్రారమునకు చేర్చి అవ్యయానందమును పొందును. ఇది స్వయంకృషిచే సాధింపనలవి కాదు. గురుసాంప్రదాయముచేతనే పొందగలుగును.

## గ్రంథిత్రయవిభాగము

మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథి విభేదినీ 38

అజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ
సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ 36

తటిల్లతాసమరుచిష్షట్చక్రోపరిసంస్థితా
మహాసక్తిః కుండలిని బిసతంతుతనీయసీ 40

ఈ కుండలిని జాగృతి పడుటలో ఒక క్రమమున్నది. ఇది ఎంతో పట్టుదల, శ్రద్ధ, భక్తి, సాధన గురువుయొక్క పర్యవేక్షణతో కూడుకొనినది. షట్చక్రముల ఆద్యంతములలో రెండు రెండు గ్రంధులు గలవు, మూలాదార స్వాధిష్ఠానములపై బ్రహ్మగ్రంథి (100( కలదు. ఇది వాగ్భవ మాయాబీజస్థానము. బ్రహ్మసరస్వతుల స్థానము. సకలమునకు అధిష్ఠానమైన చిత్కళ అనే ఆత్మను అవిద్యారూపమున ఆవరించి జీవుడను భ్రమను చిత్కళయందు కలుగ జేయును. అపుడు అన్నమయకోశమైన స్థూలదేహమందు "నేను" అను అభిమానమును కలుగ జేయును. జాగ్రదవస్థారూపమైన "విశ్వుడు" ....... ........... అను జీవుడు బ్రహ్మగ్రంధి అనిపించుకొనును. అటువంటి బ్రహ్మగ్రంథి నిభేదించవలయును. సంవిద్రూపిణీ, (×) జ్ఞానాకృతి (×) అయిన పరాశక్తి కృపతో తన నిజ స్వరూపము చిత్కళయే గానీ స్థూలదేహము కాదను జ్ఞానము లభింప చేసుకొనుటే బ్రహ్మగ్రంధి భేదనము.

అనాహత విశుద్ధికమలములమధ్య కామరాజమాయాబీజస్థానములందు, లక్ష్మీనారాయణస్థానమందు, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయమైన మూడు కోశములందు సూక్ష్మశరీరమునందభిమానము కలవాడై, స్వప్నావస్థను పొంది తైజసుడను (Y) పేరుగల జీవుడు భావాభావములు బింబప్రతిబింబములతో సమానమైనజీవబ్రహ్మముల అన్యోన్య" అధ్యాసవిష్ణుగ్రంథి 105 అని చెప్పబడుచున్నది, విష్ణు

గ్రంథిని చేదించుట అనగా అనాహతచక్రమున నాదబ్రహ్మకారమైన మంగళధ్వనులతో సాధకునికి చిత్కళా దర్శనమైన భావనా దార్ఢ్యము, గురుకటాక్షమువలన. విచారణ, సాధనా బలముల వలన కలుగును. ఈ జీవత్వము స్వప్నసదృశమేననియు, ఈ సూక్ష్మ శరీరము కూడ కల్పితమేననియు, అది తన నిజ స్వరూపము కాదనియు నిశ్చయ జ్ఞానముదయించును. ఇది విష్ణుగ్రంధి భేదనము. (విష్ణుగ్రంథి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం)

రుద్రగ్రంధియనగా రెండు దళములు గల ఆజ్ఞాచక్రము పై భాగమందు త్రిపుటీరూపమైన మూలప్రకృతి (397) యొక్క స్థానములో ప్రతిబింబ ఆనందమయ కోశమైన సుషుప్త్యవస్థను పొందిన ప్రాజ్ఞుడైన (Y) జీవుడు ప్రతిబింబా సమానుడై జీవబ్రహ్మముల యొక్క అన్యోన్యాధ్యాసమే రుద్రగ్రంధి. ఇది కేవలమిథ్యారూపము చిత్కళవరనాడీస్వరూపమును పొందుప్రయత్నమున స్వస్థాన రూపమును పొందుటయే రుద్ర గ్రంధి భేదనము. ఈ రుద్ర గ్రంధి యందు.............................కలరు. (ఆకాశాజ్ఞాద్వయీరూపం చక్రద్వితయ ముత్తమం: రుద్రగ్రంధి పదేనోక్తం మంగళాయ తనం మహత్)

స్వస్థానమైన సహస్రారాంతర్గతచంద్రమండలమును కుండలినీ రూప పరాభట్టారిక చేరగా, ఆ చంద్ర మండలము శైత్యాధిక్యము చేత ఘనీభవించి అమృతమయముగానున్నది. దానియందు అగ్ని రూప పరాశక్తి ప్రవేశించుట చేత ఆ అమృతము ద్రవించి వర్షించును. (సుధాసారాభివర్షిణి (106) సుధాస్రుతి (879) చేత, నాడీ సముదాయము తుష్టిని పొందును. గ్రంధిత్రయభేదనముచే, స్థూల సూక్ష్మ, కారణ శరీరములందు "నేను" అను అహంభావనా రూప

భ్రమ నివారణయగును. అప్పుడే స్వస్థానమైన సహస్రార ప్రాప్తి (సహస్రారాంబుజరూఢా (105) అనగా స్వస్వరూపమైన చిత్కళ తానేయని తెలుసుకొనుట. సర్వచైతనము చిత్కలదే కొబట్టి సకలమును చిన్మయముగనే భావించుట జరుగును. అదియే జీవన్ముక్తి. (సుధాధారాసారైః స్నపయసి తనుం బైందవకలే)

## కుండలినీప్రబోధము

సాధకుడు యమనియమాదులనుపాటించి గురూపదేశమువలన కుండలినీ ప్రబోధ విధానమును ఎరుగవలయును.

"ఆకృష్యప్రవేశైవ జీవాత్మానం నగేంద్రజే
కుండలిన్యా సహస్రాం గంధమాదాయ సాధకః
సోహంతు మనునాదేవి స్వాధిష్ఠానే ప్రవేశయేత్"

హంస మంత్రధ్యానముతో గుదస్థానమును కుంచింప వలెను. అపుడు జీవాత్మ హృదిస్థానము నుండి మూలాధారమునకు చేరును. కూర్చబీజముతో కుండలినీ ప్రబోధముచేయవలయును. సాధకుడు పద్మాసనమునందుండవలెను. చేతులను అంకమునందుంచుకొనవలయును. చిత్తమును "ఖేచరి" ముద్రతో ఏకాగ్రముచేయవలయును గాలిని పూరించి, కుంభించి, హృదయమును కుంచించ వలయును. గాలి విడువరాదు. అపుడు గుదస్థానమునుకూడ కుంచించి (అపాన వాయుస్తంభన) వాయువును పైకిలాగవలయును. ఆలాగుటవలన మూలాధారకమలమందున కర్ణికలోని త్రికోణవాసియగు కామవాయువును వామావర్తముగ త్రిప్పవలెను. అట్లుచేయుటవలన కామాగ్ని ప్రజ్వలించును. అపుడుకుండలినిమేల్కొనును. స్వయంభూలింగ

మును చేదించి, కూర్చ బీజములతో కుండలినీ శక్తిని పరమ
ి ఖిలాషిణిగానున్నదానిని, ఊర్ధ్వగమనము చేయించవలెను.

కుండలినీశక్తి ఊర్ధ్వ ప్రయాణములో ఆయా చక్రములందలి
ృకలను, దేవతలను దర్శించి, పూజించి, శాశ్వతుని చేటను.
' చక్రములందు దేవి ఆయా దేవతారూపములను ధరించును.
ా వైఖరీ మున్నగు రూపములు) సహస్రారము లోని పరా
వును చేరునప్పటికి పరాస్వరూపమునేధరించును. హంసమత్రి
సుషుమ్నా మార్గమున చక్రభేధనము చేయవలయును.

సహస్రారమునందు కుండలిని శక్తి పరమబిందువు నందైక్య
ము. సాధకులకు శివశక్త్యాత్మకమైన జ్ఞానమువలన పరమసిద్ధి
మును.

కుండలినిని పరబిందువునందు ఐక్యము చేసి, పర బిందువును
న్నయందు ఐక్యము చేయుట సమాధి. ఇదియే రహోయాగము
యాగక్రమారాధ్యా (381) కుండలిని ప్రబోధము గావించి,
పాపములను, ద్వైతభావములనుఅన్నింటిని చిదగ్నిలోహోమము
ఊట. శివశక్తులను సహస్రారమందు కలుపుట. అందు సహ
మందు రహస్యముగవిహరించుట అనుటలో ఇదియేరహస్యము
ర్పణ తర్పితా (382) ఆత్మజ్ఞానాగ్ని యందు సకలమును
' ముప్పదియారు తత్త్వములను, పుణ్యాపుణ్యములను, ధర్మా
ములను హోమమొనరించి రహస్యమున దేవిని భావించి తృప్తి
టు మోక్షము. అపు దేవి "సద్యః ప్రసాదినీ" (383) రహో
ముచే, రహస్తర్పణముచే అప్పుడే అనుగ్రహించునది దేవి.

భ్రమ నివారణయగును. అప్పుడే స్వస్థానమైన సహస్రార ప్రాప్తి (సహస్రారాంబుజరూఢా (105) అనగా స్వస్వరూపమైన చిత్కళ తానేయని తెలుసుకొనుట. సర్వచైతనము చిత్కలదే కాబట్టి సకలమును చిన్మయముగనే భావించుట జరుగును. అదియే జీవన్ముక్తి. (సుధాధారాసారైః స్నపయసి తనుం బైందవకలే)

## కుండలినీ ప్రబోధము

సాధకుడు యమనియమాదులనుపాటించి గురూపదేశమువలన కుండలినీ ప్రబోధ విధానమును ఎరుగవలయును.

"ఆకృష్యప్రణవేనైవ జీవాత్మనం నగేంద్రజే
కుండలిన్యా సహస్రాణం గంధమాదాయ సాధకః
సోహంతు మనునాదేవి స్వాధిష్ఠానే ప్రవేశయేత్"

హంస మంత్రధ్యానముతో గుదస్థానమును కుంచింప వలెను. అపుడు జీవాత్మ హృదిస్థానము నుండి మూలాధారమునకు చేరును. కూర్చబీజముతో కుండలినీ ప్రబోధముచేయవలయును. సాధకుడు పద్మాసనమునందుండవలెను. చేతులను అంకమునందుంచుకొనవలయును. చిత్తమును "ఖేచరీ" ముద్రతో ఏకాగ్రముచేయవలయును గాలిని పూరించి, కుంభించి, హృదయమును కుంచించ వలయును. గాలి విడువరాదు. అపుడు గుదస్థానమునుకూడ కుంచించి (అపాన వాయుస్తంభన) వాయువును పైకిలాగవలయును. ఆలాగుటవలన మూలాధారకమలమందున కర్ణికలోని త్రికోణవాసియగు కామవాయువును వామావర్తముగ త్రిప్పవలెను. అట్లుచేయుటవలన కామాగ్ని ప్రజ్వలించును. అపుడుకుండలినిమేల్కొనును. స్వయంభూలింగ

వక్త్రమును చేదించి, కూర్చ బీజములతో కుండలినీ శక్తిని పరమ హంసాభిలాషిణిగానున్నదానిని, ఊర్ధ్వగమనము చేయించవలెను.

కుండలినీశక్తి ఊర్ధ్వ ప్రయాణములో ఆయా చక్రములందలి మాతృకలను, దేవతలను దర్శించి, పూజించి, శాశ్వతుని చేరును. ఆయా చక్రములందు దేవి ఆయా దేవతారూపములను ధరించును. (అనగా వైఖరీ మున్నగు రూపములు) సహస్రారము లోని పరా బిందువును చేరునప్పటికి పరాస్వరూపమునేధరించును. హంసమంత్రముతో సుషుమ్నా మార్గమున చక్రభేధనము చేయవలయును.

సహస్రారమునందు కుండలిని శక్తి పరమబిందువు నందైక్యమగును. సాధకులకు శివశక్త్యాత్మకమైన జ్ఞానమువలన పరమసిద్ధి లభించును.

కుండలినిని పరబిందువునందు ఐక్యము చేసి, పర బిందువును చిదాత్మయందు ఐక్యము చేయుట సమాధి. ఇదియే రహోయాగము రహోయాగక్రమారాధ్యా (381) కుండలిని ప్రబోధము గావించి, పుణ్యపాపములను, ద్వైతభావములనుఅన్నింటిని చిదగ్నిలోహోమము చేయుట. శివశక్తులను సహస్రారమందు కలుపుట. అందు సహస్రారమందు రహస్యముగవిహరించుట అనుటలో ఇదియేరహస్యము రహస్తర్పణ తర్పితా (382) ఆత్మ జ్ఞానాగ్ని యందు సకలమును అనగా ముప్పదియారు తత్త్వములను, పుణ్యాపుణ్యములను, ధర్మాధర్మములను హోమమొనరించి రహస్యమున దేవిని భావించి తృప్తి పరచుట మోక్షము. అపు దేవి "సద్యః ప్రసాదినీ" (383) రహోయాగముచే, రహస్తర్పణముచే అప్పుడే అనుగ్రహించునది దేవి.

## ద్వాదశదళ పద్మములు

ఇంతకుపూర్వము చెప్పబడిన మూలాధార, స్వాధిష్ఠాన, మణి పూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా' సహస్రార చక్రములు సప్తకమల ములగుచున్నవి. కానీ కొన్ని తంత్రములందు ద్వాదశాంతకమలము లని చెప్పబడియున్నవి. వీటి పరిగణనము ప్రకారము మూలాధా రమునకు క్రింద మూడుచక్రములున్నవి. మరియు విశుద్ధ, ఆజ్ఞా చక్రముల మధ్య ఒక చక్రము, సహస్రి కమలముల పైన షురొక పద్మమున్ను వున్నవి. 1) కుల పద్మము - ఇది మూలాధారము నకు క్రింద రక్తసహస్రరళవద్మమవబడు పేరు గలది. 2) అష్ట దళ వద్మము. 3) షడ్దళ వద్మము. 4) మూలా ధారము. 5) స్వాధిష్ఠానము. 6) మణిపూరకము .7) అనాహతము. 8) విశు ద్ధము 9) తత్కర్ణిక లంబికాగ్రము - అష్టదళవద్మము 10) ఆజ్ఞా వద్మము 11) శుక్ల సహస్రిదళ కమలము 12) తత్కర్ణిక అకుల వద్మము అనునవి. మరియొక వరిగణనము ప్రకారము భ్రూమధ్య మునుండి సహస్రార కమలము వరకు తొమ్మిది చక్రములు కలవు. అవి 1) చంద్రమండలము 2) అర్ధ చంద్రాకారము 3) రోదిని 4) వాదము 5) నాదాంతము 6) శక్తి 7) వ్యాపిక 8) సమనా 8) ఉన్మనా అనునవి,

## కుండలినీ ప్రబోధానుభవములు

మొదట ఈ చక్ర విబేదన కార్యమున కలుగు అనుభవములు స్థూలచిత్తమునకుగోచరించవు. కాని, సాధన, సంకల్పంబులవలన

ఈ కుండలినిశక్తికి పలుమార్లు ప్రబోధించినచో, ఆ అనుభవములు అప్పుడప్పుడు ప్రత్యక్ష గోచరమగును. కుండలిని శక్తి మేల్కొని ఊర్ధ్వముగ పయనించు సందర్భమున చిత్రవిచిత్రమైన అనుభవములు కలుగును. ఈ యోగమునననుసరించవలసిన సాధకుడు నాడీ మండలమును తెలుసుకొని యుండ వలయును. ఇడా, పింగళ, సుషుమ్న నాడుల గూర్చి ఇంతకుపూర్వము చెప్పియుంటిమి. నాడీ చక్రముపొక్కిలి నాశ్రయించియున్నది. అది కోడిగ్రుడ్డు ఆకారం కలిగియుండును. ఇడా, పింగళ నాడులు నాడీచక్రమునుండి పుట్టినవి. నేత్రముల చివరివరకు వ్యాపించియున్న నాడులు గాంధారి హస్తిజిహ్వ అనబడుచున్నవి. చెవులవరకు వ్యాపించినవాటిని పూష అలంపూషఅనెదరు. శుక్ల అనబడునాడి కనుబొమలనడుమయున్నది ముక్కుయొక్క రెండుద్వారములు. చెవుల రెండు ద్వారములు, కనుబొమల క్రింది భాగమున కలిసియున్నవి, ఈప్రదేశమునకు శృంగాటకము, చతుష్పదము అనిపేరు.

గంగా, యమునా, సరస్వతి అను పేర్లు గల ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు కనుబొమలమధ్యస్థానమున చేరుచున్నవి. దీనికి త్రికూటము లేక త్రివేణీసంగమమని పేరు.

సరస్వతి నాడి శాఖ వాక్ప్రసారిణియై నోటియందు నాలుకచివరి వరకు వ్యాపించియున్నది. "విశ్వోదరి" అను నాడి పచనము చేయును. కంఠస్థానమందున్న "పయస్వినీ" నాడి ఆకలిదప్పులను కలిగించును. జలపానము చేయించునది కూడ ఇదియే.

నాడీచక్రమునుండి మూడునాడులు అధోముఖముగా వ్యాపించియున్నవి. "రక్తా" యనునాడి రేతస్సును, "సినీవాలి" అను నాడి మూత్రమును, "కుహూ" అనునాడి మలమును బయటికి త్రోయును.

"శంఖినీ, దామినీ" నాడులు భుజింపబడిన ఆహారసారమునుగ్రహించి బ్రహ్మరంధ్రమందుచేరి అమృతమునుకలిగించుచున్నది, హృదయ స్థానమైన అనాహత చక్రమున నూటొక్క నాడులున్నవి. వాటిలో ఒకటీ అమృతనాడీ. ఇదియే మోక్ష మార్గము. కఠోపనిషత్తులో "శతైంచైకాచ హృదయస్య నాడ్యః - తాసాం మూర్ధానమభినిస్సృతైక యోర్ధ్వమాయన్నమృతత్వమేతి,"

ఈ నాడులన్నింటిలోనూ ఇడా, పింగళ, సుషుమ్నా నాడులు ముఖ్యమైనవి, సుషుమ్నా నాడికి "నా డీ శి రో మ ణి" యనిపేరు. మొత్తము డెబ్బది రెండు వేల నాడులున్నవి. ఇవి దేహమంతటా వ్యాపించియున్నవి, వీటన్నింటియందు రంధ్రములున్నవి. వీటి యందు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, నాగ, కూర్మ కృకర, దేవదత్త, ధనుంజయములనెడి దశ విధ ప్రాణములు సంచ రించుచుండును. ఈ ప్రాణములను ఆయా నాడులందు రే చ క, పూర్వక, కుంభక విధానమున ప్రాణాయామముతో, ప్రవర్తింప చేసినచో అమృతశక్తులతో, క్రమ క్రమముగా కుండలినీని సహస్రా రమునకుచేర్చి నిర్వికల్పసమాధి అనగా జీవన్ముక్తిని పొందవచ్చును.

ఈవిధానమందు ఒక్కొక్క చక్రమునందు కుండలిని ప్రవేశించి నప్పుడు కొన్ని అనుభవములు కలుగుచుండునని ఇదివరకు వివరించి యుంటిమి. అ త ని కి అష్టసిద్ధులు, దూరదృష్టి, దూరశ్రవణము, సర్వజ్ఞత్వము, ఆకాశగమనము, పరకాయప్రవేశము వంటి అద్భుత శక్తులు కలుగునని శాస్త్రప్రమాణమే కాక చాలామందియోగులు అటు వంటి సిద్ధులను పొందిరని చారిత్రక ఋజువులు కూడ కలవు, ఇటు వంటి సిద్ధులు కుండలినీయోగమును చేయువారికే కాక, భక్తిమార్గ

గాములకు, జ్ఞానులకు కూడా కలుగునని "భక్త విజయము" వంటి గ్రంథముల వల్లను, పురాణముల వల్లనూ తెలియుచున్నది. ఈ సిద్ధులుకూడా కేవలము నశ్వరములు: వాటియందు వైరాగ్యముండిననే గాని జీవన్ముక్తి కలుగదు. ఎందరో సాధకులు కడపటి మెట్టు వరకు వచ్చి జారిపోయినవారిని గురించి మనము తెలుసుకొనుచునే యున్నాము.



# శ్రీ చక్రము

లలితా సహస్రనామస్తోత్రములో దేవిని కీర్తించుచూ శ్రీచక్ర రాజనిలయా (996) : శ్రీమత్ త్రిపురసుందరీ (997) : శ్రీ శివా (998) : శివశక్త్యైక్యరూపిణి (999) : లలితాంబికా (1000) అను నామములతో ఆస్తోత్రమును పూర్తిచేయబడినది, త్రికోణగా (986), బైందవాసనా (905), వర్ణరూపిణీ (850), మాతృకావర్ణ రూపిణీ (577), చక్రరాజని కేతనా (245), చంద్రవిద్యా (239), చంద్ర మండల మధ్యగా (240), మను విద్యా (241), మహా మంత్రా (227). మహాయంత్రా (228) అను నామములచే శ్రీచక్రమే దేవి స్వరూపమని వాగ్దేవతలు రిర్ణయించిరి.

> "చక్రస్యాపి మహేశ్యాన భేదలేశోపి భావ్యతే విబుధైః
> అనయో స్సూక్ష్మకారా పరైవసా స్థూలయోశ్చ కాపిభిదా ॥
> (కా. క. వి. : 21వ సూత్రం)

ఇంతకుముందు శ్రీదేవికి శ్రీవిద్యకు భేదములేదని, చెప్పియుంటిమి. పరాశక్తికిని శ్రీ చక్రమునకును ఏ మాత్రము కూడ భేదము లేదని, కాషకలావిలాస, కర్త తమ గ్రంథము నందు నిరూపించి యున్నారు. శ్రీదేవియే శ్రీచక్రము.

మన మహర్షులు పరతత్త్వము యొక్క ప్రత్యక్షానుభవమును పొందినవారై, ఈ దృశ్యమాన జగత్తునందంతర్గతముగా యున్న ఏకమైన పరాశక్తిని దర్శించారు. వారు ఈ జగత్తులోని అనంతము లయినవివిధశక్తులు, దేవతలు, ప్రాణులుఅన్నియును అపరబ్రహ్మము

నుండియే ఉద్భవించినను, వేటికి అవి ప్రత్యేకగుణములు, ప్రత్యేక కార్యములకొరకు ఉద్దేశింప బడినవనియూ కనుగొనిరి, ఒకే గొలుసు లోని ప్రతిఉంగరమునకు ఏప్రయోజనముకలదో, ఒకే దేహములోని ఒక్కొక్క అవయవమునకు ఏ స్థానము కలదో, అదే విధముగా సృష్టి లోని ప్రతిదేవతకు ఒక నిర్ణీత ప్రయోజనము, పని విభజన కలదు. ఒక్కొక్క దేవతకు ఈ విశ్వ సామ్రాజ్యము నందు నిర్వహించవలసిన పనులు నిర్దేశింపబడియున్నవి.

వేదవాక్కులచే ఆ దేవతలు ప్రత్యక్షముకాగలరు అనేసత్యాన్ని కనుగొనిన అమహర్షులు మన అందరికీ ఆచరణ యోగ్యమైన "తంత్ర శాస్త్రములను" రూపొందించారు. తంత్రశాస్త్రములే మంత్రశాస్త్రములు పరబ్రహ్మ మొక్కటేననిచాటుతూనే, ఈవిశ్వముకూడా ఆ పరబ్రహ్మము యొక్క రూపమేనని వారువిశ్వసించారు. విశ్వము మాయయే అని చాటుతూనే, అమాయయే జగత్కారణమని చెప్పారు, వేదవాక్కులే నాదము. అదియే "ఆద్యస్పందము." అందుండి బీజాక్షరములు ఉద్భవించినవి. ఇవియే మంత్రములుగా పరిణమించినవి. ఈ ఆద్యస్పందనమునుంచి వెలువడిన శబ్ద తరంగములను ఆ మహర్షులు అంతశ్శక్తిచే వినుటయే గాక, ఆ శబ్దతరంగములలో ఒక యంత్రా కృతిని దర్శించగలిగిరి. మంత్రము ఆదేవతయొక్క నాదరూపము యంత్రమూ ఆ దేవత యొక్క రూపమే. నామ రూప రహితమైన బ్రహ్మము, నామరూపములు గలదిగా అయెను. మంత్రము నామ ముగా. యంత్రమురూపముగా గుర్తించుటయే తంత్రశాస్త్రములోని రహస్యము: తంత్రసాధనలో సాధకుడు యంత్రముతోతాదాత్మ్యము చెందుటయే గాక, నామరూప రహితమైన పరాశక్తితో తాదాత్మ్యము

చెందుటయే లక్ష్యము. యంత్రమనగా తాను ఆరాధించుదేవియొక్క స్వరూపమే. ఈ యంత్రము దేవి యొక్క ఘనీభవించిన. సర్వ శక్త్యాత్మకమైన తరుగని గని. మరొకవిధంగాచెప్పాలంటె ఏవిధము గను నియంత్రించబడలేని సర్వశక్తిని ఈయంత్రమునందు నిక్షిప్తం చేయబడియున్నది. దీనిని చక్రమందుము. చక్రము ఎల్లప్పుడు పరిభ్రమించు చుండును. పరబ్రహ్మము యొక్క చైతన్య శక్తిని సూచించునదిచక్రము చక్రమునకు ఆద్యంతములుండవు. కేంద్ర బిందువునుండి పరిధివరకూఎక్కడకొలిచినను సమానముగయుండును చక్రారాధనము, ప్రతిమారాధనముకన్ననూ శక్తివంతమైనది. మంత్రమువలె యంత్రముకూడ మహిమోపేతమైనది. తంత్ర శాస్త్రము నందు యంత్రమునకే ప్రాధాన్యత నివ్వబడినది. రేఖలతో కూడిన యంత్రమునందు, జగనిర్మాణముగావించిన ఆమహాశిల్పి సృష్టించిన సౌందర్యాన్ని, పరస్పరసమన్వయతను, క్రమమును మనముగాంచ గలము. చక్రము నందు సరళరేఖలు, వృత్తములు, కోణములు చతురస్రములు కలవు. చక్రములన్నియు పద్మాకారముగానేయుండును. ఇవన్నియు జగత్ చక్రమునకు ఆ మహర్షులు కల్పించిన ఊహాచిత్రములేనని మరవకూడదు. ఆ ఊహలు కూడా కల్పితములు కావు.

శ్రీచక్రమును గూర్చి విచారించెదము. ఇది చక్రరాజము. తంత్రశాస్త్రమునందు విశేషముగా స్తుతింపబడినది ఈచక్రము. ఇందు లలితాదేవి ఎల్లప్పుడూ నివసించియుండును. ఈమెఎల్లలోకములకు పైన వర్తించు చుండును. "లోకాన్ అతీత్య లాలయతే లలితా" లలితాసహస్రనామ పూర్వ పీఠికలో, దేవి దర్శనార్థము కోట్ల బ్రహ్మ సరస్వతులు, కోట్ల లక్ష్మీనారాయణులు, శివపార్వతులు వచ్చినారట.

ఈ వర్ణనచే దేవియొక్క మహాత్మ్యమెంత గొప్పదో తెలుసుకోగలము. ఈవిశ్వాంతరాళములో ఎన్ని బ్రహ్మాండములున్నతో, అవి అన్నియు సృష్టి స్థితి లయములు చెందుచున్నవో, ప్రతి బ్రహ్మాండమునకు ఒక బ్రహ్మ, ఒక విష్ణువు, ఒక రుద్రుడున్నారో - వీరందరి కార్యములకు ఆధిపత్యము వహించునది శ్రీదేవి. ఆమెయే రాజరాజేశ్వరి. ఆమె స్థానము కాబట్టి ఇది చక్రరాజము. ఏరీతిగా శ్రీదేవి అన్ని దేవతలకు ఆధారభూతురాలో ఈచక్రము కూడా అన్ని చక్రములను తనయందు ఇమిడిండుకొని యున్నది.

శ్రీచక్రమును పరిశీలించి చూడండి. అందులోని సౌందర్యం ఆ కోణముల నిర్మాణ వైశిష్ట్యం, గణిత శాస్త్ర నైపుణ్యం వుట్టిపడుతూ వుంటుంది, ఏ ఇతరచక్రంలోను ఇంతటి నిర్దుష్టతలేదు. ఆధ్యాత్మిక అయస్కాంతక్షేత్రాల శాశ్వతశక్తులసమ్మేళనము రేఖలుగా, కోణాలుగ పద్మములుగా, వలయములుగా పైశక్తులను భావించిచిత్రించబడుట ఊహకందని విషయం. మహా త్రిపుర సుందరిని ఇంతకన్నా మరొక విధంగా ఊహించుటకు సాధ్యపడదు.

ఈ చక్రమును అరాధించినచో అన్ని దేవతా మూర్తులను ఆరాధించినట్లేనని తంత్రశాస్త్రములుతెలుపుచున్నవి. దీనిని లలితాచక్రమని గానీ, త్రిపుర సుందరీ చక్రమని గానీ వ్యవహరించరు. శ్రీ అనగా శుభకరమయినది, దీనికి నవయోని చక్రమని పేరు కలదు—తొమ్మిది కోణములుగల చక్రము కాన నవచక్రమనికూడా అందురు. ఇందులో తొమ్మిది చక్రములు కలవు. దీనిని వియత్ చక్రమని కూడా అనెదరు హృదయాకాశమందు ఈ చక్రమును భావించి ధ్యానించుట చేతను బాహ్యకాశమందు అనగా బయట రాగి, బంగారు, వెండి రేకుల మీద

లిఖించిగానీ, రాతితో చెక్కి గానీ పూజించుట చేతను దీనిని ఆరాధించ వచ్చును. దీనికి మరొక పేరు మాతృకా చక్రము, అనగా ఇందు త్రిదేవియే కాక ఆమె శక్తులు, ఆమె పరివారములు కూడా కలరు.

సకలాభీష్టములనొసంగునది కాన ఐహిక ఫలముల నిచ్చుటయె కాక జ్ఞానదాయిని కాబట్టి దీనికి "సిద్ధివ్రజ చక్రమ"ని పేరు కలిగినది.

శ్రీచక్రం యొక్క అంతరార్ధాన్ని గ్రహించినచో ఇది జగత్కార ణమగు మాయాశబలితబ్రహ్మవిశేషంను నిరూపించుచున్నది. అనగా జగత్ సృష్టికి కారణ మయిన శివ శక్తి తత్వాన్ని ప్రదర్శించును. నవాత్మకమగు మహాశక్తియొక్క రూపమే శ్రీచక్రం.

"చతుర్భిః శివచక్రశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః
శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః"

శివపరమైన త్రికోణములు నాలుగు, శక్తిపరమైనవి అయిదు. మొత్తం తొమ్మిది. అందుచేత ఇది శివశక్త్యాత్మకము.

## శ్రీచక్రావిర్భావము

ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ. ఉండేదిబ్రహ్మమొకటే: అది సత్ చిత్ ఆనందస్వరూపములు కలది. అది అచలము. నిశ్చలము అయినను చేతనమనుబీజమును తనయందేకలిగియున్నది. అందులో ఒక స్పందన, ఒక సంకల్పము కలిగినది. "సోఽకామయత బహు స్యాం ప్రజాయే యేతి". అంతవరకు కేవల ప్రకాశరూపముగా యుం డిన పరబ్రహ్మము నందు ఈ కదలిక ఏర్పడగానే తంత్ర శాస్త్రజ్ఞులు

దానిని "విమర్శ" అనిరి. విమర్శ యనగా ఆలోచించుట. తన్ను తాను చూచుకొనుట. "కామకళా విలాస" కర్త దీనిని రమ్యముగా అద్దము వంటిదన్నారు విమర్శను - ప్రకాశము ఈ విమర్శ యను అద్దమందు తననే తాను సందర్శించుకొనినాడట. అందుచే అనంత మైన అప్రకాశరూపము "తుచ్ఛ్య" మైనది. అనగా విభజింపబడి నది. అని వేదము ప్రతిపాదించినది. తంత్రశాస్త్రము దానిని "కళ అని పేర్కొనినది. "కళ" అనగా ఒక విభాగము లేక డిజిట్.

ఈమొదటికోరికను "కామకళ" అని తాంత్రికులు నామకరణము చేసిరి. ప్రకాశమును పరమశివుడుగను, విమర్శను పరాశక్తి గాను భావించిరి. ఈ ప్రాథమిక కదలిక వలన నాదమేర్పడినది. మొట్ట మొదట ఈనాదము సూక్ష్మరూపముగా బిందువుగా ఏర్పడినది. ఈ బిందువునందే కేంద్రీకరింపబడిన శివశక్తుల విజృంభణకలదు. కామే శ్వర కామేశ్వరీ స్వరూపము బిందు గలవు, దీనినే పరాబిందువుగా గుర్తించిరి. ఈ పరాబిందువు నందే భావి చరాచర జగన్నిర్మాణము నకు కావలసిన శక్తి బీజప్రాయముగాయున్నది. సృష్టికి ఉన్ముఖ మయినపుడు ఆ పరాబిందువు కొంత క్రిందికి దిగి వచ్చి అపరాబిందు వుగా అనగా శబ్దబ్రహ్మముగామారును. అనగా శనగగింజలోరెండు పప్పులున్నను చుట్టూ పొట్టు వున్నట్లు శివశక్తులు ఒకటిగాయున్నారు అందుచేత ఒకటిగావున్న పరాబిందువునుంచి మూడుబిందువులు ఏర్ప డినవి. శివశక్తులొక్కటిగా యున్న బిందువు, అచేతనంగా వున్న శివుడు, చేతన స్వరూపమైన శక్తి. ఈ మూడున్నూ ఒకేసారి సృష్టిగా పరిణమించినది. ఈ మూడు బిందువులు మొదటి త్రికోణ ముగా ఏర్పడినది. ఈ త్రికోణమే త్రిగుణాత్మకము. త్రిపుటుల సమ్మేళనము. త్రిపురముల యొక్క స్థానము. విమర్శనుండియే

నాద బ్రహ్మముత్పన్నమాయెను. ప్రకాశమునుండి ప్రారంభమయ్యే ప్రతిఅంశమున్నూ అవినాభావమైన శివశక్తులసమ్మేళనము. దాని దాని స్థాయికి తగినట్లు ఏర్పడుచున్నవి.

ఈ నాదము శబ్దముగా మారి, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీలుగా మారి, మాతృకలుగా మారును. తాంత్రికులు ఈమాతృకలను ఆశ్రయించి క్రమ క్రమముగా పైకి పోయి, స్వస్థానమైన ప్రకాశరూపమైన పరబ్రహ్మమునందుకోవచ్చునని ఈ తంత్ర శాస్త్రమును ఏర్పరచిరి.

ఈ విధముగ నీ బిందువు సర్వమునకు ప్రథమ కారణముగాను ఉన్నది. ఈ చక్రమందుగల తొమ్మిది చక్రములు రూపమునకును, నీ బిందువు నామమునకును సంకేతములు. అందుచేత ఈనకల చరాచర జగత్తులకు నామరూపములకు,అనగా పద + అర్థములకు శ్రీచక్రముతో సంపూర్ణ అన్వయము కలుగుచున్నది.

ఈ బిందువునే ఋతము, ఆత్మ, పర బ్రహ్మము, సచ్చిదానందము అనునామములతో వ్యవహరించెదరు. యదార్థముగ అది నిర్గుణము. దానికి నామరూపములులేవు. అది తేజోమయము. అదియే శ్రీచక్రమునకు ఆధారము. కారణముకూడ అదియే. దీని ప్రభావము వలన సూర్యుని నుండి కిరణసమూహము వలె త్రికోణమండలములు పుట్టుచున్నవి, ఇది ఇచ్ఛాశక్తి ప్రభావమున కలిగినది. ఈ పరాబిందువును ఆవరించియున్న త్రికోణాకారమునకుగల కోణత్రయమందు పశ్యంతీ, మధ్యమా, వైఖరీశక్తి త్రయమునకు సూచనము గా వాగ్భవ కామరాజ శక్తి బీజములు గోచరించును. అదియే

ఈ, హం, అహంరూపములు. దీనినాశ్రయించి నవచక్రాత్మకమగు శ్రీచక్రము కల్గియున్నది.

"ఏవం కామ కలాత్మా బిందుతత్త్వ స్వరూప వర్ణమయీ
సేయం త్రికోణరూపం, యాతా త్రిగుణ స్వరూపిణీ మాతా॥
(కా.క.వి. _ 25)

ఈయోని చక్రాకారముగా నున్న రేఖా త్రయమందు అవ్యక్త స్వరూపములుగల, తేజోమయములైన, "అ" నుండి "క్ష" వరకు గల మాతృకావర్ణములును, మూలమంత్రమందుగల క, ఏ, ఈ, ల హ్రీం: హ, స, క, హ, ల, హ్రీం; స, క, ల, హ్రీం అను బీజాక్షరములతో కూడిన వాగ్భవ, కామరాజ, శక్తి కూటములును షోడశనిత్యాస్వరూపములగు "అ" నుండి "అః" వరకుగల స్వరములను, తేజోమయ రేఖాకారమును పొందియున్నవి. ఈ కోణ బిందువులు, చంద్ర, అగ్ని, సూర్యమండలత్రయము, సత్త్వరజస్తమము అనే గుణత్రయము, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తిత్రయము, బ్రహ్మవిష్ణు రుద్రులనే మూర్తి త్రయము జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాతృలనే త్రిపుటియు ఈ బిందురేఖల సమష్టి స్వరూపము.

## శ్రీచక్ర నిర్మాణము

"బిందు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వశ్రీ నాగదళ సంయుత షోడశారమ్
వృత్తత్రయంచ ధరణీ సదనత్రయంచ
శ్రీ చక్రమేతదుదితం పరదేవతాయాః॥

బిందువు, త్రికోణము, అష్ట కోణ చక్రము, అంతర్ద శారము, బహిర్దశారమను దశత్రికోణచక్రము, చతుర్దశారము, అష్టదళపద్మము షోడశదళపద్మము, భూపురము - అను ఉ తొమ్మిది ఆవరణములతో కూడినది శ్రీచక్రము. ఈ చక్రస్వరూపమునుగూర్చి అన్ని తాంత్రిక గ్రంథములలోను, ఉపనిషత్తులలోను కీర్తింపబడినది.

ఈ శివచక్ర, శక్తిచక్రములు తొమ్మిదియును తొమ్మిదియోను లని వ్యవహరించెదరు. త్రికోణ, అష్టకోణ, దశకోణ ద్వయము, చతుర్దశకోణములు ఐదున్ను శక్తికోణములు. బిందువు, అష్టదళము షోడశదళము, చతురస్రము - ఈ నాలుగున్ను శివచక్రములు

## 1. బిందువు

బిందువు మొదలు భూపురమువరకు సృష్టి క్రమమున తొమ్మిది ఆవరణలు కలవు. సృష్టిక్రమమున బిందువుమొదటిది. దీనికిసర్వానందమయ చక్రమని పేరు. దీని ప్రకృతి కూడా బిందువే. దీని తత్త్వము పంచబ్రహ్మాత్మకము. చక్రేశ్వరి శ్రీ త్రిపుర సుందరిదేవి ఇక్కడ ప్రదర్శనాయోగ్యమైన ముద్ర సర్వయోనిముద్ర. స్థాయీ భావము శమము. శాంతరసము ప్రధానమైనది. సర్వభావ నవ రస భరితమైనది. ఇచ్చట గల యోగిని పరాపర రహస్య యోగిని పూజాక్రమము ప్రదక్షిణం : ఏం, హ్రైం, హ్క్లీం, హ్సౌః - అను నవి బీజమంత్రములు. ఈదేవి చంద్రకలాకిరీటము కలిగియున్నవి సూర్య, చంద్ర, అగ్ని నేత్ర త్రయము. ఎప్పుడూ మంద స్మిత ఇచ్ఛాశక్తియనుపాశమును, జ్ఞానశక్తియనుఅంకుశమును, మనస్సే అనెడి ఇక్షుకోదండమును, పంచతన్మాత్రలను పుష్పబాణముల ధరించిన

నాలుగు చేతులుకలది. బాలసూర్యునివంటి సూర్యకాంతికలది. దివ్యమైన గంధ, మాల్యాభరణముల చేత అలంకరించు కొని యున్నది. అమెవలెనే అలంకరించు కొనిన నవావరణ దేవతలచే సేవింపబడు చున్నది. అమె కామేశ్వరుని వామాంకమున కూర్చొని యున్నది. ఈ బిందువే మూలప్రకృతి. బింబ, భూత, శుద్ధబ్రహ్మస్వరూపము మిగిలినవి శబల బ్రహ్మస్వరూపములు. ఈ బింమవు నందు "ఓం, ఈం, ఈం, నమః" అనునది బీజన్యాసము.

## త్రికోణచక్రము

"ఏతత్పశ్యంతాది త్రితయ నిదానం త్రిబీజ రూపంచ
వామా, జ్యేష్ఠా, రౌద్రీచాంబిక యానుత్తరాంశ భూతాః స్యు."
(కా.క.వి. - 23)

"ఇచ్ఛాజ్ఞాన క్రియాశాంతాశ్చైతాశ్చోత్తరావయవాః
వ్యస్తావస్తతద్వర్గద్వయమిదమేకాదశాత్మ పశ్యంతీ.।"
(కా.క.వి. - 24)

"ఏవం కామకలాత్మా త్రిబిందు తత్త్వస్వరూపమయీ
సేయం త్రికోణరూపం యాతా త్రిగుణ స్వరూపిణీ మాతా ॥
(కా.క.వి. - 25)

త్రికోణచక్రముయొక్క ముడుకోణములందును మూడు బిందువులున్నవి. మధ్యలో ఒక బిందువు. అదియే సర్వానందమయ చక్రమని మొదటి ఆవరణమని వివరించితిమి. దానినే ఓడ్యాణపీఠం అనెదరు. అందు కామేశ్వరీ కామేశ్వరులు విహరించు చుండెదరు.

వారిని ఆది ద్వంద్వమనెదము. అద్వంద్వము సృష్ట్యారంభ మందు లీలగా సత్వాది గుణభేదములననుసరించి. మూడు ద్వంద్వ ములుగా త్రికోణబిందువులందు ప్రకాశించుచున్నది, ఉత్తరకోణస్థ బిందువు జాలంధర పీఠము. అందున్న ద్వంద్వము కామేశీ శ్రీషు దూర్ద్వనాథాత్మకము. వీరు సోమరాజబీజాధిష్ఠాతలు: ఉమా మహే శ్వరులు. దక్షిణ కోణస్థ బిందువు పూర్ణగిరి పీఠము, అందున్న ద్వంద్వము వజ్రేశ్వరి షష్టీశదేవనాదాత్మకము. వీరు కామరాజబీజా ధిష్ఠాతలు. వీరు లక్ష్మీనారాయణులు స్వాగ్రకోణస్థబిందువు కామ గిరి పీఠము. అందున్న ద్వంద్వము భగమాలినీ మిత్రేశనాథాత్మ కము. వీరు వాగ్భవ బీజాధిపతులు. వీరు వాణీ హిరణ్యగర్భులు. బంధూక పుష్పబంధం కిరణములు.

ఈ త్రికోణచక్రమ త్రికోణాకృతికలది. ఇది సర్వసిద్ధిప్రదా చక్రము. నాదప్రకృతి కలది. దీని తత్త్వము గుణత్రయము. ఇట పూజ ప్రాదక్షిణము. కామేశ్వరి, వజ్రేశ్వరీ, భగమాలినీ కోణ త్రయము దేవతలు. ఇట నున్నది అతి రహస్య యోగిని. చక్రేశ్వరి త్రిపురాంబ. ఈ దేవతాముద్ర సర్వబిజముద్ర. ముద్రాబీజము హ్స్రైః స్థాయీభావము విస్మయము. ఇచ్చటి రసము అద్భుతం శ్రీపరాదేవి శారీరక విరాట్టునందు అవ్యక్త, మహత్త్వాహంకారంతే ద్వంద్వ త్రియము. ఇచ్చట వామావర్తముగా ఐం, క్లీం, సౌః బీజన్యాసము.

## అవ్యక్తము

(అవ్యక్తా) బిందుస్వరూపమైన పరమాత్మ యందు స్పందన శక్తి కలిగినపుడు - ఎండ మావులందు నీరు కలదనె భ్రమ వల్లె,

స్థాణువును చూచిచోరుడను భ్రమ కలిగినట్లు, త్రాడును చూచి సర్ప మని భ్రమించినట్లు, అద్దమునందు ప్రతిబింబము వలె ఎరుపు, తెలుపు, నలుపు రంగులు కల సత్త్వ రజస్తమో గుణ మిశ్రమమైన మూల ప్రకృతి అంగనా రూపముగా పరమేశ్వర పురో భాగమున అద్దము వలె ప్రాదుర్భవించినది: దాని యందు ప్రతిబింబించిన ఆత్మ ప్రతిబింబము సాక్షియని పిలువబడుచున్నది.

"పరశివ రవికర నికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే
ప్రతిరుచి రుచిరే కుడ్యే చిత్తమయే నివశతే మహాబిందుః॥

(కా.క.వి. - 4)

ఆ ప్రకృతి స్వరూపాంతరమును పొంది సత్వోద్రిక్తమై అవ్యక్తమని చెప్పబడుచున్న ఆవరణశక్తి అయినది. దీనియందు ప్రతి బింబించిన ప్రతిబింబము ఈశ్వరచైతన్యము. ఈ ప్రతిబింబము నకు ఉపాధియే మాయ. ఈశ్వరునకు మాయస్వాధీనమందుండును ఈశ్వరుడు సృష్టి స్థితి లయములకు అధికర్త. ఆయనజగదంకురము

"సకల భువనోదయ స్థితిలయమయ లీలా వినోదనోద్యుక్తః
అంతర్లీన విమర్శః పాతు మహేశః ప్రకాశమాత్ర తనుః॥"

(కా.క.వి. - 1)

భావి యందు వికసించెడు సకల జగత్తు ఆయనయందిమిడి యున్నది. అనుగ్రహ తిరోధానములనెడి శక్తులతని స్వాధినమం దున్నవి.

## మహత్తత్వము

(మహతీ) తృతీయబిందువు మహత్తత్వస్వరూపము. ఈశ్వర ప్రతిబింబకారణశక్తి రజోగుణోద్రిక్తమయి "మహత్"అను పేరు గల విక్షేపశక్తి యావిర్భవించినది, అందుగల ప్రతిబింబము హిరణ్య గర్భుడు. ఇతడు దృశ్యా దృశ్య రూపముగలిగి మహత త్వాభిమా నిగాయున్నాడు.

## అహంకారము

హిరణ్యగర్భునితో కూడిన విక్షేపశక్తి తమో గుణోద్రిక్త మయి అహంకారమనే స్థూలశక్తి యావిర్భవించినది, అందుగల ప్రతిబింబం సర్వ స్థూలపాలకుడయిన విష్ణువను ప్రధాన పురుషుడయినాడు అం దుండి భూతపంచీకరణము జరిగి రూపసృష్టి ఏర్పడినది.

## అష్టకోణచక్రము

"శహసమ వర్గమయం తద్వసుకోణం మధ్యకోణ విస్తారః
శవకోణ మధ్యంచే తస్మిన్ చిద్దీప దీపితే దశకే."॥

(కా.క.వి. - 29)

బిందువునుండి త్రికోణము, దానినుండి అష్టకోణచక్రముఏర్ప డినది. ఆబిందు, యోనిచక్రములతేజస్సుఅయిన అవ్యక్తమాతృకా రూప తేజస్సుతో ఎనిమిది కళలైన శ, ష. స, వ, ఫ, బ, భ, మ - లు స్థూలములై ఎనిమిది కోణములుగా విజసించినవి. ఈ

ఎనిమిది కోణములు, బిందు త్రికోణములుకలిసి, ఈపదివస్తువులున్నూ మధ్యనున్న పరమాత్మ చిత్కళఅను దీపముచే ప్రకాశించుచున్నవి ఒక దీపము ఇతరదీపములను వెలిగించునట్లు అపుడు అనేక దీపకాంతులధికమైనట్లు, ఈ కోణములు వెలుగొందు చున్నవి. (కొందరు ఇచట అష్టవర్గాదివర్ణములు అనగా అం, కం, చం, టం, తం, పం యం, శం-వర్ణములు కలవని చెప్పుదురు.) ఈ చక్రమునకుపేరు సర్వరోగహరణచక్రమని పేరు. కకార ప్రకృతికము. ఇచటపూజ ప్రాదక్షిణము. ఇందు ఎనిమిది మంది వాగ్దేవతలు: వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, కౌళినీ, సర్వేశ్వరీ అను నామములు కలవారు కలరు. వీరి రంగు సంధ్యారాగ అరుణిమ. వీరు రహస్యయోగినులు. చక్రేశ్వరి త్రిపురా సిద్ధాంబ. ముద్ర సర్వ ఖేచరీ ముద్ర. ముద్రా బీజము హ్స్ప్రెం. స్థాయీ భావము హాసము. రసము హాస్యరసము.

శ్రీచక్రమే శరీరముగానున్న సంవిద్రూప పరాశక్తి యొక్క మనోబుద్ధ్యహంకారములు, పంచ భూతములు, మొత్తము ఎనిమిది యున్ను అష్టకోణ స్వరూపావస్థితములు. రెండవ ఆవరణ మండలి విష్ణువునుండి పంచ భూతములు పుట్టినవి. "తస్మాదాత్మాన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, తాని పంచతన్మాత్రాణి గుణాభవంతి."

## 4. అంతర్దశారము

"తచ్ఛాయా ద్వితయమిదం దశార చక్రద్వయాత్మనా వితతం
తటచక వర్గ చతుష్టయ విలసన విస్పష్టకోణ విస్తారః॥"

(కా.క.వి. - 30)

బిందువు ప్రకాశాంశము. త్రికోణవసుకోణములు విమర్శాంశలు. ఈ మూటి తేజస్సు వలన దశారద్వయ మేర్పడినది, ప్రకాశాంశ తేజస్సు అంతర్దశారముగను, విమర్శాంశ తేజస్సు బహిర్దశారముగను ఏర్పడినవి. అవ్యక్త మాతృకయందంకురముగా నున్న త, థ, ద ధ, న, ట, ఠ, డ, ఢ, ణ - ఈపదిబీజములు అంతర్దశారముగాను: చ, ఛ, జ, ఝ, ఞ, క, ఖ, గ, ఘ, ఙ - ఈపదిబీజములు బహిర్దశార కోణములుగను పరిణమించినవి. ఇది దశకోణాకృతి కలది. అంతర్దశారమునకు "సర్వరక్షాకర" చక్రమని పేరు. దీని ప్రకృతి రేఫ. దీని తత్త్వము అగ్ని. ఇది జపాపుష్పరంగుకలది. ఇచట పూజవామావర్తము. సర్వజ్ఞా, సర్వశక్తి, సర్వైశ్వర్య ప్రదాయినీ సర్వజ్ఞానమయీ, సర్వవ్యాధి వినాశినీ, సర్వాధార స్వరూపా, సర్వ పాపహరీ, సర్వానందమయీ, సర్వరక్షా స్వరూపిణి, సర్వేప్సిత ఫల ప్రదా అను పదిమంది దేవతలున్నారు. ఇచట గర్భ యోగినులు ఉన్నారు, ముద్ర సర్వమహాంకుశ ముద్ర. ముద్రా బీజము "క్రోం". క్రోధము స్థాయీ భావము. రసము రౌద్రము, కం, ఖం, గం, ఘం, ఙం, చం, ఛం. ఝం, ఞం - అను బిజన్యాసము కలది. వామావర్తముగా యున్నది. శ్రీచక్రశరీరముగా నున్న సంవిద్రూప పరదేవత యొక్క విషయ వృత్తులే ఇచట సర్వజ్ఞాది శక్తిరూపములైనవి.

## 5. బహిర్ధశారము

ఇది కూడా దశ కోణములు కలది. దీని పేరు సర్వార్థ సాధక చక్రము. "ఏ"కార ప్రకృతి కలదు. దశావతారాత్మకమైనది. పిం

ధుర వర్ణము కలది. ఇచట పూజపాౖదక్షిణము. ఇందు పదిమంది దేవతలున్నారు. వారిపేర్లు: 1) సర్వసిద్ధిౖపదా 2) సర్వసంపత్ప్రదా 3) సర్వప్రియంకరి 4) సర్వమంగళకరి 5) సర్వకామప్రదా 6) సర్వదుఃఖవిమోచని 7) సర్వమృత్యు ప్రశమని 8) సర్వవిఘ్న నివారిణి 9) సర్వాంగ సుందరి 10) సర్వ సౌభాగ్య దాయిని ఇచట కుళోత్తీర్ణ యోగినులు. చక్రేశ్వరిత్రిపురా. ముద్రసర్వోన్మాదినీముద్ర. ముద్రా బీజము సః జుగుప్స స్థాయీభావం రసము భీబత్సము. బీజన్యాసము స్వాగ్రకోణనుంచి ప్రదక్షిణముగ టం, ఠం, డం, ఢం, ణం, తం. థం, దం, ధం, నం - శ్రీ చక్ర శరీరముగా నున్న సంవిద్రూప పర దేవత యొక్క జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము. ఈ పది యున్ను సర్వసిద్ధి ప్రదాది దేవతలుగా యున్నారు. ఇది ఈ సృష్టిలోని "రూపశాఖ" భాగములు.

## 6 చతుర్ద శారము

"ఏతచ్చక్ర చతుష్క ప్రకాశమేతం దశార పరిణామః
ఆది సర్గగణగత చతుర్దశ వర్ణమయం చతుర్దశారమిదం॥

(కా.క.వి. - 31)

"భువనార చక్రభువనా దేవీ మనుకరణ వివరణ స్ఫురణాః
సంధ్యాసవర్ణ వసనాస్సంచిత్యాస్సం ప్రదాయ యోగిన్యః॥

(కా.క.వి. - 43)

వెనుక చెప్పిన నాలుగు చక్రములకాంతితో కూడుకొనిన దశార చక్ర పరిణామము అకారాది స్వరములలోని పదునాలుగు అక్షరముల స్వరూపములై ఈ చతుర్దశారచక్రము అగుచున్నది. ఇటుల ప్రతి చక్రికాంతి, చంద్రునికి, సూర్యునికిచుట్టూ ఏర్పడేపరివేషముమాదిరి ఆ చక్రమునాక్రమించియే మరొక చక్రమేర్పడుచున్నది. ఈవిధముగా స్పష్టమై ఖరీ స్వరూపమేర్పడి యేబదిఒక్క అక్షరములు సకల వ్యవహారములకు అనువుగా పరిణమించే సర్వ "నామ" శాఖగా సృష్టి యేర్పడినది.

దీనికి పదునాలుగు కోణములు కలవు. దీనికి "సర్వ సౌభాగ్య చక్రమ"ని పేరు, ఈకారము దీనికి ప్రకృతి. పదునాలుగు భువనములకు స్థానము. దాడిమీ కుసుమ వర్ణము కలది. పూజ వామావర్తము. ఇచట పదునాల్గుమంది దేవతలు కలరు. వారు సర్వ సంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసమ్మోహినీ, సర్వస్తంభినీ, సర్వజృంభిణీ, సర్వవశంకరీ, సర్వరంజనీ, సర్వోన్మాదినీ, సర్వార్థ సాధినీ, సర్వ సంపత్తి పూరిణీ, సర్వ మంత్ర మయీ, సర్వద్వంద్వక్షయంకరి అనువారలు. యోగినులు కూడా వీరే. వీరు సంప్రదాయ యోగినులు. చక్రేశ్వరి త్రిపుర వాసిని. ముద్ర వశంకరీముద్ర. ముద్రాబీజము "బ్లూం". భయముస్థాయీభావము. రసము భయానకం. బీజ న్యాసము స్వాగ్రకోణము నుంచి, పం, ఫం, బం, భం, మం, యం, రం, లం, వం, శం, షం, సం, హం, క్షం - అనునవి. (కామకళావిలాసకర్త ఈ వివరించిన దానికి ఈ బీజన్యాసమునకు భేదముగమనించునది) శ్రీచక్రమేశరీరముగా నున్న సంవిద్రూప పరదేతయొక్క ఇంద్రియ దశకమును, అంతఃకరణ చతుష్టయమును ఇచట దేవతారూపములను ధరించియున్నారు

## అష్టదళపద్మము

దీనికి సర్వసంక్షోభిణీ చక్రమని పేరు, హకార ప్రకృతి కలది జపాకుసుమ వర్ణము కలది. అష్టమూర్త్యాత్మకమైనది. పూజ సవ్య క్రమము. ఇచట ఎనిమిది మంది దేవతలున్నారు. వారు అనంగ కుసుమా, అనంగ మేఖలా: అనంగ మదనా, అనంగ మదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ అనుపేర్లు గలవారు. ఇచట దేవతలు గుప్తతరయోగినులు. చక్రేశ్వరిత్రిపుర సుందరి. ముద్ర సర్వాకర్షిణీముద్ర. ముద్రాబీజము క్లీం. శోకము స్థాయీ భావము, రసము కరుణ. అం, ఇం. ఉం, ఋం, ఌం, ఎం, ఒం, అం - అను హ్రస్వస్వరములు కలవు. శ్రీచక్రమేశరీర ముగా యున్న సంవిద్రూప పర దేవత యొక్క అవ్యక్త, మహత్తత్త్వాహంకారముల, భూతతన్మాత్రాపంచకము దేవతాస్వరూపములుగా యున్నవి.

## 8. షోడశదళపద్మము

దీనికి సర్వాశాపరిపూరక చక్రమనిపేరు, యిది సకారప్రకృతి చంద్రికళాస్వరూపాత్మకమైనది, శ్వేతవర్ణముగలది. అమృత రస స్రావము కలది. యిచటపూజ ప్రాదక్షిణము. యిక్కడ పదునారు దేవతలున్నారు. వారు నిత్య కళలు — వారు కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణీ, అహంకారాకర్షిణీ. శబ్దాకర్షిణీ, స్పర్శాకర్షిణీ, రూపాకర్షిణీ, రసాకర్షిణీ, గంధాకర్షిణీ, చిత్తాకర్షిణీ, ధైర్యాకర్షిణీ, స్మృత్యాకర్షిణీ, నామాకర్షిణీ, బీజాకర్షిణీ, ఆత్మాకర్షిణీ, అమృతాకర్షిణీ, శరీరాకర్షిణీ అనుపేర్లు

యున్నారు. అకారాది పదహారు స్వరములుగానున్న షోడశ
ము నందు వీరు కలరు. చక్రేశ్వరి త్రిపుర సుందరి. ముద్ర
ద్రావిణీ ముద్ర. ముద్రాబీజము "ద్రీం". ఉత్సాహము
యా భావము. రసము వీరము. యిచట బీజ న్యాసము అ
, ఇం, ఈం, ఉం, ఊం, ఋం, ౠం, ఌం, ౡం, ఏం, ఐం
, ఔం, అం, అః.

శ్రీచక్రమే శరీరముగానున్న సంవిద్రూప పరదేవత యొక్క
రమందున్న పృథివీ మొదలగు భూతపంచకము, షోడశకలారూప
ములయిన షోడశ స్వరములు, పంచదశనిత్యలు, మహానిత్య—ఈ
మూడుతత్త్వములిచట దేవతలుగా యున్నారు.

"అవ్యక్తమహదహంకృతి తన్మాత్రా స్వీకృతాంగనాకారాః
ద్విరదచ్ఛదన సరోజే జయంతి గుప్తతరయోగిన్యః"

(కా.క.వి. - 44)

కాదిభిరష్టభిరావచితమష్టదళాబ్జంచ వై ఖరీవర్గైః
స్వరగణ సముదిత మేతద్వ్యష్ట దళాంభోరుహంచ సంచితవ్యం॥

(కా.క.వి. = ౪౩)

## 9. భూపురము

భూపురమందు మూడు భాగములు కలవు. శుక్ల వర్ణము గల
ప్రథమ భూపురమున వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, పశ్యంతీ,
యిచ్ఛా, జ్ఞాన, క్రియా, శాంతా—అను శక్తులున్నా, సర్వసంక్షో
భిణీ, సర్వ విద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వ వశంకరి, సర్వోన్మాదినీ,
సర్వమహాంకుశ, సర్వ ఖేచరీ, సర్వబీజి, సర్వయోనులను పొందవవి

రక్తవర్ణముకల మధ్య భూపురమున బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి. వైష్ణవి, వారాహి, మహేంద్రి, చాముండా, మహాలక్ష్మి అనుమాతృకలు కలరు, శ్రీదేవి సమష్టిరూప సప్తధాతువులే మాతృకారూపమున యుండుట. పీతవర్ణముగల తృతీయభూపురమున శ్రీవిద్యకుసంబంధించని మంత్రములు గలవు. సమష్టి భూపురము చతురస్రాకృతి, దీని పేరు త్రైలోక్య మోహన చక్రము అ కారము దీని ప్రకృతి తత్త్వము పృథివీ తత్త్వము. పూజ ప్రాగ్ దక్షిణము. యిచట దేవతలు అష్టసిద్ధులు—అవి అణిమాసిద్ధి, లఘిమాసిద్ధి, మహిమాసిద్ధి ఈశిత్వసిద్ధి, వశిత్వసిద్ధి, ప్రాకామ్యసిద్ధి, గరిమసిద్ధి, ప్రాప్తిసిద్ధి వీరు శుక్ల వర్ణము గలవారు. అంకుశము, పాశము, పద్మయుగ్మముల ధరించిన వారు. వీరు ప్రకటయోగినులు. ముద్ర సంక్షోభిణి ముద్ర, ముద్రాబీజము "ద్రాం" చక్రేశ్వరి త్రిపురాదేవి, స్థాయీ భావమురతి. రసము శృంగారము. యిచట బీజన్యాసము వృత్త త్రయముమనకుపైన ఐం, క్లీం, సౌః అనునవి, ప్రాదక్షిణముగా వృత్త త్రయముమనకు పైన ప్రథమ భూపురమున స్వాగ్రము నుంచి దిక్కులందు, విదిక్కులందు, ద్రాం, ద్రీం, క్లీం. బ్లూం. సః. హ్స్ప్రైం సౌః. ఐం... అనునవి. ద్వితీయభూపురమున బ్రాహ్మీ మాతృకయైః నమః మొదలగునవి. తృతీయభూపురమున ప్రాదక్షిణముగా అణిమాసిద్ధ్యైనమః మహిమా సిద్ధ్యైనమః .... యిట్లు అన్ని సిద్ధులకు అన్వయ్యించును.

"అణిమాది సిద్ధయోఽస్యాః స్వీకృత కమనీయ కామినీరూపాః
విద్యాంతర ఫలభూతా గుణభావేనాంత్యభూ నికేతనాగాః ॥

(కా.క.వి. - 49)

# శ్రీచక్రము - మానవుడు

బిందు ద్వితయం యద్వద్భేద విహీనం పరస్పరం తద్వత్
విద్యాదేవతయోరపి న భేదలేశోఽస్తి వేద్య వేదకయోః॥
(కా.క.వి. - 11)

శివునికీ శక్తికీ, దేవతకూ మంత్రమునకూ భేదములేదు ఉపాసకుని శరీరమగు పిండాండమునకు బ్రహ్మాండమునకు, బ్రహ్మాండమునకు పరాశక్తికీ, పరాశక్తి స్వరూపమైన శ్రీచక్రమునకునుభేదం లేదు.

మనము ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా బాహ్య ప్రపంచమున గల సకల తత్త్వాలును సకల భువనములును పరమశివుడు పరాశక్తులును మానవునియందుకూడాకలవు. మానవ దేహమును రెండుభాగములుగగుర్తించవలయును. నాభినుండిపైభాగమనియు దాని క్రిందనుండు భాగమనియు వానినే ఊర్ధ్వ లోకములనియు అధోలోకములనియుకూడ అందుము. వీటినికలిపియుంచునది వెన్నెముకయనబడు మేరుదండము. శ్రీచక్రమునుకూడ మేరువనెదము. మేరుపర్వతముకూడ భూమికి ఇరుసు వంటిది. ఏ విధముగానైతే శ్రీదేవియొక్కదివ్యస్వరూపకాంతులచే ఈజగత్తుఅంతయు ప్రకాశమానమగుచున్నదో అదే విధముగనే మనలోని మేరుదండములోని కుండలినీశక్తి దేహములోని ప్రతిభాగమునూ చేతనవంతముగా చేయుచున్నది. మనలో ఆత్మవున్నదనిఅంగీకరించెదమే కానీ దేహముయొక్క ప్రాధాన్యతను గుర్తించము: కాదంటే ఈస్థూల సూక్ష్మ అవయవములను "కరణములు" పనిముట్లుగా గుర్తించెదము. మాన

వుడు జీవుడు మాత్రమే కాడు. ఆ జీవుని యొక్క శక్తులే ఈ ఇంద్రియాదులు. వేదఋషులు ఈసత్యమును ఎన్నడో గుర్తించిరి వాక్కు అగ్నిగా నేత్రములు సూర్యునిగా బలమును ఇంద్రుడుగా మనస్సును చంద్రుడుగా, దేహమును పృథివిగా, రేతస్సును జలముగా, క్రోవమును ఈశానుడుగా. జననాంగమును బ్రహ్మగా, వెంట్రుకలు ఓషధులుగా, ఇంకనూ నాడులకు వివిధదేవతలను అధిదేవతలుగా గుర్తించిరి. శాక్తము ఇంకనూ ముందుకు పోయి, షట్చక్రములను, ప్రాణవాయువులను, నాడులను, ధాతువులను అన్నింటినీ పరాశక్తి యొక్క అంశలుగానే గుర్తించినది. శాక్తఉపనిషత్తులలోఅతిముఖ్యమైన భావనోపనిషత్తు శ్రీచక్రము లోని నవావరణములను మానవ దేహమునకు అన్వయింపజేసినది. ఈ సమన్వయము భావన వలననే సాధ్యము.

# భావనోపనిషత్

శ్రీచక్రార్చనలో మనము భూపురములోని ప్రథమ ఆవరణము లోని ఆవరణ దేవతలను పూజించెదము, వారు అణిమాది సిద్ధులు: అణిమ, లఘిమ, గరిమ, మహిమ, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, భుక్తి, ఇచ్ఛ, ప్రాప్తి, సర్వకామసిద్ధులు. ఇవిమనలోని వివిధము లైన మానసిక ప్రవృత్తులు. ఇవి నవరసములు. శృంగార, వీర కరుణ, అద్భుత, హాస్య, భయానక, బీభత్స, రౌద్ర, శాంతరసములు (నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః 11) భూ పురములోని ద్వితీయ రేఖ యందు దేవతలు ఎనిమిది మంది, వారు బ్రాహ్మి, మహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, మహేంద్రీ, చాముండా, మహాలక్ష్మి. వీరుఅష్టమాతృకలు. అవి మానవునిలోని కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు ఆరున్నూ, వాటితో మన పుణ్య పాపములు కలిసి ఎనిమిదిఅగుచున్నారు. భూ పురములోని తృతీయరేఖయందున్న ముద్రాదేవతలు: సర్వసంక్షో భిణీ, సర్వ విద్రావిణీ, సర్వాకర్షిణి, సర్వ వశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరీ, సర్వబీజ, సర్వయోని .... వీరు మన దేహమందలి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ లంబికాగ్ర, ఆజ్ఞా, సహస్రార ద్వాదశాంతచక్రములు, (ఆధారనవ కం ముద్రాశక్తయః-12) శ్రీచక్రము నందలి రెండవ ఆవరణము షోడశదళపద్మము. అందు పదునారుమంది దేవతలుకలరు. అందు పృథివ్యాది పంచభూతములు, జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రి యములు ఐదు, మనస్సు — ఇవి పదహారు దేవతలు. ఇవియే శ్రీ చక్రమందుగల కామాకర్షిణీ, బుద్ధ్యాకర్షిణీ, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి

స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణీ, చిత్తాకర్షిణీ, ధైర్యాకర్షిణీ, స్మృత్యాకర్షిణీ, నామాకర్షిణి, మాయాకర్షిణీ బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి అమృతాకర్షిణి అనువారు. (పృధివ్యప్తేజో వాయ్వాకాశశ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణ వాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశ శక్తయః-14).

## 3. అష్టదళపద్మము

శ్రీ చక్రము మూడవ ఆవరణమందు ఎనిమిది మంది దేవతలు ఉన్నారు. మనదేహములోని కర్మేంద్రియాదుల ధర్మములు అనగా వచనము = మాట్లాడుట. దానము = ఇచ్చుట, గమనము = పోవుట, విసర్గము = మలమూత్రాదులను విసర్జించుట సంభోగము, ప్రవృత్తి = అంగీకరించుట, నివృత్తి = నిరాకరించుట, ఉపేక్ష = లక్ష్యము చేయకుండుట — అను ఎనిమిది మంది ప్రవృత్తులే అనంగకుసుమా, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ - అనుదేవతలు.(వచనాదానగమన విసర్గానంద హానోపాదానోపేక్షా బుద్ధయోనంగ కుసుమాది శక్తయోష్టౌ—15)

మన దేహమందున్న పదునాల్గునాడులే శ్రీ చక్రమందలి నాలుగవ ఆవరణమైన చతుర్దశారమందు దేవతలుగా యున్నారు. అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తి, జిహ్వా, యశస్వతీ, అశ్వినీ, గాంధారీ, పూషా, శంఖినీ:సరస్వతీ, ఇడా, పింగళా, సుషుమ్నా చేతి చతుర్దశనాడ్య, సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః)

శ్రీచక్రమున ఐదవ ఆవరణము బహిర శారము. ఇందు పది

మంది దేవతలున్నారు. మన దేహమందలి ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములను పంచప్రాణములును, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయులను ఐదు ఉపప్రాణములును కలిసి దశ దేవతలుగా యున్నారు. ఆ దేవతలు సర్వసిద్ధిప్రద సర్వసంపత్ప్రద సర్వప్రియంకరి సర్వమంగళకరి సర్వకామప్రద సర్వదుఃఖవిమోచని సర్వ మృత్యుప్రశమని సర్వవిఘ్ననివారిణి సర్వాంగసుందరి సర్వ సౌభాగ్యదాయినిఅనువారు. (ప్రాణోపాన వ్యానోదాన సమాన నాగ కూర్మ కృకర దేవదర్త దవంజ్ఞయా దశ వాయవ సర్వ సిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశ దేవతాః .... 17 (యిది సర్వార్థసాధకచక్రము.)

శ్రీచక్రమున ఆరవ ఆవరణము అంతర్దశారము. దానియందు పదిమంది దేవతలున్నారు. పైఆవరణములోని దశవిధప్రాణముల యొక్క సంసర్గమువలననే రేచక (ఊపిరి విడచుట) పూరక (ఊపిరి పూరించుట) శోషక (శోషిల్లుట) దాహక (ప్లావకగుణములు) చతుర్విధాన్నములను జీర్ణముచేయు శక్తులు కలుగుచున్నవి. ఆ దేవతలు సర్వజ్ఞ సర్వశక్తి సర్వైశ్వర్యప్రద సర్వజ్ఞానిమయి సర్వవ్యాధివినాశిని సర్వాధారస్వరూప సర్వపాపహర సర్వానందమయి సర్వ రక్షాస్వరూపిణి సర్వేప్సిత ఫలప్రద యనువారు. (ఏతద్వాయు దశక సంసర్గోపాగి భేదేన రేచక పూరత శోషక దాహక ప్లావకామృత మితి ప్రాణ ముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దాహకో భక్ష్యభోజ్యలేహ్యచోష్య పేయాత్మకం చతుర్విధ మన్నం పాచయం త్యేతాః దశ ధన కలాసర్వజ్ఞత్వాద్యంతర్దశార దేవతాః....18)

శ్రీచక్రమున ఏడవఆవరణము అష్టకోణచక్రము. దానియందు ఎనిమిదుమంది దేవతలుగలరు, శీత ఉష్ణ సుఖ దుఃఖ ఇచ్ఛ అను

ఐదును, సత్వరజస్తమో గుణములు మూడునూ కలిసి ఎనిమిది మంది దేవతలై యున్నారు, వాడ వశినీ కామేశ్వరీ మోదినీ విమలా అరుణా జయినీ సర్వేశ్వరీ క్షాళినీ అనువారు. వీరువాగ్దేవతలు (శీతోష్ణసుఖ దుఃఖేచ్ఛా సత్వరజస్తమో గుణా వశిన్యాది శక్తయోష్టౌ....19)

శబ్దస్పర్శరూపరసగంధాః పంచన్మాత్రా పంచపుష్పబాణాః(20 శ్రీదేవిహస్తమున ఐదు పుష్ప బాణములను ధరించియున్నది. అవి మన దేహము లోని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచ తన్మాత్రలే — ఆ పుష్పములు తామరపువ్వు, అశోకము, మామిడి, మల్లె, నల్లకలువలు, దేవి చేతిలో చెఱుకు విల్లు వుంది. సాధకుని మనస్సే ఆ విల్లు. వశ్యతి = బాణము, అనురాగము = పాశము, ద్వేషము = అంకుశము (మన ఇక్షుధనుః, వశ్యో బాణః, రాగఃపాశో ద్వేషోఽంకుశః - 21)

శ్రీ చక్రమునకు ఎనిమిదవ అవరణము త్రికోణము. అందు ముగ్గురు దేవతలున్నారు. కామేశ్వరి, వజ్రేశ్వరి. భగమాలిని అను వారు. వారే పార్వతీ, లక్ష్మి, సరస్వతులు, ఈ ముగ్గురూ సాధ కుని శరీరములోని అవ్యక్త, మహత్తత్వ, అహంకారములు.(అవ్యక్త మహత్తత్వాహంకారాః కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగ మాలిన్యోంతస్త్రి కోణాగ్రగా దేవతాః—22)

శ్రీ చక్రమున తొమ్మిదవ అవరణము బిందువు. ఇంత వరకు సాధకుని శరీరమందలి ఇంద్రియాదులు, మనోవికారములు మొద లగువాటిని అవరణదేవతలుగ చెప్పియున్నారు. ఈబిందువే శ్రీదేవి ఈబిందువునందు కామేశ్వర కామేశ్వరులు అనగా శివశక్తులు సమ్మే శనము. యిదియే సాధకుని శరీరమందున్న అత్మ. (శుద్ధాను

రూపాధిర్దేవతా తయోః కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైక రూపాదేవతా—24)

(నిరుపాధిక సందేవ కామేశ్వరః, సదానంద పూర్ణా స్వాత్మైవ పరదేవతా లలితా) స్వాత్మయే తనకంటే అభిన్నమేయై, పరదేవత సదానందపూర్ణ అయిన లలిత జ్ఞానస్వరూపిణిగా యున్నది.

ఈవిధముగా మానవుని దేహములోని ప్రతి అవయవమునకున్ను నాడులకున్నూ, భావ ఉద్దేకములకున్నూ, నవావరణములోని దేవతలకున్నూ, వీటన్నింటికీ స్ఫూర్తినిచ్చే ఆత్మయే లలితా భట్టారిక అనియు భావనోపనిషత్తు ఋజువుపరచినది. సాధకునిధ్యానము భావన, పూజ, బాహ్యము నుంచి లోనికి లోనికి చొచ్చుకొని పోతూ, ఆత్మవరకు చేరుకుంటుంది. మానవులందరికి ఒక విధమైన స్వభావము కలదు. దానినే "నియతి" అందుము. ఈసృష్టి యంతయు పరమాత్మయొక్క చిద్విలాసమే. దానినే "రస"మందుము. "రసో వై సః" = అపరమాత్మయే రస స్వరూపము. ఈ రసము నవ విధములు. శృంగారము నుంచి శాంతము వరకు గల నవ రసములు. అవియే కళలుగా, సంగీతంగా, శిల్పములుగా, కావ్యములుగారూపొందించబడినవి. పంచభూతములే కామక్రోధాదులుగాను, పుణ్య పాపములుగాను పరిణమించి, మానవుని నవావరణములందు వ్యాపించి, మానవుని జీవితాన్నిశాసించుచున్నవి. విశ్వములోని శక్తులన్నియు ఈనవావరణముల ద్వారా ద్యోతకమగుచు, మానవుని పంచ కోశములందు అనగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయకోశములందు యిమిడియున్నవి. యివన్నియు అనంగములే. అంగములు లేనివే. వీటన్నింటినీ దాటి బిందు స్థానము వరకు చేరుకోగానే అచ్చట అద్వితీయమైన, సచ్చిదానంద రూపమైన

స్వస్వరూపానుభవమును పొందుచున్నాడు. ఈ సాధనమందు సాధకుడు నామరూపాత్మకమైనజగత్తంతయు ఆపరాశక్తియొక్కవిభూతులే ననియు, వాటినిఅనుభవించుచు. వాటితోతానుకూడా తాదాత్మ్యమును పొందుచూ, తాను కూడా ఆ పరాశక్తి యొక్క స్వరూపమే ననియు, సిద్ధిని పొందుటయే భుక్తియనియు, ముక్తియనియు, అదియే మానవుని పరమావధియనియు శాక్త సిద్ధాంతసారము.

మనము శ్రీచక్రమునందు మొదట సందర్శించేది బిందువును. దానిచుట్టూ ఎనిమిది చక్రములున్నవి, బిందుస్థానమందు పరాభట్టారిక కలదు. ఆమెను సందర్శించాలంటే మనము ఈఎనిమిదిఆవరణములను, అనగా అవరోధములను అధిగమించ వలసి యున్నది. ఈ తొమ్మిది చక్రములను తొమ్మిది కోణములుగా పేర్కొనవచ్చును. ఇది బిందువును అనగా శ్రీలలితాదేవతను క్రమ్ముకొనియున్నవి. మనము ఈ ఎనిమిది అంతస్థులను ఎక్కిపోతేగానీ దేవీ దర్శనము గాదు. ఈ ప్రయాణము చాలా కష్టములతో కూడినది. ఒక్కసారిగ బిందుస్థానమును చేరుకొనుటకు సాధ్యము కాదు. దేవాలయములోనిఅనేకప్రాకారములనుదాటి, ఆయా ప్రాకారము లందలి అధిదేవతలను దర్శించి: వారి అనుజ్ఞను పొంది లోనికి పోగాపోగా, మన యిష్ట దేవత అయిన మూలవిరాట్టుయొక్క దర్శనము లభిస్తుంది. భూపురము నుంచి బిందువు వరకుగల ఆరోహణక్రమమునుకూడా మానవునిలోగలవివిధమైన భాగములను, అభాగములందుగల తత్త్వములను, అధిరోహించి సహస్రారమందలి పరమాత్మను దర్శించుటకు వీలగును. ఒకచక్రమును దాటి మరొక చక్రమునందు కొనుసపుడు మనముందు ఒకదానికి మించిన మరొక విశాలప్రాంగణములు ఎదురవుతాయి. కడపటికి బిందుస్థానము చేరుకోగానే, మనము నడచిలేక ఎక్కివచ్చిన శ్రమఅంతయు

చూచిన, అనుభవించినజగత్తంతయు మాయమైపోయి. అచటవుంటే శ్రీదేవిని దర్శన మాత్రమున సర్వము అనుభవము లోకి వచ్చును. సర్వమతనేయగును. అంతయుతానేనను అపరోక్షానుభూతికలుగును దీనినే శాక్తతంత్రము "నిధన ధనము" అని అంటుంది. ("గమ్యం లోని (చివరి) సంపద.")

ఈచక్రములను మనదేహముతో పోల్చుకొనినచో దుర్గాదేవిదర్శనము ఎంతదుర్గమమో అర్థముకాగలదు. కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, వీటి విషయీభూతములయిన పంచతన్మాత్రలు, వీటి వెంట పరుగెత్తే మనస్సు, దానినే నిర్ణయించే బుద్ధి, అహంకారములు మహత్, అవ్యక్తము, యివన్నీ ప్రసాదించే కామక్రోధాదులు, వీటి యొక్క అనుభవములయిన శృంగారాది రసములు, వీటిని అనుభవించే జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అవస్థలు, వీటిని నియమంచే సత్వ రజస్తమో గుణములు .... యివన్నీ కూడా ఆ పరాశక్తి యొక్క వివిధ శక్తులుగా గ్రహించుకొని, వాటిని సందర్శించి గమ్యస్థానమునకుచేరుకొనుట ఎన్ని జన్మలకు సాధ్యమో గుర్తించవలసియున్నది. మొదటి ఆవరణమే త్రైలోక్యమోహన చక్రము. అచ్చటనే అణిమాది అష్టసిద్ధులున్నవి. ఒకసిద్ధిని దర్శించే, పొందిన వెంటనే, అక్కడి కదే గమ్యమని, మన ప్రయాణాన్ని నిలుపుకుంటే, అక్కడికక్కడేతృప్తి పడి, స్థిరపడిపోతే. గమ్యాన్నెప్పటికి చేరుకోగలడు.? ఎందరోసాధకులు అక్కడే చేలచిపోవుటయేకాక పతనమైన ఘటనలు కూడా కలవు.

త్రైలోక్య మోహన చక్రమునుండీ సర్వానంద మయ చక్రము వరకు మనము ఎక్కవలసిన మెట్లు. తొలగించు కొనవలసిన తెరలు, అనుభవించుకొనవలసిన సుఖదుఃఖములు అన్నియు శ్రీ చక్రమందలి ఆవరణదేవతల వలె మనయందును కలవు. ఏ చక్రమునందలి అను

భూతి అంత వరకు సత్యమే. అది విద్య కాదు. ఆ అడ్డంకులు, పూర్తిగానిర్మూలించబడవు. మనముజాగ్రత్తగా, నెమ్మదిగా దాటుకొని పోవలయునేగాని, అక్కడవాటినిలేకుండాచేయలేము. త్యాగయ్య కూడా తెరను తొలగించమని ప్రార్థించినాడు కానీ. తెరను లేకుండా చేయమన లేదు. మనలోని ఈ ప్రాపంచిక ముప్పది ఆరు తత్త్వములు ఎపుడూ వుండనేవుంటాయి. ఈ త్రిపుటులు, ఈనవావరణలు వుండుటే సహజము. వాటిని నిర్లిప్తతతో, నిష్కామంగా, నిస్వార్థంగా అనుభవించుతూ గమ్యాన్ని చేరుకో వలయుననే గానీ, వేరే మార్గము లేదు. "తేన త్యక్తేన భుంజీథా" అని ఈశాన్యోపనిషత్తు ఈ ఆవరణలు అసలేలేకుండాపోతే, ఆ తర్వాత పూజఎందుకు? సాధన ఎందుకు? బిందు స్థానమున నెలకొని యున్న పరాశక్తి యొక్క పరివార దేవతలే గదా మిగతా చక్రముల లోని దేవతలు గూడా! ఆమెవున్నచోట వీరు తప్పక వుంటారు. ఏ ఏ ఆవరణలో సిద్ధులు, మాతృకలు, యోగినులు, దేవతలు కలరో మనము లోగడ వివరము తెలుసుకొనియున్నాము.

ఒక్కొక్క ఆవరణలోనీ దేవతను సాక్షాత్కరించుకొనుటకు కొన్ని ప్రత్యేక బీజమంత్రములు కలవు. వాటినినవావరణల వివరములలో పేర్కొనీ యున్నాము. ఈ పూజవలన మనిషిలోనీ అద్భుతశక్తులు ప్రత్యక్షమగును, ఈ పూజలు ఏ ఒక్క కులానికో, జాతికో గాక అందరికీ ఆచరణ యోగ్యము. ఈఅధ్యాత్మికసాధనలో పొందు మహదైశ్వర్యమును పొందుటకు అందరూ అర్హులే. శ్రీమాత అనగా అందరికీ తల్లికదా! దేవతలకు, రాక్షసులకు, పుణ్యాత్ములకు, పాపాత్ములకు కూడా ఆమె తల్లియే. ఆమె అవ్యాజ కరుణామూర్తి. అసలు

మంత్రజపము పనిలేదు. యంత్రపూజా పనిలేదు. ఒక శరణాగతి లేక ప్రపత్తి చాలును. తన బిడ్డవేసే తప్పటడుగులను చూచి తల్లి తప్పుపట్టునా ? భూమిమీద నడుస్తూ జారితే ఆ భూమినే పట్టుకోవాలి

"భూమౌస్ఖలితపాదానాం భూమిరేవావలంబనం
త్వయిజాతాపరాధానాం త్వమేవ శరణం శివే"



శ్రీ రస్తు

# శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రమ్

ధ్యానమ్ :- అస్య శ్రీలలితాసహస్రనామ స్తోత్రమహామంత్రస్య వశిన్యాది వాగ్దేవతా ఋషయః అనుష్టుప్ఛన్దః శ్రీలలితా పరాభట్టారికా మహా త్రిపుర సుందరీ దేవతా, ఐం బీజం, సౌః-శక్తిః, క్లీం కీలకం, మమ చతుర్విధపురుషార్థసిద్ధ్యర్థే జపేవినియోగః, ఐం-అంగుష్ఠాభ్యాం నమః, క్లీం-తర్జనీభ్యాం నమః, సౌః-మధ్యమాభ్యాం నమః, సౌః-అనామికాభ్యాం నమః, క్లీం-కనిష్ఠికాభ్యాం నమః, ఐం - కరతలకర పృష్ఠాభ్యాం నమః, ఐం-హృదయాయ నమః, క్లీం-శిరసే స్వాహా, సౌః-శిఖాయై వషట్, సౌః-కవచాయ హుం, క్లీం-నేత్ర త్రయాయ వౌషట్, ఐం-అస్త్రాయ ఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః

ధ్యానమ్ :-

అరుణాం కరుణాతరంగితాక్షీం ధృతపాశాఙ్కుశ పుష్పబాణచాపామ్
అణిమాదిభిరావృతాం మయూఖై రహమిత్యేవ విభావయే మహేశీమ్

ధ్యాయేత్పద్మాసనస్థాం, వికసితవదనాం, పద్మపత్రాయతాక్షీం
హేమాభాం, పీతవస్త్రాం కరకలితలసద్ధేమపద్మాం వరాఙ్గీమ్
సర్వాలంకారయుక్తాం సకలమభయదాం భక్తనమ్రాంభవానీం
శ్రీవిద్యాం శాన్తమూర్తిం సకల సుర నుతాం సర్వ సంపత్ప్రదాత్రీం

సకుంకుమవిలేపనాం మళికచ్చుమ్బికస్తూరికాం
సుఘన్దహసితేక్షణాం స శరచాపపాశాఙ్కుశామ్
అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్జ్వలాం
జపాకుసుమభాసురాం జపవిధౌస్మరే దమ్బికామ్

సిందూరారుణవిగ్రహాం త్రినయనాం మాణిక్యమౌళిస్ఫుర
త్తారనాయక శేఖరాం స్మితముఖీమా పీనవక్షోరుహాం
పాణిభ్యామలిపూర్ణరత్న చ షకం రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రత్నఘటస్థరక్త చరణాం ధ్యాయేత్పరామంబికామ్

లమిత్యాది పంచపూజాం విభావయేత్. తద్యథా:- లం-పృథివీ తత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యైగంధం పరికల్పయామి. హం-అకాశ తత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యైపుష్పంపరికల్పయామి. యం-వాయు తత్త్వాత్మికాయై ధూపం పరికల్పయామి. రం-వహ్నితత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై దీపం పరికల్పయామి వం-అమృతతత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యై అమృతనైవేద్యం పరికల్పయామి సం-సర్వతత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యై తాంబూలాది సర్వోపచారాన్పరికల్పయామి

ఇతి స్తోత్రాదౌ ఋష్యాదిన్యాస పంచపూజాం కృత్వా
సహస్రనామ స్తోత్ర పారాయణం శ్రీదేవ్యా దక్షిణహస్తే
జలధారా పూర్వకం సమర్పణం కుర్యాత్ శ్రీదేవీం
ధ్యాత్వా విహరేతే సర్వత్ర విజయః

శ్రీ ర స్తు

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రమ్

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రేనమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరి
చిదగ్ని కుండ సంభూతా దేవకార్యసముద్యతా 1

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా
రాగస్వరూప పాశాఢ్యా క్రోధా కారాంకుశోజ్జ్వలా 2

మనోరూపేక్షు కోదండా పంచతన్మాత్ర సాయకా
నిజారుణప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా 3

చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా
కురువింద మణిశ్రేణీ కనత్కోటీర మండితా 4

అష్టమీచంద్ర విభ్రాజ దళికస్థల శోభితా
ముఖచంద్ర కళంకాభ మృగనాభివిశేషికా 5

వదనస్మర మాంగళ్య గృహతోరణచిల్లి కా
వక్త్రలక్ష్మిపరీవాహ చలన్మీనాభ లోచనా 6

నవచంపక పుష్పాభ నాసాదండ విరాజితా
తారాకాంతి తిరస్కారి నాసాభరణ భూషితా 7

కదంబమంజరీక్లుప్త కర్ణపూర మనోహరా
తాటంకయుగలీభూత తపనోడుప మండలా 8

పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః
నవవిద్రుమ బింబశ్రీన్యక్కారి రదనచ్ఛదా 9

సకుంకుమవిలేపనాం మళికచ్చుమ్బికస్తూరికాం
సుమన్దహసితేక్షణాం స శరచాపపాశాఙ్కుశామ్
అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్జ్వలాం
జపాకుసుమభాసురాం జపవిధౌస్మరే దమ్బికామ్

సిందూరారుణవిగ్రహాం త్రినయనాం మాణిక్యమౌళిస్ఫుర
త్తారనాయక శేఖరాం స్మితముఖీమా పీనవక్షోరుహాం
పాణిభ్యామలిపూర్ణరత్న చ షకం రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రత్నఘటస్థరక్త చరణాం ధ్యాయేత్పరామంబికామ్

లమిత్యాది పంచపూజాం విభావయేత్. తద్యథా:- లం-పృథివీ తత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యైగంధం పరికల్పయామి. హం-అకాశ తత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యైపుష్పంపరికల్పయామి. యం-వాయు తత్త్వాత్మికాయై ధూపం పరికల్పయామి. రం-వహ్ని తత్త్వాత్మికాయై శ్రీ లలితాదేవ్యై దీపం పరికల్పయామి వం-అమృతతత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యై అమృతనైవేద్యం పరికల్పయామి సం-సర్వతత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యై తాంబూలాది సర్వోపచారాన్పరికల్పయామి

ఇతి స్తోత్రాద్దా ఋష్యాదిన్యాస పంచపూజాం కృత్వా
సహస్రనామ స్తోత్ర పారాయణం శ్రీదేవ్యా దక్షిణహస్తే
జలధారా పూర్వకం సమర్పణం కుర్యాత్ శ్రీదేవీం
ధ్యాత్వా విహరేతే సర్వత్ర విజయః

శ్రీ ర స్తు

# శ్రీ లలితా సహస్రి నామ స్తోత్రమ్

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రేనమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ
చిదగ్ని కుండ సంభూతా దేవకార్యసముద్యతా 1

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా
రాగస్వరూప పాశాఢ్యా క్రోధా కారాంకుశోజ్జ్వలా 2

మనోరూపేక్షు కోదండా పంచతన్మాత్ర సాయకా
నిజారుణప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా 3

చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా
కురువింద మణిశ్రేణీ కనత్కోటీర మండితా 4

అష్టమీచంద్ర విభ్రాజ దళికస్థల శోభితా
ముఖచంద్ర కళంకాభ మృగనాభివిశేషికా 5

వదనస్మర మాంగళ్య గృహతోరణచిల్లికా
వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభ లోచనా 6

నవచంపక పుష్పాభ నాసాదండ విరాజితా
తారాకాంతి తిరస్కారి నాసాభరణ భూషితా 7

కదంబమంజరీక్లుప్త కర్ణపూర మనోహరా
తాటంకయుగలీభూత తపనోడుప మండలా 8

పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః
నవవిద్రుమ బింబశ్రీన్యక్కారి రదనచ్ఛదా 9

శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా
కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా 10

నిజసల్లాప మాధుర్యవినిర్భర్త్సితకచ్ఛపీ
మందస్మిత ప్రభాపూర మజ్జగత్కామేశ మానసా 11

అనాకలిత సాదృశ్య చుబుకశ్రీవిరాజితా
కామేశబద్ధమాంగల్య సూత్రశోభిత కంధరా 12

కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా
రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తాఫలాన్వితా 13

కామేశ్వర ప్రేమరత్న మణిప్రతిపణస్తనీ
నాభ్యాలవాల రోమాళి లతాఫల కుచద్వయీ 13

లక్ష్య రోమలతా ధారతాసమున్నేయ మధ్యమా
స్తనభార దళన్మధ్యపట్టబంధవళిత్రయా 15

అరుణారుణ కౌసుంభ వస్త్ర భాస్వత్కటీతటీ
రత్న కింకిణి కారమ్య రశనాదామ భూషితా 18

కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా
మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా 17

ఇంద్రగోప పరిక్షిప్త స్మరతూణాభ జంఘికా
గూఢగుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా 18

నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా
పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా 19

శింజానమణి మంజీర మండితశ్రీ పదాంబుజా
మరాళీమందగమనా మహాలావణ్య శేవధిః 20

సర్వారుణాఽనవద్యాంగి సర్వాభరణ భూషితా
శివకామేశ్వరాంకస్థా శివా స్వాధీనవల్లభా 21

సుమేరు శృంగమధ్యస్థా శ్రీమన్నగర నాయికా
చింతామణి గృహాంతస్థా పంచబ్రహ్మాసనస్థా 22

మహాపద్మాటవీ సంస్థా కదంబ వనవాసినీ
సుధాసాగర మధ్యస్థా కామాక్షీ కామదాయినీ 23

దేవర్షిగణ సంఘాతస్తూయమానాత్మ వైభవా
భండాసుర వధోద్యుక్త శక్తిసేనా సమన్వితా 24

సంపత్కరి సమారూఢ సింధుర వ్రజ సేవితా
అశ్వారూఢాధిష్ఠితాశ్వ కోటికోటిభిరావృతా 25

చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా
గేయచక్ర రథారూఢ మంత్రిణీ పరిసేవితా 26

కిరిచక్ర రథారూఢ దండనాథ పురస్కృత
జ్వాలామాలినికాక్షిప్త వహ్నిప్రాకార మధ్యగా 27

భండసైన్యవధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా
నిత్యావరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా 28

భండపుత్ర వధోద్యుక్త బాలావిక్రమనందితా
మంత్రిణ్యంబావిరచిత విషంగవదతోషితా 29

విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్యనందితా
కామేశ్వర ముఖాలోక కల్పితశ్రీ గణేశ్వరా 30

మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా
భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ 31

కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః
మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధా సురసైనికా 32

కామేశ్వరాస్త్రనిర్దగ్ధ సభండాసుర శూన్యకా
బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవ సంస్తుత వైభవా 33

హరనేత్రాగ్ని సందగ్ధకామ సంజీవనౌషధిః
శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖ పంకజా 34

కంఠాధఃకటి పర్యంత మధ్యకూట స్వరూపిణీ
శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణీ 35

మూల మంత్రాత్మికా మూలకూటత్రయ కళేబరా
కుళామృతైకరసికా కుళ సంకేతపాలినీ 36

కుళాంగనా కుళాంతస్థా కౌళినీ కుళయోగినీ
ఆకుళా సమయాంతస్థా సమయాచార తత్పరా 37

మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథి విభేదినీ 38

అజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ
సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ 39

తటిల్లతాసమరుచిష్షట్చక్రోపరి సంస్థితా
మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ 40

భవానీ భావనాగమ్యా భవారణ్య కుఠారికా
భద్రప్రియా భద్రమూర్తిర్భక్త సౌభాగ్యదాయినీ 41

భక్తప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా
శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ 42

శాంకరి శ్రీకరిసాధ్వీ శరశ్చంద్ర నిభాననా
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా 43

నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా 44

నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా 45

నిష్కారణా నిష్కళంకా నిరుపాధిర్నిరీశ్వరా
నీరాగారాగమథనీ నిర్మదా మదనాశినీ 46

నిశ్చింతా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ
నిర్మమా మమతా హంత్రీ నిష్పాపా పాపనాశినీ 47

నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ
నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ 48

నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ
నిర్నాశా మృత్యుమథనీ నిష్క్రియా నిష్పరిగ్రహా 49

నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా
దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా 50

దుష్టదూరా దురాచార శమనీ దోషవర్జితా
సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధిక వర్జితా 51

సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా
సర్వేశ్వరీ సర్వమయీ సర్వమంత్ర స్వరూపిణీ 52

సర్వయంత్రాత్మికా సర్వతంత్రరూపా మనోన్మనీ
మాహేశ్వరీ మహాదేవీ మహాలక్ష్మీర్మృడప్రియా 53

మహారూపా మహాపూజ్యా మహాపాతక నాశినీ
మహామాయా మహాసత్వా మహాశక్తిర్మహారతిః 54

మహాభోగా మహైశ్వర్యా మహావీర్యా మహాబలా
మహాబుద్ధి ర్మహాసిద్ధి ర్మహాయోగీశ్వరేశ్వరీ 55

మహాతంత్రా మహామంత్రా మహాయంత్రా మహాసనా
మహాయాగ క్రమారాధ్యా మహాభైరవ పూజితా 56

మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణి
మహాకామేశ మహిషీ మహాత్రిపుర సుందరీ

చతుష్షష్ట్యుపచారాఢ్యా చతుష్షష్టి కళామయీ
మహాచతుష్షష్టియోగినీగణ సేవితా 58

మనువిద్యా చంద్రవిద్యా చంద్రమండల మధ్యగా
చారురూపా చారుహాసా చారుచంద్ర కళాధరా 59

చరాచర జగన్నాథా చక్రరాజ నికేతనా
పార్వతీ పద్మనయనా పద్మరాగ సమప్రభా 60

పంచప్రేతాసనాసీనా పంచబ్రహ్మ స్వరూపిణీ
చిన్మయీ పరమానందా విజ్ఞానఘన రూపిణీ 61

ధ్యాన ధ్యాతృ ధ్యేయరూపా ధర్మాధర్మ వివర్జితా
విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా 62

సుప్తాప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థా వివర్జితా
సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ 63

సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ
సదాశివానుగ్రహదా పంచకృత్య పరాయణా 64

భానుమండల మధ్యస్థా భైరవీ భగమాలినీ
పద్మాసనా భగవతీ పద్మనాభ సహోదరీ 65

ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః
సహస్రశీర్ష వదనా సహస్రాక్షి సహస్రపాత్ 66

ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమ విధాయినీ
నిజాజ్ఞా రూప నిగమా పుణ్యాపుణ్యఫలప్రదా 67

శ్రుతి సీమంత సిందూరీకృత పాదాబ్జ ధూళికా
సకలాగమ సందోహ శుక్తి సంపుట మౌక్తికా 68

పురుషార్థప్రదా పూర్ణాభోగినీ భువనేశ్వరీ
అంబికాఽనాది నిధనా హరిబ్రహ్మేంద్ర సేవితా 69

నారాయణీ నాదరూపా నామరూప వివర్జితా
హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా 70

రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవలోచనా
రంజని రమణి రస్యా రణత్కింకిణి మేఖలా 71

రమా రాకేందువదనా రతిరూపా రతిప్రియా
రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలంపటా 72

కామ్యా కామకలా రూపా కదంబకుసుమప్రియా
కళ్యాణీ జగతీకందా కరుణారస సాగరా 73

కళావతీ కళాలాపా కాంతా కాదంబరీ ప్రియా
వరదా వామనయనా వారుణీమదవిహ్వలా 74

విశ్వాధికా వేదవేద్యా వింధ్యాచలనివాసినీ
విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ 75

క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ
క్షయవృద్ధి వినిర్ముక్తా క్షేత్రపాల సమర్చితా 76

విజయా విమలా వంద్యా వందారు జనవత్సలా
వాగ్వాదినీ వామకేశీ వహ్నిమండలవాసినీ

భక్తిమత్కల్పలతికా పశుపాశవిమోచనీ
సంహృతా శేషాపాషండా సదాచార ప్రవర్తికా 78

తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా
తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోఽపహా 79

చితిస్తత్పదలక్ష్యార్థా చిదేకరస రూపిణీ
స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః 80

పరాప్రత్యక్చితీరూపా పశ్యంతీ పరదేవతా
మధ్యమా వైఖరీరూపా భక్తమానస హంసికా 81

కామేశ్వర ప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా
శృంగారరస సంపూర్ణా జయా జాలంధర స్థితా 82

ఓడ్యాణ పీఠనిలయా బిందుమండల వాసినీ
రహోయాగక్రమారాధ్యా రహస్తర్పణ తర్పితా 83

సద్యఃప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా
షడంగదేవతాయుక్తా షాడ్గుణ్య పరిపూరితా 84

నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణ సుఖదాయినీ
నిత్యా షోడశికా రూపా శ్రీకంఠార్ధ శరీరిణీ 85

ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ
మూలప్రకృతి రవ్యక్తా వ్యక్తావ్యక్త స్వరూపిణీ 86

